# భారతి

సాహిత్య మాసపత్రిక

మే 1980



వ్యవస్థాపకులు

దేశోద్ధారక నాగేశ్వరరావు పంతులు

# భారతి

మాసపత్రిక



శివలెంక శంభుప్రసాద్

సంపాదకుడు

(1938-1972)



మే 1980

సంపుటము : 57 సంచిక : 5



విడిప్రతిక వెల రూపాయిన్నర

# విషయానుక్రమణిక

## మే 1980





# భారతీ!

శ్రీ బులుసు వేంకటేశ్వరులు

ఒప్పఁగ మహా కవీశ్వరు లుజ్జ్వల భవ
దీయ రూపము భావించి వేయి నోళ్ల
సంస్తుతింతురు నీయంద చందములను
భారతీ! నీవు పరమ సౌభాగ్యవతివి.

నీవు ఛందోమయివి శక్తి నిచయ నిధివి
రాగతాళలయ స్థాన భోగవతివి
గానమయతయే నీ మహా ఘనత దేవి!
భారతీ! నీవు పరమ సౌభాగ్యవతివి.

సన్నజాజులకంటెను సంపఁగి కుసు
మములకంటె సువాసన అమలతావ
కీన పదముల కున్న దెంతైనఁగాని
భారతీ! నీవు పరమ సౌభాగ్యవతివి.

ఒక్కట మనోహరంబుగా యుష్మదీయ
కావ్యగానముఁ గావించి గాయక వరు
లుర్వి తాళ్లను గరఁగించు చుందు రమ్మ!
భారతీ! నీవు పరమ సౌభాగ్యవతివి.

వివిధశాఖలుగా నీవు విస్తరిల్లి
శాఖ శాఖను మిగులఁ బ్రశంసనీయ
యశము నింపితి వమ్మ! నల్ దిశల నాంధ్ర
భారతీ! నీవు పరమ సౌభాగ్యవతివి.

ఒకటఁ బ్రాచీన వైభవ ముట్టిపడఁగ
నొకట నధునాతన విధాన మొప్పుచుండఁ
బ్రాంత క్రొత్తల కలయికఁ బరగుచుందు
భారతీ! నీవు పరమ సౌభాగ్యవతివి.

భావ కవితకుఁ బరమ సంభావనీయ
భావి కవితకు స్వేచ్ఛాకవనమునకును
నీవు నిలయంబవై యుండనేర్తు వెపుడు
భారతీ! నీవు పరమ సౌభాగ్యవతివి.

ఎవరెవరు భక్తితోడ ని న్నేవిధమునఁ
గొల్చినను జాల మది మెచ్చుకొందు వమ్మ!
ద్వేషమును రాగమును లేవు దేవి! నీకు
భారతీ! నీవు పరమ సౌభాగ్యవతివి.

పండువాఱిన సుకవుల భవ్యకవిత
చిలిపి చేష్టల బాలుని స్వీయ కవిత
క్రొత్త క్రొత్త పోకడలు నీకుం బ్రియములు
భారతీ! నీవు పరమ సౌభాగ్యవతివి.

భారతి యనంగ విజ్ఞాన భాండ మనఁగ
జ్ఞానవారాశి యనఁగఁ బ్రశంసనీయ
మగు పరబ్రహ్మ మనఁగ నీఁ వౌదు వమ్మ!
భారతీ! నీవు పరమ సౌభాగ్య వతివి.



# కన్నీటిని విశ్లేషిస్తే మంటలు...

## శ్రీ రామచంద్రమౌళి

ఆగిపోయిన గడియారాన్ని చూచినప్పుడల్లా
నాలో ఎందుకో ఓ ప్రపంచం కూలి ధ్వంసమైపోతున్నట్టుగా బాధ
రేఖాంశాల మెట్లను దాటుకుంటూ పోతున్న కాలం
అప్పుడప్పుడు నా కళ్ళవాకిట్లో పసిపాపలా నిలబడి నవ్వుతుంది
ఉత్ఖాతనాల్లోంచి శోధించి, తుడిచి నా దోసిట్లో పట్టుకొచ్చిన చరిత్ర
కాలం విడిచిపోయిన ఓ స్మృతిముద్ర
ఎక్కడి లోయలు...ఎక్కడి మైదానాలు...ఎక్కడి స్ఫింక్స్...ఎక్కడి జైళ్ళలో చచ్చిపోయిన మేధలు
వేల ఏండ్లను పొదుచుకుని పొచ్చుకొస్తున్న ''జీవితం'' అన్న ప్రశ్న
ఓ కొడవలై నిలబడి ప్రశ్నిస్తోంది కోట్ల గొంతుల ఆకలితో –
కాలం పాపను కనుపాపలలో లీనం చేసుకుని చిటికెనవ్రేలుతో నడిపించుకుంటూ
నరాల వీధుల్లోంచి
హృదయ స్తరాంతరాల్లోకి వెళ్ళిపోతా ఓ అమృతానుభూతితో –
బోసినోటిలోనుంచి మొలిచే మాటల తోటల్లో
జ్ఞాన గ్రంథాలు...గంధాలు ఎగిరే పిచ్చుకల గుంపులా మధుశబ్దాల విందు చేస్తాయి
యాత్ర సాగుతూనేఉంది పోరాటధారల్లోంచి – ప్రశాంత తీరాలవరకు
కన్నీటిని విశ్లేషించగానే
మంటలు కనిపిస్తున్నాయి జీవితాలను కాల్చేస్తూ –
జ్వాలల జెండాలను ఎగురేస్తూపోతున్న యీ లక్షల చేతులు
సముద్రాన్ని బ్రతికించే మబ్బుల్లా – యీ దేశాన్ని జీవింపజేసే ఊపిరులు
ఆకాశమెంత విశాలంగా ఉంటుందో
తన్నుకుని తన్నుకుని తల్లియై రవ్వంత సూర్యశిశువును కంటుంది లోకాన్నేలేందుకు
దేశంకూడా అంతే
యీ మట్టిలోనుంచి మరోమహామూర్తిని అవిష్కరిస్తుంది...,
అప్పుడు చచ్చిపోయిన గడియారంలో బందీయైన కాలాన్ని విడిపించుకుని
బొచ్చుకుక్కలా నా వెంటపెట్టుకుని
నడచిపోతా అవతలిగట్టువైపు !



శ్రీ తిరుమల రామచంద్ర

# వజ్జాలగ్గంలో తెలుగు పదాలు

వజ్జాలగ్గం హాలుని గాథాసప్తశతి వంటి ప్రాకృతగాథా సంకలనం. హాలుని గాథలు ముక్తకాలు; వజ్జాలగ్గం భర్తృహరి సుభాషితాల వలె వివిధ విషయ గుచ్ఛాల సంకలనం. ''ఒక ప్రస్తావానికి సంబంధించిన అనేక గాథలు వజ్జ. అలాటివాటి సంకలనం – లగ్గం–వజ్జాలగ్గం వజ్జా అంటే పద్ధతి''[1] అని వజ్జాలగ్గ రచయితే ఉపక్రమణికలో చెప్పుకున్నాడు. దీని రచయిత శ్వేతాంబర జైన సంప్రదాయానుయాయి అయిన జయవల్లభుడు. వజ్జాలగ్గానికి ఆతడు జయవల్లభం[2] అనే పేరు పెట్టాడు. కాని వజ్జాలగ్గమనే ప్రఖ్యాతి చెందింది. జయవల్లభుని కాలంపై చర్చలు చాల జరిగాయి. ఆచార్య మాధవ వాసుదేవ పట్వర్ధన్ క్రీస్తుశకం 750–1337 మధ్య వుంటుందన్నారు.[3]

ప్రాకృత సాహిత్యం ప్రధానంగా జానపద సాహిత్యం గనుక, దానికి ముగ్ధులైన సహృదయ కవులు జనపద వ్యవహృతమైన దేశీ పదాలను కూడ గ్రహించారు. ఈవిధంగా హాలుని గాథాసప్తశతిలోనే ఎన్నో దేశీ పదాలు చేరినప్పుడు, వజ్జాలగ్గంలో చేరడంలో ఆశ్చర్యం ఏమీలేదు. ప్రాకృత సాహిత్యంలో చేరిన దేశీ పదాలను ఆచార్య హేమచంద్రుడు దేశీ నామమాలలో పొందుపరచాడు. గాథా సప్తశతిలోని తెలుగు పదాలను, దేశీ నామమాలలోని మరికొన్ని తెలుగు పదాలను (శ్రీమాన్ పరవస్తు రామానుజస్వామిగారు చెప్పగా మిగిలినవి) 'భారతి' పాఠకులకు ఇదివరకే మనవి చేశాను. ఇప్పుడు వజ్జాలగ్గంలోని తెలుగు పదాలను పరిచయం చేస్తున్నాను.

తెలుగు పదాలు అనగానే ఇప్పుడు వ్యవహారంలో ఉన్న పదాలేనని భ్రాంతి పడరాదు. ఇప్పటి పదాల మూలరూపమని గుర్తుంచుకోవాలి. అన్యభాషా పదాలు నేడు తెలుగు ప్రత్యయాలతో తెలుగులో చేరి వివిధ వికారాలు పొందినట్టు తెలుగు పదాలూ ప్రాకృతవేషంతో విచిత్రంగా కనిపిస్తాయి. మొదట వింతగా మారిన 'వింతర' పదంతోనే ప్రారంభిస్తాను.

(1) వింతర :

అసమత్థ మంత తంతాణ
కుల విముక్కాణ భోగహీణాణం,
దిట్ఠాణ కో న వీహఇ
వింతర సప్పాణ వ ఖలాణం (58)

(అసమర్థ మంత్ర తంత్రేభ్యః
కుల విముక్తేభ్యః భోగహీనేభ్యః,
దృష్టేభ్యః కో న బిభేతి
వ్యంతర సర్పేభ్య ఇవ ఖలేభ్యః)

ఖలులు సర్పాలకన్నా విచిత్రమైనవారని కవి చెప్పదలచాడు. పాములు మంత్ర తంత్రాలకు కట్టుబడుతాయి; ఖలులు కట్టుబడరు; వారిని కట్టివేసే మంత్రాలేమీ లేవు. పాములకు కులాలు, తెగలు ఉన్నాయి;[4] ఖలులకు లేవు; మంచి కులాలవారుకారు. పాములకు భోగాలు–పడగలు ఉన్నాయి; ఖలులకు లేవు. కనుక ఖలులు వింత పాములు. అలాటి వారిని చూచి ఎవరు భయపడరు? పాముభయంకన్నా ఖలుని భయం ఎక్కువ.

ఈ గాథ చివరి పాదంలోని వింతర పదానికి వ్యాఖ్యాతలు వ్యంతర అని ఛాయ చెప్పారు గాని అర్థం సరిగా చెప్పలేదు. ఆచార్య మాధవ వాసుదేవ పట్వర్ధన్ కూడ ఈ గాథను సరిగా చూడలేదు. దానికి కారణం వింతర అనేది వ్యంతర అనేదాని వికారమని భావించడమే. ఈ గాథలోని విశేషణాలన్నీ ఖలులకు. వాటి విపరీతార్థం సర్పాలకు. ఇది గ్రహించలేక శ్లేషవుందనే భ్రాంతిపడ్డారు ఆచార్య పట్వర్ధన్.[5]

ఈ వింతర పూర్తిగా తెలుగుపదమని చదవగానే స్ఫురిస్తుంది. వింత అంటే విచిత్రం. తెలుగు తోబుట్టువులైన తమిళ కన్నడ మలయాళాలలోను ఈ పదం వుంది–విందై, వింతె తెలుగులో వింత, పేద, బీద, దాసు వంటి పదాలకు స్త్రీ ప్రత్యయం చేరినప్పుడు ర మధ్య వస్తుంది–వింతరాలు, పేదరాలు, బీదరాలు, దాసురాలు. కాని, రాలు ప్రత్యయం కాదని ప్రకృతి ప్రత్యయాల అనుచిత విధానంవల్ల కలిగిందని భాషా తత్త్వవేత్తల వాదం. ప్రాతిపదిక పేదర, బీదర, దాసుర. వాటికి ఆలుచేరి పేదరాలు మున్నగు రూపాలు అయాయి. అట్లే వింతర కూడ వింతయిన వారు అనే అర్థంలో వుండి వుంటుందేమో! అది ఆ విధంగానే ప్రాకృతంలో చేరి వుంటుంది–వింతర సప్పాణ అని. అన్యభాషా పదాలు కృదంతాలు బహువచన రూపాలు తెలుగులో ప్రాతిపదికలవుతాయి. బలవంతః- బలవంతుడు, గుణవంతః–గుణవంతుడు, దాసర్–దాసరి.

కనుక వింతర అనే తెలుగు పదమని మనం నిర్ణయించుకోవచ్చు. దానివల్ల అర్థంకూడ సరిపోతుంది.

(2) ఆవట్టఏ :

మిత్తం పయతోయ సమం
సారిచ్ఛం జం న హోఇ కిం తేణ,

అహియాఏఇ మిలంతం
ఆవఇ ఆవట్టఏ పఢమం. (67)

(మైత్రం పయసోత్తయ సమం
సదృశం యత్ న భవతి కింతేన
అధికాయతే మిలత్
ఆ పద్యావర్తతే ప్రథమమ్)

ఇది భర్తృహరి నీతి శతకంలో మైత్రిని వర్ణించిన పద్యం వంటిది. మైత్రి—పాలు నీరు కలయిక వంటిది కాకపోతే మరెందుకు? పాలు, నీరు చేరితే పరిమాణం ఎక్కువవుతుంది. ఆపద వచ్చినప్పుడు వేడి కలిగినప్పుడు వట్టిపోతుంది—కలిసి కాగి తగ్గిపోతుంది.

ఈ గాథలోని ఆవట్టఏ అనే పదాన్ని వ్యాఖ్యాతలు ఆవర్తే ప్రథమం ఆయాతి తోయం అని వ్యాఖ్యచేశారు. కాని, అర్థం స్పష్టంగాలేదు. ఆచార్య పట్వర్థన్ దీనిని "ఆటణేం, ఆటూణజాణేం in the sense of evaporated" అని అర్థం చెబితే బాగుంటుందని[6] సూచించారు. పెక్కు క్రియలు కూడ దేశీవి, ప్రాకృతంలో చేరాయని ఆచార్య హేమచంద్రుడు చెప్పాడు గనుక, ఈ ఆవట్టఏ కూడ వట్టు, వట్టిపోవు అను తెలుగు ధాతువు కావచ్చునని తోస్తుంది. పాలు, నీళ్లు కలిసినప్పుడు ఎక్కువవుతాయి. నిప్పు తగిలినప్పుడు, కష్టాలు కలిగినప్పుడు, కాగికాగి వట్టిపోతాయి.

కనుక ఆ వట్టేఇ అనేది ఆవర్తతే ఆనేదికాక, ఆజ్ ఉపసర్గ పూర్వకమయిన వట్టు ధాతువేనని తోస్తుంది. అర్థం కూడా కుదురుతుంది.

(3) ఓ!

ఓ ఖిప్పఇ మండల మా
రు ఏణ గేహంగణాఉ వాహీఏ,
సోహగ్గ ధయవడాఇ
వ్వ ధణురట రుంప రించోతీ. (207)

(అహో! క్షిప్యతే మండల
మారుతేన గేహంగణాద్ వ్యాధ వధ్వాః,
సౌభాగ్య ధ్వజ పటానీవ
ధనూ రజస్త్వక్ పఙ్క్తిః)

కొత్త కాపురం. వీరవ్యాధ కుమారుడు కొత్త మోజులో ఉన్నాడు. కనుక, నవవధువును విడనాడలేకపోతున్నాడు. దానివల్ల చిక్కిపోయాడు. మునుపటి ధనువును ఎత్తలేకపోయాడు. కనుక వధువు ఆ ధనువును చెక్కసాగింది. చెక్కిన ధూళి ఇంటి పైకి ఎగిసి, ఆమె సౌభాగ్య విజయధ్వజ పటంవలె కనిపిస్తున్నదట.

ఈ గాథ మొదటి చరణంలోని ఓ మన వివక్ష. ఈ పదం ఆశ్చర్యసూచక అవ్యయంగా ప్రయుక్తం. ఇది 265, 324, 415, 442 గాథలలోను ప్రయుక్తమైంది.

ఓ అహో అనే సంస్కృతావ్యయానికి నిపాత మన్నారు ప్రాకృతవేత్తలు. తెలుగులో ఓ అనే మాటకు పెక్కు అర్థాలున్నవి. వాటిలో ఆశ్చర్యార్థము కూడ ఒకటి. ప్రాకృతంలో నిపాతంగా గ్రహించారు గనుక, ఇది తెలుగుపదమని మనం గట్టిగానే చెప్పవచ్చు.

రుంప పదానికి రంపపు పొట్టు అనే అర్థం ఇదివరకే చెప్పాను.[7]

(4) కసరక్కా :

తే గిరి సిహరా తే పీలు
పల్లవా తే కరీర కసరక్కా,
లబ్భంతి కరహ మరువిల
సియాఇ కత్తో వణేత్థమ్మి. (221)

(తే గిరిశిఖరాణి తే
పీలుపల్లవా స్తే కరీర కుడ్మలాః,
లభ్యంతే కరభ మరువిల
సితాని కుతో వనేత్ర?

ఇదొక అన్యాపదేశం. ఓ లొట్టిపిట్టా! నీవు ఎడారిజంతువు. ఎడారిలోని గుట్టలు, గొలుగుచెట్టు చిగుళ్లు, వెణుతురు మొగ్గలు ఎక్కడ వుంటాయి ఇక్కడ? ఇది వనం! ఎడారి విలాసాలు ఉండవు గదా!

ఈ గాథ రెండవ పాదంలో కసరక్కా విచిత్రంగా వినిపిస్తున్నది. కసరక్కా అనే దానికి కుడ్మల అని వ్యాఖ్య. కుడ్మల మంటే మొగ్గ. దీనికి చర్వణాశబ్దః – నెమరువేసేప్పటి ధ్వని అని, తినేప్పుడు కలిగే శబ్దమని కూడ హేమచంద్రుడు తెలిపాడు.[8] అనుకరణ ధ్వని కావచ్చు. కాని, కసుగాయలు అంటే మరికొంత ఉచితంగా వుంటుంది.

తెలుగులో కసుడు, కసురు, కసు కసురు అనే పదాలు లేత అనే అర్థంలో ఉన్నాయి. కసుగాయ గరచిచూచిన – అని సుమతి శతకం. వెణుతురు కసుగాయలు ఇక్కడ ఎక్కడున్నాయి — అంటే అర్థానికి భంగం వుండదు. కన్నడంలోను కాయ గసురు, కసుగాయి అనే పదాలున్నవి. కసి, కహి అంటే చేదు, ఒగరు. పండనికాయలు ఒగరొగరుగా, చేదుచేదుగా ఉంటాయి. కసి — కహి నుంచి కసు, కసురు రూపొంది వుంటాయి.

అందువల్ల కసరక్కా, కసురుగాయలనే తెలుగు మాటకు వికృతి కావచ్చును.

(5) తలినేహిం :

మడహల్లియాఇ కిం తుహ
ఇమాఇ కిం వా దలేహి తలినేహిం,
ఆమోఏ మహుయర మా
లఈఇ జాణిహిసి మాహప్పం (231)

(లఘుతయా కిం తవైతస్యాః
కిం పత్రైః తలినైః,
ఆమోదే మధుకర
మాలత్యా జ్ఞాస్యసి మాహాత్మ్యమ్)

ఆకార్యంకన్నా యోగ్యతకే ప్రాధాన్యమని కవి హృదయం.

ఓ! మధుకరమా మాలతి చిన్నగా ఉందని అనుకోకు. ఆకులు, చిగుళ్ళు ఎలావుంటే ఏమి? గుబాళింపులో గదా గొప్పదనం తెలుస్తుంది.

ఈ గాథ రెండవ పాదంలోని తలినేహిం అనే పదం మనకు చర్చనీయం. దీనికి వ్యాఖ్యాతలు కిరవైస్తోకైఃతా (దట్టం లేనివి లేక చిన్నవి) అని అర్థం చెప్పారు. అనగా చిన్నవి. మాలతి చిన్నగా వుంటే ఏమి? అని చిన్నదనే భావం మొదట ఉంది. మరల ప్రత్రైఃతలినైః — చిన్న ఆకులు అని చెప్పనక్కరలేదు. దాని ఆకులు ఎలా వుంటే ఏమి? దాని చిగుళ్ళు ఎలా వుంటే ఏమి? — అనడం బాగుంటుంది. చిగుళ్ళు చిన్నవి గనుక, చిన్న అనే అర్థం ఈ పదానికి తర్వాత వచ్చి వుంటుంది.

మొదట్లో చెప్పినట్లు ఓ మధురకరమా, మాలతి ఆకారం చిన్నగా వుంటే ఏమి? దాని ఆకులు ఎట్లుంటే ఏమి? చిగుళ్ళు ఎట్లుంటే ఏమి? సుగంధం కదా మనకు కావలసింది! అని తలిన శబ్దానికి చిగుళ్ళు అని అర్థం చెబితే బాగుంటుంది.

తెలుగులోను, తెనుగు తోబుట్టువులలోను తలిర్, తలిరు, తళిర్ అనే పదాలు చిగురుటాకు అనే అర్థంలోవుంది. ఈ తలిరు—తళిరే తలినగా ప్రాకృతంలో ప్రవేశించి వుంటుందని భావిస్తున్నాను.

(6) విసూరణం :

జత్థ న ఉజ్జాగర ఓ
జత్థ న ఈసా విసూరణం మాణం,
సబ్భావచాడుఅం జత్థ
నత్థి నేహో తహిం నత్థి. (333)

(యత్ర నోజ్జాగరకో
యత్ర నేర్ష్యా ఖేదో మానః,
సద్భావ చాటుకం యత్ర
నాస్తి స్నేహః తత్ర నాస్తి).

ఎక్కడయితే మేల్కొని కాచుకొ్కాచోడాలు, అసూయ, రుసరుసలు, బింకాలు, మంచి మనస్సుతో ముచ్చట్లు ఉండవో, అక్కడ స్నేహం ఉండదు — అంటాడు మనస్తత్త్వవేత్త అయిన కవి. స్నేహ మున్నప్పుడే మేల్కొవడాలు, మూతి విరుపులు, రుస రుసలు, మూతి బిగింపులు, మురిపాలు, ముచ్చట్లు వుంటాయి.

ఈ గాథ రెండో పాదంలోని విసూరణం అనే పదం చూద్దాము. దీనికి ఖేదః అని వ్యాఖ్యాతలు అర్థం చెప్పారు. ఖిద్ ధాతువుకు జూర విసూర అనేవి ఆదేశాలు అవుతాయని—హేమచంద్రుడన్నాడు.[9] ఆదేశం అననడాన్నిబట్టి ఇది అన్యభాషా పదమని మనం అనుమానించవచ్చు. తెలుగులో ఉస్సు, ఉస్సురు, ఉసురు, ఉసూరు, ఉసురుసురు, ఉస్సురుస్సురు అనే పదాలు తాపసూచకాలు చాల వున్నాయి. ఇవి నిట్టూర్పుల ధ్వన్యనుకరణ వాచకాలూ కావచ్చు. తెలుగువారి నిత్యవ్యవహారంలో వుంది గనుక, తెలుగు అనే అందాము.

ఈ ఉస్సురుస్సురే ప్రాకృతంలో చేరి విసూర — విసూరణం అయి, సంస్కృత భవమనే భ్రాంతి కలిగిస్తున్నది.

(7) దే :

(8) నడిజ్జసు :

అగ్ఘాహి మహుం దే గేణ్హ
చందణం అసుణి సుణసు మహ వయణం,
మాణేణ మా నడిజ్జసు
మాణంసిణి గలఇ ఛణరాఈ. (351)

(ఆజిఘ్ర మధు హే గృహాణ
చన్దన మన్యాశవే శృణు మమ వచనమ్,
మానేన మా నట్యస్వ
మనస్విని గలతి క్షణ రాత్రిః)

ఇదిగో! ఎవరి మాటా వినని అమ్మాయ్! నా మాట విను. మధువు వాసన చూడు (ఆస్వాదించు). చందనం అలదుకో. నీవు మనస్వినివి - అభిమానినివి. ఉత్సవరాత్రి గడిచిపోతున్నది. బింకంతో నలియకు—బాధపడకు—ఒక సఖి బింకం చూపుతున్న తన నెచ్చెలికి హితవు చెబుతున్నది.

ఈ గాథ మొదటి పాదంలోని దే అనే పదం, మూడవ పాదంలోని నడిజ్జసు అనే పదం పరిశీలిద్దాము. (సంణడిఓ — సన్నటితః—342).

'దే' అనే దానికి వ్యాఖ్యాత అర్థం చెబుతూ, "దే ఇతి ప్రార్థనాయాం, నిపాతః" అన్నాడు. దే అనేది ఆ మంత్రణ, సమ్ముఖీకరణాలలో నిపాతమని హేమచంద్రుడన్నాడు.[10] నిపాతమన డంవల్ల సంస్కృతంలో ఆకరం లభించలేదనే కదా!

తెలుగులో సమ్ముఖీకరణ ఆమంత్రణాలలో ఇదా, ఇందా, ఇదో, ఇదిగో అనే మాటలు తెలుగులోను, తెలుగు తోబుట్టువు లన్నిటిలోను ఉన్నాయి. ఈ ఇదా, ఇందాయే ప్రాకృత సహజమైన ఏఓలతోదే అని రూఢమయిందేమోనని అనుమానిస్తున్నాను.

నడిజ్జసు అనే పదానికి నట్యస్వ అని వ్యాఖ్య. కాని అర్థం స్పష్టం కాలేదు నటించవద్దు - వగలు పడవద్దు అని భావమేమో! వగలు పడవద్దు అనేది దూరార్థం. హేమచంద్రుడు నడ అనేది గుప్ ధాతువుకు ఆదేశంగా చెప్పాడు.[11] కలతపడు, చీకాకుపడు అనే అర్థాలు చెప్పాడు. దేశీనామమాలలో వఞ్చిత, ఖేదిత అనే అర్థాలు

ఇచ్చాడు.[12] నిపాతమనడాన్నిబట్టి, దేశీనామమాల గ్రహించడాన్నిబట్టి ఇది తెలుగు పదమని భావిస్తున్నాను.

తెలుగులో నలియు, నలి అనే పదాలు ఉన్నాయి. నలి — రోగం, పాడి, చిన్నది, నలిగినది, సన్ననిఅనే అర్థాలున్నాయి. నలియు — నలగు.

తెలుగు నలి ప్రాకృతంలో చేరి వుంటుంది. దానిని హేమ చంద్రుడు కొన్ని ధాతువులకు ఆదేశంగా గ్రహించాడు. ఎందుకు నలిగిపోతావు ? — బాధపడతావు. నా మాటవిను—అని అర్థం.

(9) ముహరాఓ చ్చియ పయడఇ
జో జస్స పిఓ కిమేత్థ భణిఏణ?
సాహేఇ అంగణం చియ
ఘరస్స అబ్బంతరే లచ్ఛిం. (403)

(ముఖరాగ ఏవ ప్రకటయతి
యో యస్య ప్రియః కి మత్ర భణితేన?
కథయ త్యంగణమేవ
గృహస్యా భ్యన్తరే లక్ష్మీమ్.)

మాట లెందుకు? ఎవరు ఎవరికి ప్రియుడో ముఖం రంగులే తెలుపుతాయి; ఇంటి సంపదను ముంగిలే చాటుతుందిగదా !

ఈ గాథ మూడవ పాదంలోని సాహేఇ అనే మాటకు కథయతి అని వ్యాఖ్య. సాధయతి దీనికి మూలమయితే అర్థమే వేరవుతుంది.

తెలుగులో చాటు అనే ధాతువు వుంది. కన్నడంలో సారు. పటహాది వాద్య ధ్వనితోపాటు ప్రచారం చేయడం. తెలుగు చాటు--చాట్టు—సాహు అయి వుంటుందని ఊహిస్తున్నాను.

(10) సుణహిల్లియా :

అచ్ఛఉ తావ సవిబ్భమ –
కడక్ఖ విక్ఖేవ జంపిరీ దూఈ,
తగ్గామ కుడిల సుణహి
ల్లియా వి దిట్ఠా సుహావేఇ. (420)

(ఆస్తాం తావ త్స విభ్రమ
కటాక్ష విక్షేప జల్పనశీలా దూతీ,
తద్గ్రామ కుటిల శునక్యపి
దృష్టా సుఖయతి.)

ఒక రసికునికి తన ప్రియురాలున్న ఊరంటేనే ఆనందం. అక్కడివారంతా రంభలే. కనుకనే తన నెచ్చెలితో అంటాడు: కడగంటి చూపులు విసురుతూ నోరంతా మాట్లాడే ఈదూతి సంగతి ఉండనివోయ్ ! ఆ వూరి వికారమైన కుక్క కూడ చూస్తే హాయి కలిగిస్తుంది.

ఈ గాథలోని మూడు నాలగు పాదాలలోని సుణహిల్లియా అనే పదానికి శునకీ అని అర్థం చెప్పారు శునక+ఇల్ల+యా= స్వార్థంలో ఇల్ల, యా అనే ప్రత్యయాలుచేరి శుణహిల్లయా అయిందని ఆచార్య పట్వర్థన్ వ్యాఖ్యానించారు.[13] హేమచంద్రుడు స్వార్థే కశ్చ వా(చకారాత్ డిల్లడుల్లే)[14] అని ప్రత్యయాలు విధించాడు. దీనితో శుణఇల్లియా అయి, ఇ ఒత్తి పలకడంలో హి అయి శుణహిల్లియా అయిందన్నారు.

పరిశీలించిచూస్తే సంస్కృత పదంతో తెలుగు పదం చేరి, తెలుగు పదమేదో విడదీసి వింగడించుకోలేని ప్రాకృతజ్ఞులు దానిని ప్రత్యయంగా భావించారేమో ననిపిస్తుంది. శుణహిల్లియా — అనే పదం శుణ+పిల్లియా అనే మిశ్రమ సమాస మనుకుంటాను. పిల్ల, పిళ్లె, పిళ్లై అనేవి తెలుగు, తెలుగు తోబుట్టువులలో చిన్న పిల్లలకు వాడే మాటలు. పిల్ల—పిళ్లె పదం ప్రాకృతంలో చేరిపోయింది. దానిమూలం తెలియక ప్రత్యయం విధించుకున్నాడు హేమచంద్రుడు అనిపిస్తుంది. ఆ వూరి వంకర టింకర కుక్కపిల్ల కూడ బాగుంటుందోయ్!--అంటే, అర్థం మరింత రంజకంగాను వుంటుంది.

కనుక శుణహిల్లియా — కుక్కపిల్ల అని భావిస్తున్నాను. పకారం హ కావడం పలు భాషలలో వుంది.

(11) చంపి ఊణ :

తహ చంపిఊణ భరియా
విహిణా లావణ్ణ ఏణ తుణుయంగీ,
జహ సే చిహుర తరంగ
అంగులి మగ్గవ్వ దీసంతి. (314)

(తథా నిపీడ్య భృతా
విధినా లావణ్యేన తన్వంగీ,
యథా అస్యాః చికుర తరఙ్గాః
అఙ్గుళి మార్గా ఇవ దృశ్యంతే.)

ఇదొక గొప్ప గాథ. మనం సంచులలోగాని, కుండలలో గాని వస్తువులను అదిమి అదిమి పెట్టేటప్పుడు పైన మన వ్రేళ్ల గుర్తులు కానవస్తాయి. దీనిని కవి ఒక ఉత్ప్రేక్షలో గొప్పగా ఇమిడ్చాడు.

ఆమె లావణ్యమయి. బ్రహ్మ ఆమెలో లావణ్యాన్ని కూరి కూరి, అదిమి అదిమి పెట్టాడు. అదిమిన వ్రేళ్ల గుర్తులే తలమీది కుటిల కుంతలాలు.

ఈ గాథ మొదటి పాదంలోని చంపి ఊణ అనే పదం చర్చనీయం. దీనికి వ్యాఖ్యాత న్య క్షీకృత్య అని అర్థం వ్రాశాడు. నిపీడ్య—పీడించి అని వివరణ. చంప అనేది పీడ ధాతువుకు ఆదేశమని హేమ చంద్రుడన్నాడు.[15] ఆదేశం అనడాన్నిబట్టే ఇది అన్యభాషా పదమని, ఆకారం తెలియనందున ఆదేశంగా పరిగణితమని స్పష్టం.

తెలుగులో చొనుపు అనే ధాతువు వుంది. దీనికి చొప్పు, చొప్పించు, జొనుపు రూపాలున్నవి. దీని అర్థం బలవంతంగా దోపడం. ఈ చొనుపే—చొంపు, చంపగా ప్రాకృతంలో చేరి ధాత్వా దేశమయిందని ఊహించవచ్చు.

చంపణ మరొక గాథ (431) లోను ప్రయుక్త మయింది. కరిచలణ చంపణుచ్ఛలియ – కరిచరణ పీడనోచ్ఛలిత. ఇక్కడ చంపణ పదానికి ఆక్రమణం—అని వ్యాఖ్యానం.

(12) ధుక్కోడియాః

దఇయా దంసణ తిణ్హా
లు యస్స పహియస్స చిరణియత్తస్స,
నయరాసణ్ణే ధుక్కోడియా వి
హిఅఏ న మాయంతి. (445)

(దయితా దర్శన తృష్ణాలోః
పధికస్య చిరనివృత్తస్య,
నగరాసన్నే సంశయా అపి
హృదయే న మాంతి)

ప్రవాసితుడు చాలకాలం తర్వాత ఊరికి తిరిగి వస్తున్నాడు. భార్యను చూడ్డామనే ఆత్రం విపరీతంగా ఉంది. ఊరు దగ్గరయిన కొద్దీ అతని గుండె ధుకధుక లాడుతున్నది—ధుకధుకలు అణగిడంలేదు.

ఈ గాథ మూడోపాదంలోని ధుక్కోడియా అనే పదానికి ధగధుగితాం సంశయాః అని వ్యాఖ్య. ఈ మాటను దేశినామ మాలగాని, పాఅలచ్ఛీ నామమాల గాని గ్రహించలేదు. గుండెదడకు అనుకరణమని వదలివేశాయేమో!

తెలుగులో ధుగధుగలాడు, తుకతుకలాడు అనే మాట లున్నాయి. ఇవి సంశయాన్ని తెలిపేవి. తుకతుక, ధుకధుక ధుక్కో డియాకు మూలం కావచ్చును. గాథాసప్తశతిలో దుక్కాధుక్కఇ గుండె దడదడలాడుతున్నది అనే అర్థంలో ఉంది.[16]

(13) గగ్గరః

తే ధణ్ణా గురుణియం
బబింబ భారాలసాహి తరుణీహిం
ఫురియాహర దర గగ్గర
గిరాహి జే సంభరిజ్జంతి (446)

(తే ధన్యా గురునితంబ
బింబ భారాలసాభిః తరుణీభిః,
స్ఫురితాధ్గర దర గద్గద
నీర్భిః యే సంస్మర్యంతే)

అందమైన స్త్రీలు పెదవులు కదలిస్తూ కొద్దిగా గరగరలాడే గొంతులోనే స్మరించే పురుషులు ధన్యులు.

ఈ గాథలోని మూడవ పాదంలోని గగ్గర శబ్దానికి గద్గద అని వ్యాఖ్య. గద్గదలోని దకారాలకు రేఫ వచ్చిందని హేమచంద్రుడు అన్నాడు. దానివల్ల గగ్గర అయిందట[17]

ఇది గరగర అనే తెలుగు పదమని భావిస్తున్నాను. గొంతు గరగరలాడుతున్నది అని ప్రయోగాల. ఈ గరగరే గగ్గరగా ప్రాకృ తంలో ప్రవేశించి వుంటుంది. గగ్గర పదస్వరూపంలోని వ్యాకరణ కార్యం కూడ తెలుగుదే- చెర+చెర=చెచ్చెర లాగ. గర+గర గగ్గర.

(14) తవణిం :

తుచ్ఛం తవణిం సి ఘరే
ఘరణీ తహ కహ వి నేఇ విత్థారం,
జహ తే పి బంధవా జల
ణిహి వ్వ ధాహం న యాణంతి (456)

(తుచ్ఛం భక్ష్యకణమపి గృహే
గృహణీ తథా కథమపి నయతి విస్తారం,
యథా తేపి బాంధవాః
జలనిధేరివ తలం న జానంతి.)

పాపం! ఆ ఇల్లాలు చాల సమర్థురాలు. చిన్న తినుబండారం ముక్కనైనా అందరికీ అందేట్టు చేస్తుంది. సముద్రం లోతు తెలీ నట్టుగా, బంధువులకు ఆ ఇంటిగుట్టే తెలీడంలేదు.

ఈ గాథ ప్రథమ పాదంలోని తవణిం అనే మాటను భక్ష్య కణం అని వాఖ్యానించారు వ్యాఖ్యాతలు. హేమచంద్రుడు తవణిం, తవణీ అనే రెండు పదాలను స్వీకరించి, భక్షణయోగ్య కణాది అని అర్థమిచ్చాడు[18]

దేశీ నామమాలలో హేమచంద్రుడు దీనిని గ్రహించడంవల్ల ఇది సంస్కృత ప్రాకృతేతరమనేది రూఢం. కనుక ఇది తరవాణి మెతుకు అనే సమాస పదంలోని పూర్వభాగ మనుకుంటాను. తర వాణి పద్ధతి, పులినీళ్ల పద్ధతి తెలుగు తమిళ దేశాలలో సహస్రాబ్దా లుగా వున్న పద్ధతి. చిన్న మెతుకును గూడ అందరికీ అందేట్టు చేస్తుంది ఇల్లాలు అని అర్థంకూడ గృహిణి సమర్థతకు తార్కాణ మవుతుంది.

(15) విలయా :

(16) ఉబ్భేఉ :

ఉబ్భేఉ అంగులిం సా
విలయా జా మహ పఇం న కామేఇ,
సో కో వి జంపఉ జువా
జస్స మఏ పేసియా దిట్ఠీ? (463)

(ఊర్ధ్వ కరోత్వంగులిం సా
వనితా యా మమ పతిం న కామయతే,

స కోపి కధయతు యువా
**య**స్య మయా ప్రేషితా దృష్టిః)

నా మగనిని కామించని ఆడదెవరో వేలు పైకెత్తనీ! నేనెవరినైనా ఒక్కసారి కన్నెత్తి చూచానేమో ఏ యువకుడైనా చెప్పనీ!– అంటుందొక గరిత.

ఈ గాథ రెండవ పాదంలోని విలయా అనే పదానికి వనితా అని వ్యాఖ్య. హేమచంద్రుడు వనితా పదానికి విలయానిపాతమన్నాడు.[19] నిపాతం కావడాన్ని బట్టి ఇది దేశిపదమని స్పష్టం. వ్యాఖ్యాత **కూడ** ''వనితాయాః విలయా ఇతి ప్రాకృత సూత్రేణ నిపాతః'' అన్నాడు.

ఇది తెలగు వెలయాలు వికారమేమోనని అనుమానిస్తున్నాను. వెలయాలు వేశ్య, లంజ. నా మగనిని కామించని వెలయాలు–లంజ ఎవ్వతో వేలెత్తనీ! అని అంటే మరింత సహజంగా వుంటుంది.

ఈ గాథ మొదటి పాదంలోని ఉబ్బేఉ అనే పదానికి ఊర్ధ్వీకరోతు అని వ్యాఖ్య. అనగా ఎత్తనీ అని అర్థం. **ఊ**ర్ధ్వకు ఉబ్బ ఆదేశంగా హేమచంద్రుడు చెప్పాడు.[20] ఉద్ద, ఉడ్డ అనే రూపాలూ చెప్పాడు.

ఇది తెలుగు పదమని **తో**స్తుంది. తెలుగులో ఎక్కువగు అనే అర్థంలో ఉబ్బు, ఉబుకు, ఉప్పు, ఉప్పొంగు, ఉప్పెన మున్నగు పదాలున్నవి. ఈ ఉప్పు, ఉబ్బే ప్రాకృత ధాతువు ఉబ్బ అయివుంటుంది. **ఊ**ర్ధ్వనుంచి ఊర్బ–ఉబ్బ దూరప్రయాణం.

(17) కాణా :

పేచ్ఛిఇ మహాణుచోజ్జం
కాణా ఘరిణీఇ జం కయం కజ్జం,
చుంబేవి న లఘు నయణం
**ఝు**డిత్తి నీసారిఓ జారో (475)

(ప్రేక్షధ్వం మహాశ్చర్యం
కాణ గృహిణ్యా యత్కృతం కార్యం,
చుంబిత్వా నలఘు నయనం
**ఝు**డి నిస్సారితో జారః)

చూచారా? ఆ ఒంటికంటివాడి భార్య ఎంత పనిచేసిందో! మగని బాగున్న కంటిని గట్టిగా ముద్దు పెట్టుకుంది; వెంటనే జారుణ్ని ఇంటినుంచి వెళ్లిపొమ్మంది.

కాణ శబ్దం **పూ**ర్తిగా సంస్కృత ప్రాకృతేతరం. తెలుగులో కాననివాడు, తమిళంలో కాణాన్. ఈ కాన–కాణ శబ్దం ప్రాకృతంలోచేరి అక్కడినుంచి సంస్కృతంలో ప్రవేశించి వుంటుంది. కాణ శబ్ద వ్యుత్పత్తి చింత్యం — **Etimology doubtful** — అని మోనియర్ విల్లియమ్స్ డిక్షనరీ చెబుతున్నది. కడారాది గణంలోని పదమని కూడా ఆ శబ్దకోశమే చెబుతున్నది.[21]

(18) బోలిఓ :

కిం విహిణా సురలోఏ
ఎక్కా వి న పుంసలిత్తి నిమ్మవియా,
**సాహీ**ణో జేణ ససీ
న బోలిఓ సీలరంగమ్మి (486)

(కిం విధినా సురలోకే
ఏకా పి పుంశ్చలీతి నిర్మాపితా,
స్వాధీనో యేన శశీ
న నిమజ్జి**తో** సీలరంగే)

బ్రహ్మ స్వర్గలోకంలో ఒక్క చిడిపెను సృష్టించినా, అది చంద్రుణ్ని కూడ నీలిరంగులో ముంచెత్తి వుండేది అని ఈ గాథ అర్థం.

ఈ గాథ నాల్గవ పాదం**లో**ని బోలిఓ అనే పదానికి నిమజ్జితః అని వ్యాఖ్య. ముంచివేయబడిన అని అర్థం. పాఇఅ సద్ద మహణ్ణవ (ప్రాకృతశబ్ద మహార్ణవ) బోలిఓ–వోలిఓ పదం బ్రుడ్ ధాతువునుంచి వచ్చినట్లు చెబుతున్నది. హేమచంద్రుడు మస్జ్ (టుమస్జో శుద్ధౌ) ధాతువుకు బుడ్డ ఆదేశమనినాడు.[22] ఆదేశ మనగానే ఆలోచించవలసిందేగదా!

తెలుగులో మునుగు, **ము**నుంగు, బ్రుంగు, బ్రుంగుడు అనే పదాలు మజ్జనార్థకంలో ఉన్నవి–మునిగేప్పుడు కలిగిన ధ్వనికి అనుకరణ శబ్దాలు కావచ్చు. ఈ **బ్రుం**గ్, **బ్రుం**గుడ్ ప్రాకృతంలో బ్రుడ్, **బు**డ్డలుగాచేరి, వోలి బోలి అని మారి వుండవచ్చు.

(19) **థ**లియా :

(20) ఖరడియం :

**థ**లియా య మసీ భగ్గా
య లేహ**ణీ** ఖరడియం చ తలవట్టం,
థిద్ధిత్తి కూడలేహయ
అజ్జ వి లేహత్త**ణే** తణ్హా (509)

(స్ఖలితా చ మసీ భగ్నా
చ లేఖినీ ఖరటితం చ తాలపత్రం
ధిగ్ ధిగితి **కూ**టలేఖిక
అద్యాపిలేఖికత్వే తృష్ణా)

వ్రాయడం రాదు పెట్టదు! సిరా ఒలికిపోయింది. లేఖిని విరిగింది. తాళపత్రం ఊరికే మసికర అయింది. ఛీ! ఇంకా రాద్దామనే ఆశ! – అని ఒక యువతి వ్రాత తెలియని వాడిని ఈసడించుకొంటున్నది.

ఈ గాథ మొదటి పాదంలోని **థ**లియా అనే పదానికి స్ఖలితా అని వ్యాఖ్య. అనగా ఒలికిపోయింది. స్ఖల శబ్దానికి **థ**ల ఆదేశం కావచ్చును. హేమచంద్రుడు చెప్పలేదు కాని, పాఇఅ సద్ద మహణ్ణ**వో**

గ్రహించి, ఊగు, క్రిందికిపడు, దొర్లు, కదలిపోవు మున్నగు అర్థాలిచ్చింది.

తెలుగులో దొర్లు, దొరలు, డుల్లు, డొల్లు అనే పదాలు పొర్లు, పడు అనే అర్థాలలో ఉన్నవి. డొలు — డుల్లు పదమే ఢలిగా ప్రాకృతంలో చేరివుంటుంది.

ఈ గాథ రెండవ పాదంలోని ఖరడియం అనే పదానికి ఖరటితం అని వ్యాఖ్య కాని, దాని అర్థం స్పష్టంగాలేదు. హేమచంద్రుడు ఖరడిఅ శబ్దానికి, రూక్ష, భగ్న అనే అర్థాలిచ్చాడు.[23] ఇక్కడ ఈ అర్థాలేవీ సరిపోవడంలేదు.

బహుశా ఇది కర అనే తెలుగుపదం మారువేషం అనుకుంటాను. అనవసరంగా తాటాకును కరచేశావు, పాడుచేశావు—అని అర్థం కూడ ముచ్చటగా చెప్పవచ్చు.

(21) పరోహడ :

ధాత్తి రఏణ ధమ్మిఅ
జఇ ఇచ్ఛసి విఁగపూరణం కాఉం,
తా ఏజ్జసు మజ్ఝ పరో
హడమ్మి సూరమ్మి అత్థమిఏ (523)

(ధుత్తూరేణ ధార్మిక
యదీచ్ఛసి వింగపూరణం కర్తుమ్,
తత ఆగచ్ఛ మమ గృహ
పశ్చాద్భాగే సూర్యేస్తమితే)

"ఓ ధార్మికుడా, నీకు శివపూజకు ఉమ్మెత్తపూవులు కావాలంటే, సూర్యాస్తమయం తర్వాత నా పెరట్లోకి రా," అని ఒకతే ధార్మికుణ్ని రెచ్చగొడుతున్నది.

ఈ గాథ మూడు నాలుగు పాదాలలోని పరోహడ అనే పదానికి గృహ పశ్చాద్భాగః అని వ్యాఖ్య. ఈ పదం 524, 525, 526, 527 గాథలలోను ప్రయుక్తం. ఇంటి వెనుకభాగం అని అర్థం. పాఇఅ లచ్ఛీ నామమాల ఘరవాడయం అనే అర్థంలో గ్రహించింది.[24]

ఈ పరోహడ తెలుగు పెరడువలె కానవస్తుంది. తమిళంలో పేర్కడే—పేక్కడే. పెరడు ఇంటి వెనుక ప్రదేశం, దొడ్డి.

(22) జూరేఇ :

అచ్ఛీహి పఇం సిహిణేహి
దియవరం గురుయణం నియంబేణ,
తిన్ని వి జూరేఇ వహూ
న యాణిమో కేణ కజ్జేణ? (614)

(అక్షిభ్యాం పతిం స్తనాభ్యాం
ద్విజవరం గురువరం నితంబేన,
త్రీణ్యపి నిందతి వధూః
న జానీమః కేన కార్యేణ?)

ఇదొక ప్రహేళిక ఇంటకోడలు మూడింటిని నిందిస్తున్నదట. ఆ మూడు—కళ్లు, వక్షోజాలు, నితంబం. భర్త పెద్దలఎడల గౌరవంతో కనిపించడు. కనుక కళ్లెందుకు ఏం ప్రయోజనం అని కళ్లను నిందిస్తుంది. వక్షోజాలు పెద్దవి కావడంవల్ల ఎవరైనా బ్రాహ్మణోత్తముడు వస్తే చేతులెత్తి నమస్కారం చేయలేకపోతున్నది. కనుక వక్షోజాలను నిందిస్తున్నదట. ఇంట్లో పనులకోసం అటూ ఇటూ తిరగాలికదా! అప్పుడు, తన నితంబు భారం ఎవరికైనా తగులుతుందేమోనని నిందిస్తుందట.

ఈ గాథ మూడవ పాదంలోని జూరేఇ అనే పదానికి నిందతి అని వ్యాఖ్య. హేమచంద్రుడు ఖిద్, క్రుధ్ ధాతువులకు జూర ఆదేశంగా చెప్పాడు. ఈ రెండింటికి ఏమైనా సంబంధం వుందా? కనుక ఇది అన్యభాషా పదమై వుంటుంది

తెలుగులో విసుగు, చిరుకోపం, చీకాకు తెలుపడానికి చురచుర చూచు, చురమరలాడు, చిరచిరలాడు, చీదరించు, చీదరగొను, చీదర మున్నగు పదాలున్నవి. ఈ చురచురే జురజుర అయి, జూరగా ప్రాకృతంలో చేరి వుంటుంది

(23) ఢురుఢుల్లంతో :

ఢురుఢుల్లంతో రచ్ఛా
ముహేసు వరమహిలియాణ హత్థేసు,
ఖంధార హారిససఓ
వ్వ పుత్తి దఇఓ న ఛుట్టిహిఇ. (625)

(పరిభ్రమన్ రథ్యాముఖేషు
వరమహిళానాం హస్తేషు,
స్కంధావార హారి శశక
ఇవ పుత్రి దయితో న మోక్ష్యతే.)

ఓసీ! వెర్రిదానా? నీ ప్రియుణ్ణి అదుపులో పెట్టుకో. అతడు వీధుల మొదట్లో తిరుగుతూ, స్కంధారంలో చిక్కుకుని వెలుపలికి రాలేని కుందేలులాగ ఏ అందగత్తెల చేతుల్లోనో పడిపోతాడు—అని ఒక అమాయకురాలిని ఆమె చెలికత్తె హెచ్చరిస్తున్నది.

ఈ గాథ మొదటి పాదంలోని ఢురుఢుల్లంతో అనే పదానికి పరిభ్రమన్ అని వ్యాఖ్య. భ్రమకు ఢురుఢుల్ల ఆదేశమని తోస్తుంది. హేమచంద్రుడు టిరిటిల్ల, ఢుంఢుల్ల, ఢంఢల్ల మున్నగునవి భ్రమ ధాతువుకు, ఢుంఢుల్ల, ఢుంఢోల మొదలయినవి ఆదేశాలని చెప్పాడు.[26] ఢురుఢుల్ల అలాటి ఆదేశం కావచ్చు. సంధావారహారి శశి. వెంట ఇంటి కుందేలు—వేట ఇంటి కుందేలు.[27]

తెలుగులో దొరలు, దొర్లు, దుల్లు పదాలు ఉన్నవి ఈ ఢురుఢల్ల వీటి వికారమే అయి వుంటుంది. "నీ ప్రియుడు దొర్లుకుంటూపోయి ఎక్కడో పడిపోతాడు సుమా!" అని గేలిచేసినట్లు వుంటుంది.

ఇంకా ఎన్నో తెలుగు పదాలు సరిగా నిరూపించవలసి వుంటాయి. ఇది కేవలం ప్రయత్నం మాత్రమే. దీనిలోని వాదబలం కన్నా, ప్రయత్న శ్రద్ధను చూడాలని సహృదయులకు విజ్ఞప్తి.

## అధోజ్ఞాపికలు

1 వజ్జాలగ్గం–4 గా.
2 వజ్జాలగ్గం–3 గా.
3 వజ్జాలగ్గం పీఠిక పుట 21 (ప్రాకృత పరిషద్, అహమదాబాద్).
4 పాముల తెగలకు భారతం సర్పయాగం.
5 వజ్జాలగ్గం-424 పుట.
6 వజ్జాలగ్గం–426 పుట.
7 గాథాసప్తశతిలో తెలుగు పదాలు—తిరుమల రామచంద్ర.
8 శబ్దాను శాసనం 8–4-423.
9 ఖిదేర్జూర విసూరే–శబ్దాను శాసనం 8–4–132.
10 శబ్దాను శాసనం 8–2–196.
11 శబ్దాను శాసనం 8–4–150.
12 దేశి నామమాల 4–1.8.
13 వజ్జాలగ్గం 491 పుట.
14 శబ్దాను శాసనం–8–2–164.
15 తక్ష్యాదీనాం ఛోల్లాదయః. శబ్దాను శాసనం–8–4–395.
16 గాథా సప్తశతి–584
17 శబ్దాను శాసనం–8–2-219.
18 దేశీనామమాల 5-1.
19 శబ్దాను శాసనం 8–2–128.
20 " 8–2–59.
21 **Monier Williams Sanskrit–English Dictionary, P. 269.**
22 శబ్దాను శాసనం 8 4–101.
23 దేశీనామమాల 2–79.
24 పాఇఅ లచ్ఛీ నామమాలా–934.
25 శబ్దాను శాసనం 8–4–132, 8–4-115.
26 శబ్దానుశాసనం 8–4–161, 8–4–189.
27 చర్చకు గాథాసప్తశతిలో తెలుగు పదాలు – తి. రామచంద్ర.

# యంత్రపుష్పాలు

## శ్రీమతి జలసూత్రం పద్మావతి

నాకూ ఇష్టమే
పూలను నా కవితల్లో గుచ్చటం.
నాకూ తెలుసు
చెట్ల అంతరంగాల్నీ, తీగ గుండెల్నీ చూడటానికి
పూల కిటికీల్లోంచే తొంగి చూడాలని
కవుల అజ్ఞానమో, జాతి దురదృష్టమో
ప్రబంధ పద్యాల గుంటల్లోపడి
పూలు మురుక్కంపు వేస్తున్నాయ్
భావకవితా పదాల్లో నలిగి జీర్ణభూతమౌతున్నాయ్.
మన్మథుని పొదిలో పూలురాలి
బాణాలు మాత్రం మిగిలిపోయాయ్
జాతి చైతన్యం వైపు గురిచూడబడుతూ.
నాకు తెలుసు
చెట్ల అంతరంగాల్నీ, తీగగుండెల్నీ చూట్టానికి
పూలకిటికీల్లోంచే తొంగిచూడాలని.
నాకు తెలుసు
నా కవితా పదాలమధ్య నలగని, నిరంతరం వెలిగే పూలసంగతి.
తాము వికసిస్తూ, కోట్ల జీవితాల్ని వికసింపజేస్తూ
తాము జీవిస్తూ, కోట్ల జీవితాల్ని జీవింపజేస్తూ
తాము వెలుగుతూ, జాతి భవిష్యత్తును వెలిగింపజేస్తూ
దేశమంతా సుగంధాన్ని నింపుతూ
నా కవిత్వాన్ని సుగంధవంతం చేస్తున్న పూలు
ఫ్యాక్టరీల శాఖల్లో వెలిసి
కార్మిక కిరణాల్తో వికసిస్తున్న
నల్లని యంత్రాలపూలు.

డా॥ ఘంటా జవహర్‌లాల్

# అనంతపురంజిల్లాలోని జైనక్షేత్రాలు

జినులచే ప్రబోధింపబడిన మతం జైనమతం. జినులనగా జితేంద్రియులు. మన రాష్ట్రంలో బౌద్ధమతంవలె జైనమతంగూడా వ్యాప్తి జెందినది. కాని బౌద్ధమతానికి జరిగిన న్యాయం యీ జైనమతానికి జరుగలేదు. కావున మనం జైనమతం గురించి పూర్తిగా తెలుసుకోలేకున్నాం. నిజానికి జైనమతం ప్రజల మతమై క్రీ. శ. 12వ శతాబ్దానికి ఆంధ్రదేశం నలుమూలలా వ్యాప్తిజెంది వృద్ధి పొందినది. జైనమతం ప్రవేశించని గ్రామం మన రాష్ట్రంలో లేదంటే అతిశయోక్తి గాదు. దీనికి ప్రతిపల్లెలో మనకు గాన్పించు జినావశేషములే ప్రత్యక్ష సాక్ష్యం.[1] ప్రజల ప్రగాఢమైన జినాభిమానమే జైన క్షేత్రాల ఏర్పాటుకు తోడ్పడినది. అదియును గాక, జైనమత గ్రంథాలు, జినుల జీవిత విశేషములతో సంబంధం గల్గిన ప్రదేశముల నతి పవిత్ర క్షేత్రాలుగా బేర్కొనుచున్నవి. ప్రతి జినాభిమాని తన జీవితకాలంలో జిన క్షేత్రాలను సందర్శించుట పవిత్ర విధిగా భావించాలని జైనమతం సూచించుచున్నది. పైగా జిన క్షేత్రాలు జిన తీర్థంకరులచే నిర్మించబడినవని నొక జైనమతం కథనంగూడా కలదు. తీర్థంకరులచే నిర్మించబడినవి గాబట్టి వీటిని జిన తీర్థాలు లేక జినక్షేత్రాలు లేక జిన కేంద్రాలు (Centres) గా జైన వాఙ్మయంలో పేర్కొనబడినది. జిన తీర్థంకరుల జీవితంలో గల్గిన పరిణామములను అయిదు కళ్యాణాలు[2] గ జైనమతం విభజించినది. అవి — [1] గర్భం (Conception) [2] జన్మ (Birth) [3] తపస్సు[3] [4] జ్ఞానం (Enlightenment) [5] నిర్వాణం (Death). అంటే, జిన తీర్థంకరుల జీవితంలో సంభవించిన యీ అయిదు కళ్యాణాలకు ప్రాతినిధ్యం వహించిన ప్రదేశాలే జిన క్షేత్రాలుగా జైనమతం గుర్తించి వాటిని మాత్రమే పవిత్ర క్షేత్రాలుగా మొట్ట మొదట బేర్కొన్నది. అనగా జైనమతం దక్షిణాదికి వ్యాప్తిచెందని సమయంలో యీ నియమ ముండవచ్చును ఏలయన దాదాపు 24 జిన తీర్థంకరుల కళ్యాణ స్థలాలు ఉత్తరాదిలోనే గలవు. రాను రాను, జైనమతం దక్షిణ భారత దేశంలో ప్రవేశించినది. రాజాదరణ, ప్రజాదరణ మిక్కుటముగా వడసి బలం పుంజుకొన్నది. దాని పర్యవసానమే పలు జినక్షేత్రాలు యిచ్చట వెలయుటకు కారణం. పైగా జినక్షేత్రాలు నెలకొల్పుటకు స్వేచ్ఛను గూడా జినాచార్యులు రాను రాను నొసంగినట్లు కన్పడుచున్నది. దీనికి యీ శ్లోకం తార్కాణం :

శ్లో. జన్మ—నిష్క్రమణస్థానజ్ఞాననిర్వాణభూమిషు॥
అన్యేషు పుణ్యదేశేషు నదీ కూలే నగేషు చ॥
గ్రామాదిసన్నివేశేషు సముద్రపులినేషు చ।
అన్యేషు వా మనోజ్ఞేషు కార్యేజ్జినమందిరం॥[4]

సర్వ సామాన్యంగా జిన క్షేత్రాలలో చక్కటి జినప్రతిమలు, జినాలయములు నెలకొల్పబడి ఉంటాయి. స్వేచ్ఛతో నెలకొల్పిన జినక్షేత్రాలను గూడా నాల్గువిధములుగా విభజించిరి.[5] 1. కళ్యాణ క్షేత్రాలు (అనగా జినతీర్థంకరుల జన్మస్థలాలు) 2. సిద్ధక్షేత్రాలు (జినులు జ్ఞానం పొందిన స్థలాలు) 3. అతిశయక్షేత్రాలు (జినుల జీవితంలో అద్భుతాశ్చర్యాలు సంభవించిన స్థలాలు). 4. కళా క్షేత్రాలు (జిన కళా వైభవమునకు పేరు గాంచిన స్థలాలు). ఆంధ్రదేశంలో జైనమతం ఉద్భవించక వ్యాప్తి జెందినది గావున మనకు పై బేర్కొన్న క్షేత్రాలలో కళాక్షేత్రాలే నెలకొని ఉన్నవి. ప్రస్తుతం యీ వ్యాసంలో అనంతపురం జిల్లాలోని జినకళాక్షేత్రాలనే ఉదహరించెదను :-

## కొనకొండ్ల

ఈ కొనకొండ్ల గ్రామం గుంటకల్లు రైల్వేస్టేషనుకు 8 కి. మీ. దూరంలో ఉన్నది. శాసన పరంగాను, జినకథనం ప్రకారం గాను మనంజూస్తే కుందకుందాచార్యుడు కొనకొండ్ల దాపున గల కొండపై నివసించినట్లు బోధపడగలదు. చారిత్రికులు ఆ కొనకొండ్ల గ్రామంను నేటి ఉరవకొండ తాలూకా, గుంటకల్లుకు 8 కి. మీ. దూరంలోగల కొనకొండ్లగా గుర్తించిరి.[6] ఇంద్ర నంది శృతావతారం[7] 'పద్మనంది యనే జిన గురువు కుంద కుంద పురంలో' నివసించినట్లు పేర్కొనెను. కొనకొండ్ల గ్రామంలో లభ్యమైన శాసనంలో[8] యీ ప్రదేశం తన అనే కాన్త నాదంను సర్వత్రా వ్యాప్తిపరచిన జినగురువు పద్మనంది జన్మస్థలంగా 'యావత్ప్రపంచంలో కీర్తింపబడినదని' తెలుపబడియున్నది. అచ్చటే లభ్యమైన మరియొక శాసనంలో[9] యీ స్థలం కుంద కుంద తీర్థంగా కీర్తింపబడినది. పైని పేర్కొన్నాధారములనుబట్టి ప్రస్తుత కొనకొండ్ల గ్రామం అసలు పేరు 'కుంద కుంద పురం' అనియు, కుంద కుందాచార్యుని అసలు పేరు పద్మనంది యనియు మనకు స్ఫురిస్తుంది. ప్రస్తుతం జినావశేషము లన్నియు కొనకొండ్ల దాపునగల రససిద్ధుల గుట్టపై మనం యిప్పటికీ జూడవచ్చును. ఆ గుట్టపై పైకప్పు (Roof) లేని జినాలయం గలదు. దానిలో శోభాయమానంగా కాయచ్ఛర్గస్థిలో చెక్కబడిన రెండు జిన ప్రతిమలు ప్రతిష్ఠింపబడియున్నవి. 'కాయచ్ఛర్గ భంగిమ' పూర్తిగా జిన

పరమైన శబ్దము. నిటారుగా ఏ వంపులు లేకుండా నిలబడి రెండు చేతులను మోకాలివరకు తిన్నగా వ్రేలాడువేయు భంగిమను 'కాయ చ్ఛర్గ భంగిమ' అంటారు. జిన మతానుసారం బుషభనాథుడు, నేమినాథుడు, మహావీరుడు మినహా మిగిలిన 21 తీర్థంకరులు ఈ భంగిమలోనే సిద్ధి బొందారు. అందువలన జిన ప్రతిమలు యీ భంగిమలోనే ఎక్కువగా చెక్కబడి వుంటాయి. పై ముగ్గురు మాత్రం (బుషభనాథుడు, నేమినాథుడు, మహావీరుడు) పద్మాసనం (పర్యంకాసనం లేక సంపర్యం కాసనం)లో ముక్తిపొందారు. కావున మనకు కాయచ్ఛర్గ మరియు పద్మాసన భంగిమలలోనే చెక్కిన జిన తీర్థంకరులను జూస్తూ వుంటాము. ఇక జినప్రతిమలు ఏ భంగిమలో నున్నను పాదుగాటి చేతులు, శ్రీవత్సముద్ర, యౌవ్వనం తొణికసలాడుతూ, ప్రశాంత వదనారవిందం గల్గి దిగంబరంగా ఉంటాయి. వరాహమిహిరుడు యీ విధంగా, బృహత్ సంహితలో జినమూర్తి వివరణ యిచ్చియున్నాడు[10] :—

> ఆజాను లంబ బాహుః శ్రీవత్సాజ్కః ప్రశాంతమూర్తిశ్చ।
> దిగ్వాసాస్తరుణో రూపవాంశ్చ కార్యోహై హితాం దేవః॥

ఈ రసిద్దుల గుట్టపైగల జిన బసదికి సమీపంలోనే సిద్ధ చక్రం చెక్కబడివున్నది. ఇప్పటికీ వర్షాలు సకాలంలోపడనిచో గ్రామస్తులు యీ శిద్ధ చక్రానికి, జినమూర్తులకు వర్షముల కొరకు పూజలు చేస్తూ ఉంటారు. ఇది ఆ గ్రామవాసుల ప్రగాఢ విశ్వాసం.

ఇక జినగురువైన పద్మనంది కుందకుందాచార్యుడుగా జైన మతంలో కీర్తింపబడినాడు. ఈతడు క్రీ. శ. 1 వ శతాబ్దానికి చెంది వుండవచ్చునని చారిత్రికుల నమ్మిక.[11] జైనమతంలో కుంద కుందాచార్యునికి ఎనలేనికీర్తి, గౌరవం. ప్రతిదక్షిణాది జిన సంఘారామం కుంద కుందాచార్యుని వంశాన్ని పేర్కొనుట దీనికి సాక్ష్యం. ఇతడు 84 'పాహుడాలు' రచించినట్లు జైన కథనం గలదు. ఇతడు వక్రగచ్ఛ,బలాత్కారగణ సంఘారామానికి గురువు. అంతటి జిన ప్రజ్ఞా విశారదుని జన్మస్థలం యీ జిల్లాలో వుండుట మనం గర్వించదగిన విషయం. ఈ జినస్థలం రాయలసీమలోని అతి పురాతన మైనది. కాని, ప్రస్తుతం ఒక్క జినమతాభిమాని యీ గ్రామంలో లేకపోవుట శోచనీయం.

## రా య దు ర్గ ం

ఇది తాలూకా కేంద్రము. అనంతపురానికి 97 కి. మీ. దూరములోగలదు. రాయదుర్గం అంటే రాజాగారి కోట ఇప్పటికీ మనం శిథిలమైన కోటను నచ్చట చూడవచ్చును. విజయనగర రాజుల కాలంలో కట్టిన హిందూ దేవాలయాలు యీ కోటలో గలవు. శిథిలమైన జినాలయాలు గూడా మనం యీ కోటలో పరికించవచ్చును. ఈ కోటదాటి ఉత్తరదిశగా 1 కి. మీ. పయనిస్తే మనకు శిద్దుల గుట్ట కానవస్తుంది. ఇది అసలు జినక్షేత్రం. ఈ కోట కంటె పురాతనమైంది 'యాపనీయ' శాఖకు జెందినది. జైనమతంలో 'యాపనీయ' సంఘమతి ముఖ్యమైనది. యాపనీయులు జైన మతాచారాలన్నిటినీ సరళంజేసి సామాన్య ప్రజలకు సైతం ఆచరణయోగ్యంగా జేసినవారు అందుచే జైనులు వీరిని జైనమతం నుండి తొలగింపబడిన వారు పేర్కొన్నారు. అటువంటి 'యాపనీయ' సంఘమునకు జెందిన జినక్షేత్రం ఇది. జినులు స్త్రీలను మోక్షానికి అనర్హులుగా యెంచి వారిని జైనమతంలో జేర్చుకొనకపోతే 'యాపనీయులు' స్త్రీలుగూడా మోక్షానికి యర్హులని పేర్కొని స్త్రీలకు జైనమతంలో ప్రవేశం గల్పించిరి. రాష్ట్రకూటుల కాలానికి జెందిన శిలాశాసనం అచ్చట ప్రబలివున్న 'యాపనీయుల' వునికిగూర్చి మనకు తెలుపుచున్నది.[12] ఆ శిద్దుల శిలలపై మనం నేటికి విద్యాలయ తరగితుల చిత్రీకరణ జూడవచ్చును. జినులు జితేంద్రియులేగాక బహు భాషా విదులు, పండితులు. జిన గురువుల విద్యాబోధన ఆ శిలలపై చిత్ర విచిత్రంగా చిత్రించుట నిజంగా విచిత్రమే. యావదాంధ్రలో యిటువంటి చిత్రీకరణ యిచ్చటనే మనం జూడగలము. అనగా పూర్వం యిది జినక్షేత్రంగానే జిన విద్యాలయంగా పేరుగాంచి వుండవచ్చును. క్రీ శ. 15వ శతాబ్దానికి జెందిన జినదేవుని ప్రతిమ తాలూకా ఆఫీసులో పదిలపర్చబడి నేటికీ పూజలందు కొంటున్నది.

## క ం బ దూ రు

ఇది కళ్యాణదుర్గం తాలూకాలో గలదు. కళ్యాణ దుర్గానికి 24 కి మీ. దూరంలో నున్నది బస్సు సౌకర్యం మాత్రమే గలదు. ప్రస్తుతం యీ గ్రామంలో మూడు పురాతన దేవాలయాలుఉన్నవి. అవి ప్రజల నమ్మిక ప్రకారం 1) మల్లేశ్వరస్వామి 2) బసవన్న గుడి 3) అక్కమ్మవారి గుడి. వీటిలో పూజా పునస్కారాలు జరిగేది మల్లేశ్వరస్వామి దేవాలయంలోనే మూడు దేవాలయాలు సోపాన శిఖరాకృతి గలవే. జిన చిత్రకళ ప్రకారం సోపాన శిఖరం (Stepped pyramidal tower) గలవి జినాలయాలే. ముఖ్యంగా మన రాష్ట్రంలో అన్ని జినాలయాలు సోపాన శిఖరాలు గల్గిఉండుట గమనార్హం. జైన'వీరశైవ' మత కలహాల తరుణంలో వీరశైవులు విజృంభించి జైనమతాన్ని ఛిన్నాభిన్నంచేసి, వారి జినాలయాలను శిథిలపరచి, కొన్నిటిని శైవాలయాలుగా మార్చిరి. ఇది చరిత్ర సత్యం. జినప్రతిమలను భగ్నపరచిరి. జినాలయ మూలప్రతిమలను సైతం పెరికి పారవైచిరి, పాడుచేసిరి. అందువలనే నేడు జినాలయాలన్నీ జినమూర్తులు లేక "వట్టి గుల్లు"గా నిలిచి వున్నవి. ఈ వీర శైవుల దురాగితాన్ని చాటుతూ నేటికి మనకు భగ్నమైన జినప్రతిమలు ప్రతి పల్లెలో తారసపడుతూ వుంటవి. పైగా యీ దురాగతానికి చిహ్నాలే నేటి సోపాన శిఖరంగల శివాలయాలు. అవి అసలు జినాలయాలు. శివాలయాలుగా మారినవి. ఇది నా విశ్వాసం. అట్టి కోవకు జెందినదే యిచ్చటి మల్లేశ్వరస్వామి దేవాలయం. నేటికి మనం మల్లేశ్వర దేవాలయం గోడపై జినచిత్రాలు జూడవచ్చును. మిగిలిన వాటిలో నిది బసవన్న గుడి. ఇది పూర్తిగా జినాలయం. పూర్తిగా శిథిలమైన గుడి. దానిముందు నంది పడివుండుట మూలంగా ప్రజలలో నది 'బసవన్నగుడి'గా నిలిచిపోయింది. ఇప్పటికి యీ జినాలయం

ముఖద్వారంపైన, శిఖరంపైన 'పరియం కాసానం' (పద్మాసనం)లో జినుని మనం జూడవచ్చును ఈ జినాలయంలో ఇంకో ప్రత్యేకత వున్నది జినులను కాయచ్చర్గ భంగిమలో చెక్కి ద్వారపాలురుగా నిలుపుట ఇది జినాలయ చిత్రకళలోనే అపురూపం ఏ హిందూ మతచ్ఛాయలు కానరాని జినాలయం యిదేనని జెప్పవచ్చును ఇక అక్కమ్మవారి గుడి ప్రస్తుతం మూలవిరాట్టు లేదు ఆలయాకృతిని బట్టి అసలు జినాలయం. దీనికి సందియంలేదు జినక్షేత్రాలు జిన శిల్పకళకు, జినాలయాలకు నిలయాలు అయిన కంబదూరు జినాలయాలకు నిలయమైనది. ఇది నిజంగా కళాక్షేత్రంగా పూర్వం వుండనోపు.

## అమరాపురం

ఇది మడకశిరా తాలూకాలోని పెద్ద గ్రామం మడకశిరా తాలూకా మొత్తం జినక్షేత్రంగా పేర్కొనవచ్చును ప్రతి పల్లె జిన ప్రతిమలతో జినాలయములతో మనకు తారసపడుతూ వుంటుంది అమరాపురం గ్రామం బాలేన్దు మలధారి యనే జిన గురువుచే ప్రభావితమైనది. ఇతడు మూలసంఘము, దేశీయగణము, పుస్తక గచ్ఛ, ఇనగలి బలికి చెందిన జిన సంఘారామానికి గురువు. జైనమతంలో గూడా బౌద్ధమతంలోవలె సంఘారామ శాఖలు పెక్కు గలవు. ప్రతి జినగురువును తెలిపేటప్పుడు, యాతని సంఘమును, గణము, గచ్ఛము విధిగా శాసనాలలోను జైనగ్రంథాల లోను పేర్కొనబడతాయి. ప్రతి జినశాసనం యీ నియమం పాటించుచున్నది ఈ బాలేన్దు మలధారియే యిచ్చటనుండు బ్రహ్మ జినాలయపు ముఖ్యగురువు (Principal preceptor). ఇంకనూ యీ గ్రామంపై వివరణ గోరువారు మే 1979 'భారతి'లో ప్రచురించిన నా వ్యాసం జూడవలయును.[13]

## పాతశివరాం

ఇదియు మడకశిరా తాలూకాలో గలదు. అచ్చటనే లభ్యమైన శిలాశాసనం[14] లో ఇది ఒకప్పుడు పవిత్రమైన జినక్షేత్రంగాను, ప్రసిద్ధ జినగురువగు పద్మప్రభ మలధారి దేవుని నివాస స్థలం (Abode) గను పేర్కొని కీర్తింపబడినది. ఈ జినగురువు, మూలసంఘము, దేశీయగణము, పుస్తక గచ్ఛ జినసంఘారామానికి జెందిన వీరనన్ది సిద్ధాన్త చక్రవర్తికి ప్రియశిష్యుడు డాక్టరు పి బి దేశాయిగారు[15] యీ పద్మప్రభ మలధారిదేవుని 'కుందకుందాచార్యుడు' రచించిన నియమసారంపై వెలువడిన 'తత్పర్యవృత్తి' గ్రంధకర్తగా గుర్తించినారు పైగ యీ పద్మప్రభమలధారి జిన సారస్వతంలో అతి ప్రసిద్ధమైన వ్యక్తిగా పరిగణింపబడినాడు. శాసన పరంగాను, సారస్వతాధారాలను బట్టి యీ పద్మప్రభమలధారి క్రీ. శ 12వ శతాబ్దికి జెందినవాడని తెలియుచున్నది. ఈ జిన గురువు బోధనలు విని పునీతులైన నాటి ప్రజలు నిజంగా ధన్యులు.

## రత్నగిరి

ఇది మడకశిర తాలూకాలోనిది మడకశిరకు 18 కి. మీ. దూరంలోగల రొళ్ల గ్రామానికి 4 కి మీ. దూరంలో గలదు ఇదియు విజయనగర రాజుల కాలంలో ప్రసిద్ధిగాంచిన జినక్షేత్రం. ఇచ్చట శాంతినాధుని దేవాలయం గలదు. ఇది చాలా పెద్దది స్థానిక జైనులచే మరమ్మత్తులు చేయించుకొని, నవీన శోభతో శోభించుచున్నది. కాని దాని ప్రాచీనత్వము (Antiquity) యిప్పుడు మనం తెలుసుకోలేము శాంతినాధుడు 16వ తీర్థంకరుడు మృగం యాతని లాంఛనం దానికి చేరువలోనే జిని విహారముగలదు. బౌద్ధులవలెనే జినులు గూడా విహారాలు నిర్మించిరి విహార మనగా జినుల నివాస స్థలం. సహజంగా యివి జినాలయాలకు దాపుననే వుంటవి. మన రాష్ట్రంలో జినవిహారము యిచ్చటనే గలదు కర్నాటకలో ఇవి మెండుగా గలవు ఈ జినవిహారం ద్వారములపైన, ప్రవేశములయొద్ద జినమూర్తులు పద్మాసనంలో చెక్కబడివున్నవి. కాని నేడు యిది పశువులకు, మేకలకు నివాసస్థలమై శిథిలావస్థలో నున్నది. స్థానిక జినులు జినాలయాన్ని వదిలి పరిచిరి. గానీ యీ విహారమును విడిచిపెట్టిరి. దీని వునికి నాచే ప్రభుత్వదృష్టికి తేబడినది. ప్రభుత్వపు రక్షిత పురాతన కట్టడముల జాబితాలో త్వరలో చేరబోవుచున్నది మనం మెండుగా జైన కులస్థులను యీ గ్రామంలోనే జూడవచ్చును.

## తాడిపత్రి

ఇది తాలూకా కేంద్రము. అనంతపురానికి 55 కి. మీ. దూరంలోనున్నది రైలు, బస్సు సౌకర్యం గలదు ఇచ్చటనే లభ్యమైన పెద్ద శిలాశాసనం[16] మూలంగా ప్రస్తుత తాడిపత్రి క్రీ శ. 12వ శతాబ్దంలో ప్రఖ్యాత జినక్షేత్రమని తెలియుచున్నది. నేడు మచ్చుకు గూడా జినావశేషములు యిచ్చట గానరావు. క్రీ. శ. 1198లో ఉదయాదిత్యుడనే సామంత ప్రభువు నిచ్చటగల చంద్రనాధ పార్శ్వనాధ జినాలయానికి భూమి దానముగా నిచ్చినట్లు ఆ శాసనం తెలుపుచున్నది. జినక్షేత్ర వివరణ గూడా శాసనంలో వివరంగా వున్నది ఆ జినాలయానికి మేఘచంద్రుడు పూజారి. అతడు మూల సంఘము, దేశీయగణము, పుస్తక గచ్ఛ కుంద కుందాన్వయ జిన సంఘారామానికి గురువు ఇంకను జిన శిష్యులను గూడా శాసనం పేర్కొనినది. కాని నేడా జినచ్ఛాయలు నామమాత్రముగా గూడా తాడిపత్రిలో మనకు కానరావు

## తొగరకుంట

ఇది ధర్మవరం తాలూకాలో గలదు ఇక 11–12 శతాబ్దాలలో నిది ప్రఖ్యాత జినక్షేత్రంగా ప్రసిద్ధి పొందినది ఆరవ చాలుక్య విక్రమాదిత్యుడు రాజ్యం చేస్తున్న తరుణంలో యాతని సింధవాడి గవర్నరు తొగరకుంట గ్రామంలో గల చంద్రప్రభ బసదికి తోటలు,

భూమి, యిండ్ల స్థలాలు (House sites) దానంగ యిచ్చినట్లు యిచ్చటనే లభ్యమైన శిలాశాసనం వలన మనకు తెలియుచున్నది.[17] జిన భాషలో జినాలయాన్ని 'బసది' లేక 'వసది'గాగూడా అంటారు. మరియొక విషయం శాసనంలో 'సిందవాడి 1000 గవర్నరు ప్రజలభీష్టముపై చంద్రప్రభ బసదికి దానమిచ్చినట్లు' పేర్కొన బడుట గమనించదగిన విషయం. ఏలయన నాటి ప్రజల ప్రగాఢ మైన జైనమతాభిమానం మనకు వివరంగా యీ శాసనం మూలంగా విశదమగుచున్నది. ఇక చంద్రప్రభుడు జిన తీర్థంకరు లలో ఎనిమిదవవాడు. అర్ధచంద్రుని గుర్తు (Cresent) లాంఛన ముగా గలవాడు. హిందూదేవులకు వాహనాలుంటే జినదేవులకు లాంఛ నాలు వున్నవి. ఈ లాంఛనాలు మూలంగా మనం వివిధ జిన తీర్థం కరుల రూపాలను తెలుసుకోవచ్చును. ఉదాహరణకు ఏడు తలల ఫణిని శిరస్సుపై ధరించిన జిన తీర్థంకరుడు పార్శ్వనాథుడు. అట్లే సింహము లాంఛనముగా గల తీర్థంకరుడు మహావీరుడు. ఈవిధంగా 24 తీర్థంకరులకు 24 లాంఛనాలు వున్నవి.

## పెనుగొండ

ఇదియు తాలూకా కేంద్రము. అనంతపురానికి 70 కి. మీ. దూరంలో నున్నది. బస్సు, రైలు సౌకర్యం గలదు. ఇది ప్రఖ్యాత జిన క్షేత్రముగా జినసారస్వతంలో కీర్తింపబడినది. పైగా పెను గొండ యావద్భారతంలోగల నాల్గు జిన విద్యాకేంద్రాలలో నొకటిగా జిన కథనము[18] పేర్కొనుచున్నది. మిగిలిన మూడు జిన విద్యా స్థానాలు—ఢిల్లీ, కొల్హాపూరు, జినకంచి. విజయనగర రాజుల పాల నలో గూడ పెనుగొండ జినక్షేత్రంగా ప్రసిద్ధి చెందినది నేడును మనం నచ్చట అజితనాథుని, పార్శ్వనాథుని బసదులను జూడ వచ్చును. అజితనాథుడు రెండవ తీర్థంకరుడు ఏనుగు యాతని లాంఛనము. పార్శ్వనాథుడు 23వ తీర్థంకరుడు అచ్చటనే లభిం చిన శిలాఫలకం[19]లో జినభూషణ భట్టారకుడనే జిన గురువు ప్రస్తావన గలదు. ఇచ్చటగల జినాలయాల గూర్చి కొంచెము వివ రణ కావాలి. పైని మన రాష్ట్రంలో జినాలయాలన్ని సోపాన శిఖ రాలు గలవని పేర్కొంటిని. కాని యిచ్చటగల అజితనాథ దేవాలయం దానికి భిన్నముగా దక్షిణ శిఖరం గల్గి ఉన్నది. అంటే హిందూ దేవాలయాల శిఖరాలను బోలిన శిఖరాకృతి యీ అజిత నాథ జినాలయం కల్గివుండుట, గమనించదగినది. ఈ మార్పు జైన మతం చివర దశలో జరిగి వుండును అదియును విజయనగర రాజు లలోనే యీ మార్పు జరిగియుండవచ్చును. ఈ ఒక్క జినాలయము మినహా మిగిలిన జినాలయాలన్నియు సోపాన శిఖరంనే గల్గి వుండుట పై వూహకు బలము నిస్తుంది.

పైని పేర్కొన్నవి అనంతపురం జిల్లాలో నొకప్పుడు జిన క్షేత్రాలుగ ప్రసిద్ధి గాంచినవి ఇవిగాక జినావశేషములుగల పల్లెలు పెక్కు గలవు అవి నాటి జినమత వ్యాప్తికి నిదర్శనములై నిలిచి వున్నవి.

## సూచికలు


1 Robert Sewell : Topographical list of the Antiquities in the Madras presidency, Vol. I

2 D N Shukla Vastu-sastra, Vol II, Chapter VIII, P. 6.

3 కొందరు 'పరిష్క్రమణమును' మూడవ కళ్యాణముగ పరి గణించిరి.

4 MSS, (Jaina S. Library, Arrah) and Vastu-sastra, Vol II, ch VIII, P. 6

5 B. C. Bhattacharya, The Jaina iconography, P. 20.

6 B S.L Hanumantha Rao, Religion in Andhra, PP. 152-153.

7 A N. Upadhya, pravachanasara, Introduction, 8-2

8 SII, IX, pt I, No. 288

9 Ibid No 150.

10 Varahamihira's Brihatsamhita 58, Adhyaya 45 sloka.

11 A N. Upadhya, Pravachanasara, Introduction, P. 22

12 P. B. Desai, Jainism in South India, P 152.

13 Bharathi, May-1979, PP-33-35

14 P B. Desai, Jainism in South India, P 159.

15 Idid, P-159.

16 Tadpatri Inscription SII, IV, No 798.

17 Togaragunta Record · SII, IX, pt I, No 221.

18 Indian Antiquari, XXXII, P 460

19 P. B. Desai Jainism in South India, P I61


[ 1979వ సంవత్సరం నవంబరు 16వ తేదీన అనంతపురం శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయ స్నాతకోత్తర విద్యాకేంద్రపు ఆంధ్రశాఖలో నాచే నొసగ బడినాంగ్లోపన్యాసము. ]

తమిళం : డా॥ పి. శౌరిరాజన్          అనువాదం : డా॥ కె. సర్వోత్తమరావు

# బహుమతి

బడి వదలిపెట్టగనే నాన్నమ్మతో గుడికెళ్ళేటప్పుడల్లా అక్కడ తన్ను తాను మఱచి నాదస్వరం వాయించే సింగారవేలు గానానికి ముగ్ధుణ్ణయి నిలబడ్డం నాకు చిన్నప్పటి నుండి రివాజే. నేను పెరిగి పెద్దవాణ్ణయ్యేకొద్దీ సింగారవేలు కీర్తి కూడా జిల్లా పరిధులు దాటింది. అతడి సహవాసంతో రాగాలను గుర్తించడం, ఒకటి రెండు పాటలు వ్రాయడం నా బాల్య జీవితంలో ఒక భాగంగా నిలిచి పోయింది సింగారవేలు భార్య కనకవల్లి నా పాటలు పాడుతుంటే సింగారవేలు తెగమెచ్చుకొనేవాడు. ఆ తరువాత పై చదువులకోసం నేను మదరాసుకు వచ్చేశాను అక్కడ ఎం ఏ దాకా చదువుకొని శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయంలో వుద్యోగం దొరికితే తిరుపతిలో స్థిరపడ్డా. కాని నాన్నమ్మమాత్రం సింగారవేల స్వామి సన్నిధినిగాని, చిక్కల్ గ్రామాన్నిగాని వదలిపెట్టి రావడానికి ససేమిరా ఒప్పుకో లేదు. అంచేత మదరాసులో చదువుకొనే రోజుల్లో మాత్రం సెల వుల్లో చిక్కల్ వెళ్ళేవాణ్ణి. అపుడు వీలుకలిగించుకొని సింగారవేలుని కలుసుకోవడం, అంతేకాకుండా మోహనరాగం పాడమని ప్రాధేయపడి ఆనందించడం ఆ రోజుల్లో ఒక కార్యక్రమంగా వుండేది పెళ్ళయిం తర్వాత తిరుపతి వదలి ఎక్కడికి వెళ్ళడం కుదరలేదు కూడా తిరు పతిలో స్థిరపడ్డ తర్వాత ఎప్పుడయినా నాన్నమ్మ యాత్రికులతో వేంకటేశ్వరుణ్ణి దర్శించడానికి వచ్చేది. అప్పుడు బతిమాలితే కొన్ని రోజులు మాతోనే వుండి వూరికి వెళ్ళిపోయేది.

పది పదిహేను సంవత్సరాల తర్వాత మఱల చిక్కల్‌కు వెళ్ళ వలసి వచ్చింది, నా ప్రియస్నేహితుడు వైద్ది కొడుకు పెళ్ళికిగాను. ఈనాటి నాగరిక సంప్రదాయం ప్రకారం ఏదో గ్రీటింగ్స్ పంపి అక్కడితో కర్తవ్యం పూర్తి అయినట్టు వుండొచ్చు కాని ఎన్నో సంవత్సరాల తర్వాత నేను పుట్టి పెరిగిన వూరును, గంటలతరబడి ఈతాడుతూ తనివితీరా స్నానం చేసిన పాలకొలనును, రకరకాల పక్షులు కేరింతలాడే అయ్యనార్ దేవాలయం ఆనుకొనివున్న తోటల్ని, కొబ్బరి మొక్కలు ఏపుగా పెరిగిన కారణంగా వేసవి కాలమయినా చల్లగావుండే 'అమ్మాకుళం' ప్రక్కనుండే మైదానాన్ని, ఋతువులు కేలండర్లో మారుతున్నా పచ్చగా కనిపించే పళని ముదలియార్ పంట పొలాల్ని, అంతకంటె మనిషిలో దైవత్వాన్ని రగులుకొలిపే సింగారస్వామి దేవాలయాన్ని దర్శించాలనే కోరిక చిక్కల్‌కు బయలు దేరమని నన్ను పురమాయించాయి. మరీ ఈవేళో రేపో అంటూ రోజులు దాటేసుకొంటూ స్వామిసన్నిధి తన ప్రాణాన్ని వదలాలని, చిక్కల్ మట్టిలో మట్టిగా కలిసిపోవాలని, ఎందరు ఎన్నో విధాలుగా పిలిచినా ఎక్కడికి వెళ్ళకుండా పల్లెలో పాత యింట్లో వుంటున్న నాన్నమ్మను చూడాలనే ఆశకూడా నా ప్రయాణానికి ఒక ప్రోత్సాహం ఇచ్చింది అంతేకాదు నాకు మొదటి కొడుకు పుట్టినపుడు నాన్నమ్మ సింగారవేలస్వామికి సమర్పించాలని అనుకొన్న మొక్కుబడి గుర్తొచ్చి కుటుంబంతో సహా బయలుదేరా.

ముహూర్తం ఉదయం ఆరు నుండి ఏడున్నర దాకా కావడం వల్ల తిరుపతి తిరుచ్చిఎక్స్‌ప్రెస్‌లో బయలుదేరాం మాయూరంలో మొదటి బస్సు అందకపోవడంతో వుదయం నాలుగున్నర గంటలకు చేరడానికి బదులుగా ఆరుగంటలకు చిక్కల్ చేరాము. ముహూర్తం దాటిపోకుండగా స్నేహితుని ఇంటికి వెళ్ళాలనే తొందరలో నాన్నమ్మ ఇంట్లో లగేజ్ పడవేసి పెళ్ళాం పిల్లల్ని ఆ తరువాత రమ్మని, నేను చెదరిపోయిన క్రాపును చేతులో సరిచేసుకొంటూ తొందరగా నడిచా.

ఆఁ అవును. అదే మోహనరాగం చాలకాలం తర్వాత నా చెవుల్లో రింగురుమంది సరాసరి పందిరికేసి నడవకుండా దూరంగా నిలబడి ఒక్కసారి కళ్ళు మూసుకొని తన్మయత్వం పొందాను కొడగు కొండల్లో పురకలెత్తి కావేరిలాగా సాగే మోహనరాగం, నమ్రతతో గొంతులు తగ్గించి పట్టువిడుపులతో బంగాళాఖాతాన్ని సమీపించే కొల్లిడంలా, నిగర్వంతో ఆత్మార్పణంచేసుకొనే భక్తునిలా మెల్లగా కదులుతూ తెరలు తెరలుగా చెవుల్లో సోకుతూ, ఎందుకో నా హృదయాన్ని పిండేస్తున్నట్లుగా రాగస్రవంతి కదలిపోతుంది మోహనరాగం ఆగి భైరవి ప్రారంభమయింది నేను ముందుకు నడిచాను పందిట్లో నిలబడ్డా వీధికేసి చూస్తున్న వైద్ది నన్ను దూరం నుండే గుర్తుపట్టి ఆప్యాయంతో చేతులు కలిపి పెళ్ళి పందిరిలోకి తీసికెళ్ళాడు. వెళ్ళేదారిలో నాగస్వరం వాయించే సింగార వేలును చూసి రెండు చేతులు జోడించాను పాడ్డం ఆపేయకుండా తలమాత్రం ఓసారి పైకి క్రిందికి వూపుతూ ప్రతి నమస్కారం చేశారు నేను స్నేహితునివెంట వెళ్ళి వధూవరులముందు కూర్చొని సింగారవేలు వైపు దృష్టిపోనిచ్చాను.

చూపు మందగించినట్లున్నది. బొజ్జ బాగా కరిగిపోయింది మనిషి బాగా సన్నపడ్డట్టు అనిపించింది వాయించేవేళ నొసటి నరాలు బాగా వుబికినట్టు కనిపించాయి చేతిలో వుంగరం కూడా లేదు. కట్టుకొన్న పీతాంబరం మాత్రం రంగుపోగా వెలవెలపోతూ చిరిగిపోయిన గత జ్ఞాపకాల చిహ్నంగా నడుముకు చుట్టబడివుంది. 'అయ్యో పాపం' అనేలా దయనీయంగా సింగారవేలు కనిపించారు.

మంగళం పాడింతర్వాత సరాసరి నన్ను వెతుక్కొంటూ సింగారవేలు వచ్చారు. తోటప్రక్క రావలసిందిగా సైగచేస్తూ నన్నుపిలిచారు నేనూ ఆవేపుకి కదిలాను వెళుతున్నవారు ప్రశాంత మయిన స్థలంలో ఆగి నాకేసి చూస్తూ

''తమ్ముడూ ! నీ గురించి అప్పుడప్పుడు వింటున్నా వాకబు చేస్తూనేవున్నా తిరపతిలో వున్నావటగా ఎప్పుడో వొకసారి తిరుపతికి రావాలని, అన్నమాచార్యుల వుత్సవంలో నాగస్వరం వాయించాలని ఓ చిన్న కోరిక. కనకవల్లి కూడా జీవితంలో ఏడుకొండలవాణ్ణి దర్శించాలని ఎన్నోసార్లు చెప్పేది. ఆవిడ ఆశ ఆశగానే మిగిలి పోయింది. చివరకు సింగారవేలు సన్నిధికి చేరుకొంది ''

ఈమాటలు చెబుతుంటే సింగారవేలు కంఠం జీరవోయింది. కళ్ళు చెమర్చాయి కూడా. మౌనంగా నిలబడి వారకేసి చూడ సాగాను.

''ఆ తరువాత తిరుపతికి వెళ్ళాలనేకోరిక కూడా నాకూ లేక పోయింది...ఆఁ అన్నట్టు ఊర్లో రెండు మూడు రోజులుంటారు కదూ! ఊరికి వెళ్లేలోగా ఒకసారి రండి. మా యిల్లు తెలుసుగా'' అంటూ నిబ్బరం తెచ్చుకొన్నవారిమల్లే మాట్లాడారు.

''ఓ ! తెలియకేం ! అయ్యనార్ దేవాలయానికి వెళ్లే త్రోవ లోనే కదూ ! నాకు తెలుసుగా· శుక్రవారం రాత్రి బండికి బయలు దేరాలని అనుకొన్నాం. ఆలోగా తప్పక వస్తానులెండి'' అన్నాను.

ఏదో చెప్పేవారిలా నిలబడ్డారు.

''ఏమండీ'' అడిగాను ధైర్యంగా.

'మీరేమో బాగా చదువుకొన్నవారు. నాగస్వరం అంటే ఆసక్తి వుంది. ఈ రోజుల్లో చదువుకొన్నవాళ్లు సంగీతాన్ని మరీ నాగస్వరాన్ని ఎందుకు పట్టించుకొంటారు చిన్నతనంలో మీ తాత తనకు నచ్చిన పాటలు మా నాన్నచేత పాడించుకోవడం నాకు బాగా తెలుసు అంతేకాదులే. మీ తాత రంగూన్ నుండి వచ్చిన వేళల్లా ఏవో బహుమతులు ఇవ్వందే వూరుకొనేవారు కారు. ఆ రోజుల్లో సంగీతమన్నా నాగస్వరమన్నా పడిచచ్చేవారు కాని ఈ రోజుల్లో సినిమాపాట పాడ్డం వచ్చా అని నిలదీసి అడుగుతున్నారు· ఎప్పుడయినా బాగా వున్నవాళ్ళ పెళ్లికి వెళితే నాగస్వరం విని ఆనందించడానికి బదులుగా ఏవో రాజకీయాలు మాట్లాడుకొంటూ అక్కడ ఒక సంగీత విద్వాంసు డున్నాడని కూడా మరచిపోయి ప్రవర్తిస్తుంటారు. మరి నీ స్నేహితుడు వైద్ది మా యింటికి వచ్చి ప్రాధేయ పడ్డాడు. మనవాడేకదా అంటూ ఒప్పుకొన్నా'' అని చెబుతుండగనే వైద్ది నేనెక్కడి కెళ్ళానో అని చూస్తూ నాకేసి వచ్చాడు.

''మఱచిపోకండి. తప్పక రావాలి మా యింటికి. · ఏదో మీ చేతులతో ఒక చిన్న కానుక స్వీకరించాలి మరోసారి చిక్కల్‌కు మీరు వచ్చేటపుడు నేను వుంటానో వుండనో'' బాధతో వెళ్ళారు నేనూ పెళ్లికి ఆలస్యంగా రావలసివచ్చినందుకు కారణాలు చెప్పకొంటూ పందిరికేసి నడిచా.

సింగారవేలుస్వామి మొక్కుబడి, ఇరుగు పొరుగు బంధువుల ఇళ్ళకు వెళ్ళిరావడం, నాగూర్, వేళాంకణ్ణి స్థలాలు దర్శించడం ఈ విధంగా ఎన్నో రకాలుగా జేబులోని డబ్బు ఖర్చయిపోయింది. శుక్రవారం వుదయం లెక్కేసుకొనేసరికి ప్రయాణం ఖర్చుపోను పది పదిహేను రూపాయలు మాత్రం మిగిలేట్టు అనిపించింది. ఒక పది రూపాయలు జేబులో పడవేసుకొని సింగారవేలు ఇంటిముఖంపట్టా.

సింగారవేలు నాకోసం ఎదురుచూస్తున్నట్టు అరుగుమీద కనిపించారు

''రండి ! రండి!'' అంటూ చేతులు జోడించారు.

జోడించిన చేతుల్ని తొలగిస్తూ నేను

''ఏమండి ! మరీన్ను. మీరేమో పెద్దవారు మీరు చూస్తుండగా పెరిగినవాణ్ణి'' అంటూ నేనే నమస్కారం చేశా.

''మోహనవేలు ! మోహనవేలు !'' అంటూ తన కొడుకుని పిలిచారు.

ఇంట్లో ఏవో పనులు చేసుకొంటున్న మోహనవేలు బయటికి వచ్చి నన్ను గుర్తుపట్టి నమస్కారం చేశాడు.

''వీణ్ణి నా వారసునిగా నియమించి వెళ్ళిపోతున్నా వానికంటూ నేను మిగిల్చింది ఇది మాత్రమే'' అంటూ పాత పట్టు వస్త్రంతో చుట్టిన నాగస్వరాన్ని చూపించారు, పై గుడ్డతో చెమర్చిన కళ్ళు తుడుచుకొంటూ.

''ఆవిడ తనదారి తాను చూసుకొంది నేనేమో ఈ రోజో రేపో అనేలా వున్నాను ఒంటరిగా ఎలా బతుకుతాడో ఏమో'' అని సింగారవేలు మొఖం అవతలి వైపుకు తిప్పకొన్నారు

''అయ్యా ! మీ అబ్బాయి సంగీతం నిన్న గుళ్ళో విన్నా. అచ్చం మీరు పాడినట్టేవుంది ఏం తేడాఅనిపించలేదు. ఆ సింగారవేలస్వామి కాపాడుతాడు'' అంటూ గుడికేసి దండం పెట్టా.

వాడిపోయిన సింగారవేలు మొఖం వికసించింది ఒకసారి కళ్ళల్లో మెరపు మెరసింది.

' అవుననుకో ! నా ఆరోగ్యం ఏంబాగుండడంలేదు. ఎప్పుడో స్వామి ఉత్సవాలప్పుడు ప్రాణం బిగపట్టుకొని ఒకటి రెండు రాగాలు పాడుతున్నా. ఇప్పుడు గుళ్ళో వీడేవాయిస్తున్నాడు. సింగారవేలస్వామి సన్నిధిలో తప్ప వేరేచోట్ల పాడకూడదని ఒట్టు వేయించుకొన్నా. ఇతరుల కోసం వాయించేవేళ మనసు పాడవుతుంది. గౌరవం వుండదు ఏమంటావ్ అంటూ నన్ను అదోలా చూశారు.''

''ఇదిగోనండి'' అంటూ జేబులో వేరేపేపర్లతో కలిసిపోయిన పది రూపాయల కాగితాన్ని గుర్తించి పైకితీసి వారి చేతుల్లో పెట్టడానికి ముందుకు వంగాను బాగా కాచిన పాలలో పడ్డ పురుగును చూసి వాంతి చేసుకొనేవారిలా నాకేసి చూశారు. ఆ అలక్ష్యమైన చూపుకు నేనేం చేయాలో తోచక అక్కడే నిలబడ్డా.

''క్షమించాలి. అనుకోకుండా డబ్బంతా ఖర్చయిపోయింది'' అంటూ పదిరూపాయలు వారి కందివ్వబోయాను.

''నేను మిమ్మల్ని బిచ్చమడగలేదు. బహుమతి అడిగాను. నా విద్య కేవలం ఇది రూపాయలకా విలువ చేస్తుంది? అంత నా పాండిత్యం దిగజారిందా'' అంటూ ఆత్మాభిమానంతో వూగుతూ పూనకం ఎత్తిన వారిలా ఓ అంటూ ఏడ్చారు నేను భయపడి ఏం చెయ్యాలో తోచక ఆగిపోయాను.

''హల్వా, ఆపిల్ రెండూ తిన్న రోజులున్నాయి సింగారవేల స్వామి ప్రసాదం ఒకపూట తిని నాదస్వరాన్ని కౌగలించుకొంటూ వట్టి కడుపుతో పడుకొన్న రోజులు వున్నాయి. అయితే ఎప్పుడూ నేను బిచ్చమడగలేదు. మీరంటే నాకేం కోపంలేదు ఎన్నో రాగాన్ని దివ్యమోహనంగా వాయించే నా చేతుల్ని ఈలా అవమానించడానికి సిద్ధమయ్యారే'' అని బాధపడుతున్నా ఒక పూలహారం మెడలోవేసి తాంబూలం ఇచ్చి

''సింగారవేలు! భేష్. ఈ వయసులో కూడా ఎంచక్కా వాయిస్తున్నావయ్యా'' అంటూ ఒక్కసారి ఒక్కమాట చెప్పి యుంటే చాలు తెగమురిసిపోయేవాణ్ణి. ఇంకా ''ఈ విధంగా కళాకారుల్ని అవమానం చేయకండి'' అంటూ నా ప్రత్యుత్తరంకోసం ఎదురుచూడకుండా ఇంట్లో కెళ్ళిపోయారు. నేను మొగం వేలాడేసుకొని రోడ్డుకేసి నడిచా.

ఏడెనిమిది నెలలు దాటాయి చిక్కాల్ నుండి టెలిగ్రాం వచ్చింది నాన్నమ్మ చనిపోయిందని, వెంటనే బయలుదేరమని మిత్రుడు వైద్ది టెలిగ్రాం ఇచ్చాడు నేనూ, మా అమ్మ వున్న పళంగా బయలుదేరాం బ్యాంక్ నుండి డ్రా చేసిన ఐదు వందల్ని జేబులో పెట్టుకొన్నా నాన్నమ్మ అంత్యక్రియలు ముగించి, ఒక రోజు వుదయం ముందురోజు రాత్రే జాగ్రత్తగా సిద్ధం చేసిన తాంబూలం, పళ్ళు వగైరాలు సంచిలో వడేసుకొని, వంద రూపాయల కాగితం పై జేబులో జాగ్రత్తగా దాచి సింగారవేలు ఇంటికేసి నడిచా.

భూపాలం గాలిలో నాట్యమాడుతోంది. పాట పూర్తిఅయ్యే దాకా ఇంటి వాకిట్లో నిలబడ్డా. ఆ తరువాత దగ్గరికి వేసినతలుపు వంక చూశా. నన్ను చూడగానే నాదస్వరాన్ని చేతుల్లో పట్టుకొని మోహనవేలు లేచి నమస్కారం చేశాడు

'మోహనవేలూ! నాన్న ఏరీ'' ఆత్రుతగా అడిగాను

''నాన్నపోయి రెండు మూడు నెలలు దాటాయి. వేలా, 'వేలా అంటూ చివరి శ్వాస వదిలారు'' అన్నాడు మోహనవేలు. నా గుండె గుభేలుమంది.

''నా బహుమతి పుచ్చుకోకుండా వెళ్ళిపోయారే'' మనసు మూగపోయింది

''దిగాలుపడకు మోహన్. అన్నిటికి ఆ సర్వేశ్వరుడు సింగార వేలే వున్నాడు అంతేకాదు నాన్న సింగారవేలు ఆశీస్సులు ఎప్పుడు నీకు అండగా వుంటుంది'' అని అక్కడేవున్న తట్టలో తమలపాకులు, పళ్ళుపెట్టి వాటిమధ్య వంద రూపాయలు వుంచి మోహన్‌కు అందివ్వబోయాను

ఏదో పామునుచూస్తే వణకుతూ వెనకడుగు వేసేవానిలా మోహన్ వెనక్కడుగు వేశాడు

''మోహన్ తీసుకో నీకే. నీకే ఈ బహుమానం. సంతోషంతో ఇస్తున్నా'' అని తట్ట అందివ్వబోయాను రెండవసారి. మోహన్ మరీ వెనక్కి నక్కుతూ

''అయ్యా! వంద రెండు వందల బహుమతి స్వీకరించేఅర్హత నాకు లేదండి మా నాన్న గొప్ప విద్వాంసుడు. వారికి ఆ అర్హత వుంది అర్హత లేకుండా నా పేదరికాన్ని చూసి బాధపడిగాని, మా నాన్న చనిపోయాడు కదాఅని సానుభూతితోగాని ఇచ్చే డబ్బువద్దండి. నాకు ఆ స్వామి ప్రసాదం మాత్రం చాలు'' అంటూ తాంబూలం మాత్రం తీసుకొని ఇంట్లోకి నడిచాడు.

ఆ కళాహృదయాల్ని, అమృతగానాన్ని అర్థం చేసుకొనే అర్హత నాకు లేకపోయిందే అనే ఆవేగంతో మెల్లగా ఇంటి ముఖం పట్టా. కాంభోజి రాగం చాలసేపుదాకా నా చెవుల్లో రింగురు మంటునే వుంది



# "వియోగ గీతిక"

[ నా పరోక్ష గురుపాదులు శ్రీ దేవులపల్లి వేంకట కృష్ణశాస్త్రిగారిని స్మరిస్తూ ]

ఒక్క గంధర్వ సుందరుండక్కట ! తరు
 ణీ వియోగ వ్యధాగాన కేవలుండు
కేళివనిలోన తిరుగాడు వేళ జారి
ధరణిపై బడె నొక చిన్నవిరహగీతి.

## 2

పడియెనో లేదొ పుడమిపై బాష్పగీతి
చిత్రముగ కోకిలాకృతిశ్రీ ధరించె
ఆ క్షణమునందె గళమెత్తి యార్ద్ర గీతు
లాలపింపగ దొడగె స్వేచ్ఛాంకితములు.

## 3

ఊర్వశీ విప్రయోగాగ్ని ధూర్వహుడు పు
రూరవుడు గాని క్రుద్ధకుబేరశాప
వశుడొకానొక యక్షప్రవాసిగాని
పాడఁకొనని నవీన ప్రబంధములవి !

## 4

అత్య పూర్వము ననఘమ్ములైన యట్టి
ఆ యనూన కరుణగీతు లవధరించి
వివశమ్మైన విశుష్కిత విశ్వవాటి
క్రమ్మకొనియె వాసంతపు గమ్మదనము

## 5

నిజ వియోగ గానామృత నిర్ఝరుల ప్ర
పంచము చిరమ్ము ముంచి తత్ పరభృతమ్ము
మరల నెడబాటు పాటగామారి, తేలి
యెగిరిపోయెను మొన్న స్వనగరము దెస !!!

# విస్మృత శశాంకము

సౌరవిదూరమైన భవసాగరమీదుచు సోలితూలి ని
 ద్రా రమణీ భుజాయుగళి దాగి సుఖంపడుచున్న నన్ను ఈ
చారు శరన్నిశన్ విప్పృత జాలక మార్గమునుండి శీతరుక్
వారము సాచి మేల్కొలిపి బైటికి దెచ్చితివోహొ ! జాబిలీ !

## 2

నచ్చిన నెయ్యురంగలిసి నాచిననాడు వెలంది వెన్నెలల్
విచ్చు నిశీథినీ జరరవీధులలోబడి యాటపాటలున్
ముచ్చటలాడుచున్ విదురమోము నెరుంగక యాప్రభాతమున్
బుచ్చితి తత్ స్మృతుల్ మదిని పొంగుతరంగములట్లు
 నిన్గనన్.

## 3

శారద చంద్రికాస్నపిత సైకతముల్ పులకింప గౌతమీ
తీరమునందు మున్ను కవిదేవుడు నన్నయ దక్షతన్ దళత్
కైరవగంధ బంధుర గా పచరించిన పద్యపంక్తులన్
సారె పఠించుచున్ ధరణి జార్తువా బాష్పకణాలు నావలెన్.

## 4

చీకటి రాత్రులన్ కనులు చేడ్పడ నంధులబోలె గీములన్
మూకత నక్కియుండి జనముల్ నెఱవెన్నెలరేల స్వేచ్ఛమై
ప్రాకట పారవశ్యములు పైకొనగా విహరించుచున్ ధరన్
నాకము నాటుకొన్న తొలినాళ్ల తలంపున బారునే శశీ !

**5**

భువనములెల్ల నిన్ మరచిపోయి నితాంతకృతఘ్న భావమున్
పవటుచు మాటికిన్ నడుమవచ్చిన విద్యుదయత్న దీ:కా
నివహములన్ వరింప గమనింపవయేమొ వృథా(శమంబుగా
నవఘన సారధౌత కిరణమ్ములు చిమ్మెద యాచితమ్ముగన్.

**6**

ఇక్కడ పల్లెలందు మరి యీా నగరంబులయందు మాకు నీ
అక్కర తీరె నింక జని యబ్ధులమీదనొ చిమ్మ చీకటిన్
జిక్కి తపించు ఘోర వనసీమలనో గిరిశృంగపాళినో
చిక్కని జిల్గువెల్గులను చింది కృతార్థత చెందరాదటో.

**7**

కరుణ దొరంగి (క్రొవ్వలపు గత్తియలన్ సరిపాంథబృంద సుం
దరుల యుగాలనుండి స్మరతప్తుల జేసిన పాపమి(క్రియస్
పరిణతిజెంది నీకు పరిభావము గూర్చెనటంచు కొందరం
దురె యవునొ పురాకృతపు దోషమవశ్యము భోగ్యమౌకదా !

**8**

పద పదమందు యామినుల పట్టపగళ్లనుజేయు దీపముల్
పొదలెడు నాళ్లనీకు పనిపుట్టునె? వైద్యుత శక్తియుక్తులన్
పొదుపొనరింపగోరి నిను పూర్ణసుధాకర ! వాడుకొందు మ
య్యదియె విశేషభాగ్యముగ నప్పటికిన్ పరితృప్తిజెందుమా !

శ్రీ శనగన నరసింహస్వామి

---

# ప్రస్థానం

## శ్రీ కశింకోట ప్రభాకరదేవ్

మస్తిష్కంలో
మహోషస్సును ఆవిష్కరించే తేజస్వీ !
నీరవ నిశ్శబ్దమానసాలలో
(ప్రభంజనమై చెలరేగిన మనస్వీ !
నిరంతర కాలవాహినిలో
అచంచలమై నిలచిన యశస్వీ ! !
తిమిరంలో తైతెక్కలాడే
గబ్బిలాలకు వెలుగెక్కడ రుచిస్తుంది ?
తరతరాల —
ఛాందస తత్వవాదోన్మత్తులకు
స్వేచ్ఛావాద మెక్కడ తలకెక్కుతుంది ?
నిలువెల్లా
'అహం' నింపుకున్న మహానుభావులకు
సమతావాద మెక్కడ రుచిస్తుంది...?
అందుకనే కాబోలు —
వేదాంతిలాగ నవ్వుకుంటూ
ఏకతారను మీటుకుంటూ
మరలిరాని తావుకి
తరలిపోయావు.

# ఆ త డు ...

## శ్రీ అడిదం పాపారావు

పిలుస్తే కనుపించడు మనిషిలా
  తలుస్తే మాత్రం నాలో కనుపించక
దాగిన గుండెలా, గుండెల్లో
గూడుకట్టుకుని ఉంటాడు ఎప్పుడూ...
తిండికి లేదని ఏడవను
చచ్చిపోతాననే పిచ్చిభయంలేదు.
అయినా మనిషిగా -
ఎందుకో ఎప్పుడో
ఆవేదనతో - అతన్ని చూడలేదనే
ఆవేదనతో ! —
కన్నీరు కార్చితే
ఆ నా కన్నీటితోనే
నా గుండెల్ని చల్లగా కడిగి
ఊది మీటిమరీ వదుల్తాడు.

ఎన్నోసార్లడిగాను అతణ్ణి
నన్నుకూడా తీసుకుపొమ్మని
కాదనడు వస్తానుండంటాడు
ఎప్పుడు వస్తాడో —
మగతగా ఉంటుంది
అతడు వస్తున్నప్పుడు.

కలత నిద్దురలో
అడుగుతూనే ఉంటా
'లేపవయ్యాస్వామీ' అని
నవ్వుతాడు చల్లగా

పువ్వు విప్పారినట్టు
ఉలిక్కి పడతాను
మోసం గ్రహించి, నే
లేచే లోపుగా
బరువెక్కిన నా కనురెప్పల
అంచుల్లో కనుపిస్తాడు
పాలరాతి బొమ్మలా ...
పున్నమి వెన్నెల్లా ...

వెంబడిస్తాను
మోము చూడాలని
వీలైతే ... ...
అతని పాదాల్ని
తనివితీరా
స్పృశించాలని.

చూస్తూనే దూరమౌతాడు
దూరాన్నుండే
చేతులు చాచుతాడు
అందుకోలేనని
తెలిసికూడా ...
ఆతడు చెలికాడే కాదు.
చతురుడుకూడా !
... ... ... ...
గుండెల్లో ఏదో సవ్వడి
అతని పదముల సవ్వడి !



# సింగభూపాలుని రసార్ణవ సుధాకరము

[పరిష్కరణ ప్రొఫెసర్ టి వేంకటాచార్య, టోరంటో యూనివర్శిటీ, కెనడా. సైజు: డెమ్మీ, పుటలు . (ఉపోద్ఘాతము) 120+524 ప్రచురణ : ది అడయార్ లైబ్రరీ అండ్ రీసర్చ్ సెంటర్, మదరాసు, 1979. వెల : తెలియదు.]

సంస్కృత వాఙ్మయములో అలంకారశాస్త్రమునకు ప్రత్యేకమైన స్థానము కలదు. అలంకారశాస్త్రము సాహిత్య శాస్త్రమునకు పర్యాయ శబ్దముగా వాడబడుచు క్రమముగా సాహిత్య శాస్త్రములో ఒక ప్రత్యేక విభాగముగ రూపొందినది భరతుని నాట్యశాస్త్రముతో ప్రారంభింపబడిన యీ శాస్త్రము 18, 19వ శతాబ్దములవరకు అవిచ్ఛిన్నముగా కొన్ని వందలమంది యాలంకారికులచే పోషింపబడి బహుముఖములుగా విస్తరిల్లినది. అలంకార శాస్త్రమును పరిపుష్ట మొనరించిన వారిలో యాంధ్రులు ప్రముఖస్థానము నలంకరించిరి. వారిలో చమత్కార చంద్రికను రచించిన విశ్వేశ్వరుడు, రసార్ణవ సుధాకర కర్తయగు సింగభూపాలుడు, ప్రతాపరుద్ర యశోభూషణ మును రచించిన విద్యానాథుడు, సాహిత్య చింతామణి కర్తయగు వీర నారాయణుడు, సాహిత్య రత్నాకరమును రచించిన ధర్మసూరి, రస గంగాధర కర్తయగు పండిత జగన్నాథరాయలు, కావ్యలక్షణ వాద మును రచించిన వట్టిపల్లి నరకంఠీరవశాస్త్రి మొదలగువారు ప్రసిద్ధులు.

రసార్ణవ సుధాకరమును 1895 సం॥లో శ్రీ వేంకటగిరి రాజావారు తెలుగు లిపిలోను, 1916లో తిరువనంతపురం సంస్కృత గ్రంథమండలివారు తమకు గ్రంథ, మళయాళ లిపిలో లభించిన ఆరు వ్రాత ప్రతుల నాధారము చేసికొని దేవనాగరలిపిలో టి. గణపతిశాస్త్రి పరిష్కరణముతోను, 1950లో శ్రీ బులుసు వేంకటరమణయ్యగారి యాంధ్రానువాదముతో తెలుగు లిపిలో శ్రీ పిఠాపురం మహారాజాగారు ప్రకటించిరి. కాని యివి పునర్ముద్రణ భాగ్యమునకు నోచుకొనకపోవుటవలనను, తెనుగు లిపిలో నుండుటవలన, తెలుగులిపి తెలియని వారికి నిరుపయోగమగుట వలనను సమస్త పండిత లోకమునకు రసార్ణవ సుధాకరము అందు బాటులో లేక యీ గ్రంథపు టౌన్నత్యము మఱుగునపడియుండినది. ఇట్టి లోటును తిరుపతి శ్రీ వేంకటేశ్వర ఓరియంటల్ కళాశాలలో పండితరాజ శ్రీమాన్ డి. టి. తాతాచార్య, ఉత్తమూరు వీరరాఘవాచార్యులు, పురశి కృష్ణమాచార్యులు, నీలమేఘాచార్యులు మొదలగు దిగ్దంతులవంటి సంస్కృత పండితులను సేవించి 'వ్యాకరణ శిరోమణి'' పట్టమును బొందినవారును; మదరాసు, కలకత్తా విశ్వవిద్యాలయములనుండి ఎం. ఎ. పట్టమును పొందినవారును; ఉభయాభిసారిక కృష్ణచరితమ్, దశరూపకమ్, నలకీర్తి కౌముది, దశరూపక పద్ధతి, హర్షచరితమ్ మొదలగు సంస్కృత గ్రంథములను విమర్శనాత్మకమగు విపుల పీఠికలతో పరిష్కరించినవారును, సంస్కృతాంగ్లములలో పెక్కు పరిశోధన వ్యాసములను ప్రకటించిన వారును, తిరుపతి శ్రీ వేంకటేశ్వర ఓరియంటల్ కాలేజిలోను, సిలోనులోని విద్యోదయ విశ్వవిద్యాలయములో నధ్యాపక వృత్తినొనర్చి ప్రస్తుతము, కెనడాలోని టోరంటో విశ్వవిద్యాలయములో సంస్కృతాచార్యులుగా పనిచేయుచున్న విద్వద్వరేణ్యులు, సంస్కృతాంగ్ల సవ్యసాచులు శ్రీ టి. వేంకటాచార్యులు తమ యసమానమైన ప్రస్తుత గ్రంథ ప్రచురణముచే పూరించిరి.

రసార్ణవ సుధాకరము కావ్య, నాటక, నాట్య, రస విషయములకు పెన్నిధి. ఇందలి విషయములు లక్ష్య లక్షణ సమన్వితములై మిక్కిలి సులభ శైలిలో వివరింపబడియున్నవి. రసికులకుల్లాసము కల్గించును గాన నీ గ్రంథములోని భాగములకు విలాసమని పేరు. ఇందు చర్చించబడిన విషయములు నాట్య నాటక రచనలకే కాక శ్రావ్యములైన కావ్యముల రచనకును నుపకరించును. ఇందుదహరింపబడిన గ్రంథములను పరిశీలించిన సింగభూపాలుడెన్ని గ్రంథములు చదివెనో, యతని పాండిత్య మెట్టిదో విశదము కాగలదు. అంతే కాక నిందు తాను స్వయముగా రచించిన కువలయావళి (రత్నపాంచాలిక) పేరుదహరింపబడకపోవుటచే రసార్ణవ సుధాకరము తరువాత యిది రచింపబడి యుండవచ్చును అని ఊహించవచ్చును. ఇది మిక్కిలి ప్రమాణమైన యలంకారశాస్త్ర గ్రంథము, కావుననే ప్రఖ్యాత వ్యాఖ్యాత మల్లినాథసూరి తన వ్యాఖ్యానమున పెక్కు తావులలో యీ గ్రంథమునుండి వాక్యముల నుదహరించెను.

సింగభూపాలుడు తనకు పూర్వము రచించిన యాలంకారికుల సిద్ధాంతములు తప్పని తోచినప్పుడు వాటిని ఖండించి తన మతమును నిరూపించును. ఉదాహరణకు — వేశ్యను నాటకాదులందు వర్ణింపరాదని చెప్పిన శృంగార తిలకములోని యభిప్రాయములను ఖండించి తన వాదమును నిరూపించుకొనెను [1] కొన్ని తావులలో ప్రాచీనాలంకారికుల మతము నుటంకించును.[2] తన యభిప్రాయములకు, వాదముల కనువుగా, ఉపోద్బలకముగా భరత నాట్యశాస్త్రము, (రుద్రటుని) శృంగార తిలకము, దశరూపకము, భావప్రకాశములనుండి ప్రమాణ వాక్యములను పెక్కింటి నుదహరించును. నాటకములో వస్తుసూచ్యమైన చూలికకు ఖండచూలిక[3] యను భేదమును కల్పించెను. ఇటువంటి ఖండచూలికను మరెవ్వరును చెప్పలేదు.

భారతదేశములోని వివధ గ్రంథాలయములను సందర్శించి పెక్కు తాళపత్ర గ్రంథములను పరిశీలించి వివిధ విషయ విలసితమగు దీర్ఘ విమర్శనాత్మక పీఠికతో యీ గ్రంథమును

శ్రీ వేంకటాచార్యులు ప్రకటించుట కనువుగా కెనడా కౌన్సిల్‌వారు, హ్యూమానిటీస్ రీసర్చ్ కౌన్సిల్ ఆఫ్ కెనడావారు ఆర్థిక సహాయము చేసిరి.

సుమారు 120 పుటలుకల విపులమైన యాంగ్ల పీఠికలో కృతజ్ఞతా ప్రకటనము, సంకేతాక్షరముల పట్టిక, రసార్ణవ సుధాకరములోని విషయ వివరణము, ఈ ప్రచురణములో నుపయోగించిన ప్రాచీన వ్రాత ప్రతులు, రసార్ణవ సుధాకర నామౌచిత్యము, పాఠభేదములు మొదలగు విషయములు కలవు. తరువాత 455 పుటలలో మూలగ్రంథము చక్కగా ముద్రింపబడినది. పిమ్మట యీ గ్రంథములోని (అర్థ)కారికలకు విలాస (అధ్యాయ), కారిక, పుట సంఖ్యలను తెలియజేయు యనుక్రమణిక, ఈ గ్రంథములో ఉదాహరణ ప్రసంగమున తదితర సమయమున నివ్వబడిన శ్లోకముల యనుక్రమణిక, ఏతద్గ్రంథ పరిష్కరణమున పరిశీలింపబడిన గ్రంథముల పట్టిక, చేర్పులు - సవరణలు అనెడి భాగములు కలవు.

రసార్ణవ సుధాకరము భరతుని నాట్యశాస్త్రము ననుసరించి విపులముగా వ్రాయబడిన నాట్యశాస్త్ర ప్రధానమగు గ్రంథము. దీనిని రేచర్ల వంశీయుడగు రెండవ సింగభూపాలుడు రచించెను. ఇతని కాలము 14వ శతాబ్దములోని ఉత్తరార్థము. దీని నితడు క్రీ. పూ. 1381 తరువాత రచించెను. ఈ గ్రంథమున 3 విలాసములు కలవు. నాట్యవేదోత్పత్తి, నాట్యలక్షణము, రసలక్షణము, నాయికానాయక భేదములు, లక్షణములు, రీతులు, వృత్తులు, ప్రవృత్తులు, రసస్వరూపము, సాత్త్వక, వ్యభిచారి భావములు వీటి లక్ష్య లక్షణములు, సంస్కృత నాటక విషయము, దాని వైవిధ్యము, పంచ సంధులు, సంధ్యంగములు, ఇరవైయొక్క సంధ్యంతరములు, ముప్పదియారు భూషణములు, దశరూపకములలో వస్తువైవిధ్యము, వివిధ రూపకములలో పాత్రలను సంస్కృతప్రాకృతములను పిలుచుట కుపయోగించెడి పదములు మొదలగు విషయములు కలవు. ఈతని ఇతర గ్రంథములు కువలయావళి (లేక రత్నపాంచాలిక), సంగీత సుధాకరము, నాటక పరిభాష.[4]

రేచర్ల భూపతులు తెలుగు సంస్కృత భాషలను సమముగనే యాదరించినను సంస్కృత కవుల కావ్యములు వెలుగుకువచ్చి యాదరణ పొందినట్లు తెలుగు కావ్యములు బయటికి రానేలేదు.[5] చారిత్రక దృష్టితోనే గాక శాస్త్ర ప్రమాణముగను సింగభూపాలుని రసార్ణవ సుధాకరము యగ్రశ్రేణికి చెందినది. సింగభూపాలుడు పండితాభిమాని, కవి, పండిత ప్రభువు. కొందరు విమర్శకులు[6] సింగభూపాలుని యాస్థాన విద్వాంసుడు, చమత్కార చంద్రికాకారుడునగు విశ్వేశ్వరుడి రసార్ణవ సుధాకరమును రచించి దాని కర్తృత్వమును తన ప్రభువగు సింగభూపాలుని కారోపించెనని చెప్పుట సరికాదనియు, ఒకవేళ సింగభూపాలునికి గ్రంథరచనమున కలిగిన కొన్ని సందేహములను విశ్వేశ్వరుడు తీర్చియుండవచ్చుననియు కావున సింగభూపాలుని రసార్ణవ సుధాకర కర్తృత్వమును శంకింప పనిలేదనియు శ్రీ వేంకటాచార్యులు నుడివిరి.[7]

రసార్ణవ సుధాకరములో ఉదాహరణ ప్రసంగమునను తదితర సమయములందు చెప్పబడిన కొన్ని చాటుశ్లోకములు[8] సింగభూపాలుని వర్ణించునవిగ యున్నవి. వీటి నాధారము చేసికొని సింగభూపాలుడు తనను గూర్చి తానే శ్లోకములు వ్రాసి రసార్ణవ సుధాకరమున ఉదహరించుట అనుచితమగునని చెప్పుట తగదు. తాను రచించిన గ్రంథములో లక్షణములకు తానే స్వయముగ లక్ష్యములను గూడ రచించినట్లు సింగభూపాలు డెచ్చటను చెప్పుకొనలేదు. కావున ఇతరులు తనమీద రచించిన శ్లోకములను పెక్కింటిని సందర్భౌచిత్యముగా తన గ్రంథములో చేర్చుకొనెను. తన బంధువర్గములోని వారిని గురించి చెప్పిన చాటు శ్లోకములను[9] గూడ సింగభూపాలుడు తన గ్రంథములో ప్రవేశపెట్టెను. ఇట్లు ప్రాచీనుల గ్రంథములనుండి కొన్ని శ్లోకములను లక్ష్యములుగా తమ గ్రంథములలో స్వీకరించుట నాటి కాలపు గ్రంథకర్తలకు అలవాటుగ నుండెడిది. తమకన్న పూర్వముండిన పండితులను, కవులను గౌరవించుటకు ఇది యొక పద్ధతి కాబోలు. సమకాలికులను గూడ నిట్లే యాదరించుచుండిరి. అంతేకాక విశ్వేశ్వరుడు తన చమత్కారచంద్రికలో[10]

మహాప్రబన్ధ సామ్రాజ్య మధికర్తు మిదం క్షమమ్,
సింగభూపాల రచితే రసార్ణవ సుధాకరే.

(తృతీయ విలాసము)

అనుక్తానామిహాన్యేషాం లక్ష్యలక్షణ విస్తరః,
సింగభూపాల రచితే రసార్ణవ సుధాకరే. (పంచమ విలాసము)

అని స్పష్టముగా సింగభూపాలుడు రసార్ణవ సుధాకర కర్తయని చెప్పెను. దీని కనుగుణముగా సింగభూపాలుని సంస్కృత వైదుష్యమునుకూడ స్తుతించెను.[11] మరియు సింగభూపాలునిచే రచించబడిన పెక్కు ముక్తకములు[12] అమరుక శ్లోకములను బోలి రసవత్తరముగా నుండుటచే సింగభూపాలుడు కవి, పండితుడు, అతడే నిస్సంశయముగా రసార్ణవ సుధాకరమును రచించెననియు చెప్పవచ్చును.

## వంశ నామము

సింగభూపాలుడు రేచర్ల వంశమునకు[13] చెందినవాడు. ఇతనికి కుమార యను ఉపనామము కలదు.[14] రాజాచలము (అనగా రాచకొండ, రాజకొండ) ఈ వంశమువారి పరంపరాగతమగు రాజధాని. శ్రీవిష్ణువు పాద పద్మముల నుండి పుట్టిన రేచర్ల వంశములో ఖడ్గ నారాయణుడను యాచమ నాయకు డుద్భవించెను. అతని ఇల్లాలు పద్మనాయక సంజాత సోచమాంబ. వారికి సింగప్రభువు, వెన్నమ నాయకుడు, రేచ మహీపతి జన్మించిరి. వారిలో మొదటి సింగ భూపాలుడు ఏలేశ్వరము నందు బ్రహ్మ ప్రతిష్ఠాపన మొనర్చి తన్ను సృజించిన బ్రహ్మయొక్క ఋణమును దీర్చుకొనెను. అరిభయంకరుడగు సింగభూపాలుని తమ్ముడు రేచభూపతి మహావీరుడై వీర గురువను ప్రఖ్యాతిని గాంచెను. అతనికి కరారిరాయ, రాహుత్తరాయ బిరుదాంచితుడగు నాగనాయకుడను పుత్రుడు కలిగెను. సింగభూపాలునికి అనంతుడు, మాధవుడు అను ఇరువురు కుమారు

లుండిరి. అనంతునికి, రాజులకుండు దోషములు లేనివాడగుటచే అనపోతుడను పేరు కూడ ఉండెను. భూభారము వహించు శక్తి కలవాడు కాన అనంతుడను యథార్థనామము కలిగెను. అతడు మిక్కిలి దానశీలి, అరిభయంకరుడు, ఖడ్గనారాయణ బిరుదాంచితుడు. అతని భార్య అన్నమాంబ వారికి వేదగిరి, (రెండవ) సింగభూపతి (అనగా రసార్ణవ సుధాకరకర్త) అను పుత్రు లిరువురు జన్మించిరి [15]

రేచర్ల వంశీయులు వెలమనాయుడు తెగకు చెందినవారే కాని క్షత్రియులు కాదు. వీరు నల్లగొండ జిల్లాలోని రాచకొండను రాజధానిగా చేసికొని పాలించుచుండిరి. తమ దుర్గము బహమనీ సుల్తానులచే నాక్రమింపబడినప్పుడు 15వ శతాబ్దపు చివరి భాగములో కర్నూలు జిల్లాలోని వెలుగోడుకు తరలివచ్చి యక్కడ రాజ్యమును స్థాపించి వెలుగోటివారని ప్రసిద్ధి చెందిరి.[16] కాకతీయ చక్రవర్తులకు అంగరక్షకులుగా నుండిన పద్మనాయకులు చాలామంది ఉండిరి. వీరిలో 77 గోత్రముల వెలమవారు ప్రసిద్ధులు. వీటిలో రేచర్ల గోత్రమొకటి [17] వీరి మూలపురుషుడు బేతిరెడ్డి, బేతాళ నాయకుడను పర్యాయ వ్యవహార నామము కల చెవ్విరెడ్డి యని చారిత్రకుల యభిప్రాయము. హాలికుడైన చెవ్విరెడ్డి పొలము దున్నుచుండగా ఒక నిధికన్పించెననియు దానిని పొందుటకు ధనలక్ష్మి నరబలికోరగా, చెవ్విరెడ్డి నమ్మినబంటు రేచడనువాడు నిధికి తాను బలియగుదుననియు ఆ నిధిలో తనకు భాగము అక్కర లేదనియు తన పేరును మాత్రము వారి యింటి పేరుగ పెట్టుకొనిన చాలుననియు, చెవ్విరెడ్డి సంతతివారికి జరుగు పెండ్లిండ్లలోనైనను ముందు రేచని సంతతివారికి పెండ్లిచేసి తరువాత పెండ్లి జరిపింపవలయుననియు చెప్పి నిధికి బలియాయెను. అప్పటి నుండి చెవ్విరెడ్డి వంశీయులకు రేచర్ల వంశమని పేరొచ్చెను.[18] ఈ వంశనామము ఎద్మనాయక వంశజులకేకాక బమ్మసేనాని మొదలు కాట్రెడ్డి వరకు గల పిల్లలమఱ్ఱి సేనానాయకులకు కూడ వంశనామమైనది. ఇట్లు ఇరుతెగల వారికి నివాసగ్రామము ఒకటేయైనందున, రేచర్ల నామ మిద్దరికి కలిసియున్నందువలన ఈ రెండు వంశములవారు ఒకటే యను భ్రాంతి చరిత్రకారులకు కలిగినది. కాని శాసనములు పరిశీలించినచో ఈ రెండు వంశములు వేరనియు గృహనామముగా రెడ్డి సేనాధిపతులు, గోత్రనామముగా పద్మనాయకులు వాడుకున్నట్లు తెలియుచున్నది.[19]

కాని ఈ గ్రంథ సంపాదకులు, పరిష్కర్తలు శ్రీ వేంకటాచార్యులు ఈ విషయముతో నేకీభవింపక రేచర్ల శబ్దము నిట్లు వివరించిరి.

"మల్లినాథుడు తన వ్యాఖ్యాన గ్రంథాంత భాగములలో తనను కోలాచల మల్లినాథసూరియని చెప్పుకొన్నాడు. అతని కుమారుడు కుమారస్వామి కూడ రత్నాపణ వ్యాఖ్యానములో తన తండ్రిని గూర్చి అట్లే చెప్పెను. కొన్ని తాళపత్ర గ్రంథములలో 'కోలాచలము'నకు బదులు 'కొలచెర్ల' అని కలదు. కావున సంస్కృత 'కోలాచలము'నకు ప్రాంతీయమైన యాంధ్ర భాషలో రూపము 'కొలచెర్ల' అయియుండవచ్చును. ఆంధ్రదేశములో మాచర్ల, బేతంచర్ల వంటి చర్ల పదాంత్య నామములు కలవు. మాచర్ల మహాచలము నుండి బేతంచెర్ల, వేతాళాచలము నుండి వచ్చియుండవచ్చును ఇదే విధముగ రేచర్ల' కూడ 'రాజాచలము'నుండి మార్పు చెందియుండవచ్చును. ఈ రాజాచలము (రాజకొండ, రాచకొండ, రేచర్ల) వంశ పరంపరగ వచ్చిన రాజధాని. సింగభూపాలునికి పూర్వము పరిపాలించిన ప్రభువు లందరి వంశమునకు రాజాచల వంశమనియే పేరు. ఈ 'రాజాచలము' నుండియే 'రేచర్ల' శబ్దము పుట్టియుండును. వెలుగోటి వంశావళిలో చెప్పబడిన రేచర్ల వంశ వృత్తాంతమునకు వాఙ్మయములోను, శాసనములలోను నిదర్శనములు కానరావు." వీరి యూహ యుక్తియుక్తముగ నున్నది. దీనిని భాషా శాస్త్రజ్ఞులు, చరిత్రకారులు పరిశీలింతురుగాక !

శ్రీ వేంకటాచార్యులు రసార్ణవ సుధాకరమున నుదహరింపబడిన కఠారిరాయ, రాహుత్తరాయ, సోమకుల పరశురామ, భుజబల భీమ, అరిగయ గోపాల, ఖడ్గనారాయణ, ప్రతి గండభైరవ యను తెలుగు, సంస్కృత బిరుదముల యర్థమును వాటి సాధుత్వమును తమ పీఠికలో విపులముగా చర్చించిరి.

పై చెప్పిన విషయములేకాక ఈ ప్రచురణమునందీ విశేషాంశములు కన్పించును.

(1) ప్రస్తుతపరిష్కర్తలు చక్కని సంస్కృతపండితులు, పరిశోధనలో, పరిష్కరణలో ఆరితేరినవారు కాన ఇతర వ్రాత ప్రతులను, మైక్రోఫిల్మ్ కాపీలను పరిశీలించి మూలగ్రంథమును పెక్కు పాఠభేదములతో ప్రచురించిరి.

(2) మూల గ్రంథములోని కొన్ని శ్లోకములకు, శబ్దములకు అక్కడక్కడ అధోజ్ఞాపికలలో సంక్షేప వివరణమును పొందుపరచిరి కొన్నింటికి తులనాత్మకమగు నితర గ్రంథముల నుండి విశేషాంశములను చేర్చిరి

(3) ఇందుదాహృత శ్లోకములకు ఆకరముల నిచ్చి వాటి పట్టికను రూపొందించిరి. శ్రీ బులుసు వేంకటరమణయ్యగారు కూడ అక్కడక్కడ శ్లోకముల కాకరము లిచ్చినను వారి గ్రంథము యాంధ్ర లిపిలో నుండుట అది యాంధ్రభాష తెలిసినవారికే పరిమితము. ప్రస్తుత గ్రంథము నాగర లిపిలో నుండుటచే అందరికిని అందుబాటులో నున్నది.

(4) ఈ పరిష్కరణకు మునుపు గ్రంథములో నుండిన స్ఖాలిత్యములు, అపపాఠములను సంస్కరించి శ్రీ వేంకటాచార్యులు విమర్శనాత్మకమగు పీఠికతో ప్రచురించి పండిత ప్రపంచమున కెంతయో యుపకార మొనర్చిరి.

(5) ముద్రణలో తప్పులు లేకుండా చక్కని పేపరుపై నిర్దుష్టముగా నాగర లిపిలో ఈ గ్రంథము ముద్రింపబడినది.

ఇంతచక్కని గ్రంథమును ప్రచురించిన అడయార్ లైబ్రరీ వారు, వైదుష్య ద్యోతకమగు పీఠికతో పరిష్కరణ గావించిన శ్రీ వేంకటాచార్యులు మిక్కిలి అభినందనీయులు. దీనిని సమస్త పండితలోకము ఆదరించగలదని నా నమ్మకము.

## అధోజ్ఞాపికలు

1 I. 115, పుట 52. అట్లే భోజుడు ఉద్ధత, ప్రేయ, శాంత, ఉదాత్తములను రసములుగా పేర్కొనుటను సింగ భూపాలుడు ఖండించెను. చూడుడు II. 156, పుట 245. కాని ఈ విమర్శ తృప్తికరముగా లేదని డా. వి. రాఘవన్ యభిప్రాయము. చూడుడు Dr. V. Raghavan's Bhoja's Sringaraprakasa, 1963, పుట 419.

2 అదే గ్రంథము, పుటలు 216, 247, 298.

3 III 191–2.

4 S. K. De : History of Sanskrit Literature (K. L. Mukhopadhyaya. Calcutta, IIed. 1960) Vol I. పుట 240.

5 తేరాల సత్యనారాయణ శర్మ : రాచకొండ చరిత్రము (విజయ భారతి నిలయం, నల్లగొండ, ప్రథమ ముద్రణ, 1970), పుట 3.

6 వేటూరి ప్రభాకరశాస్త్రి : శృంగార నైషధము, పుట. 205.

7 పీఠిక, పుట 57.

8 ఉదాహరణములు :

(అ) బాలా సఖీతమ లతాంరితా భవన్త
మాలోక్య ముగ్ధ మధురై రలసై రపాంగైః
సింహ క్ష్మారమణ! చిత్తజ మోహనాస్త్రై
ర్లక్ష్మీ రభిత్తి లిఖితేవ చిరం సమాస్తే. I. 202

(ఆ) శ్రీ సింహ భూప ప్రతినాయకానాం
స్విద్యన్తి గాత్రాణ్యతివే పితాని,
తత్కార్య సంవాదిషు గర్జితేషు
ప్రియాభిరాలంబిత కంధరాణామ్. II. 103

(ఇ) అయం రామో నాయం సతు జనక ధర్మం దళితవాన్
... ... ... ... ... ... ...
... ... ... ... ... ... ...
నిదానం భాగ్యానాం జయతి ఖలు సింహక్షితి భూపతిః
II. 109

9 II. 153.

10 మెహర్‌చంద్ లచ్మన్‌దాస్, ఢిల్లీ (1972) వారి ప్రచురణము క్రమంగా పుటలు 78, 130.

11 రాజా సంస్కృత వాదము ప్రణయవా నిత్యాశయా సంస్థితం
... ... ... ... ... ...
... ... ... ... ... ...
తైస్సాకం సుపదీకరోతి కృపయా శ్రీ సింగ నారాయణః
అదే గ్రంథము, పుట 14.

12 పుటలు 47, 55, 57 మొదలగునవి.

13 రాజా స రాజాచల నామధేయా
మధ్యాస్త వంశక్రమ రాజధానీమ్,
సతాం చ రక్షామ సతాం చ శిక్షాం
న్యాయానురోధా దను సందధానః
రసార్ణవ సుధాకరము, I. 41.

14 శృంగార శ్రీనాథము, పుటలు 200, 209.

15 రసార్ణవ సుధాకరము I. 4–26.

16 వివరములకు వెలుగోటి వారి వంశావళి (డా. ఎన్. వెంకట రమణయ్యగారి ఆంగ్ల పీఠికతో మద్రాసు విశ్వ విద్యాలయము వారి ప్రచురణము) చూడుడు.

17 తూమాటి దొణప్ప : ఆంధ్ర సంస్థానములు – సాహిత్య పోషణము (ఆంధ్ర విశ్వవిద్యాలయ ప్రచురణము, 1969) పుట 243.

18 వెలుగోటివారి వంశావళి.

19 రాచకొండ చరిత్ర, పుట 11.

డాక్టర్ కాశీభట్ట సేతురామేశ్వరదత్త



శ్రీ ఎమ్. పార్థసారథి

# మనిషి - పశువు

## (ఒక ఇంటర్వ్యూ)

గౌరి విూకేమవుతుంది ?

అదేమిటీ అలా అడుగుతారు ! అది మా అమ్మాయి.

ఆమెలో ఈ లోపం వుందని విూరెప్పుడు మొదటిసారిగా తెలుసుకున్నారు ?

ఏమో ! నాలుగైదేళ్ల దాకా అసలు మేం పట్టించుకోనే లేదు. ఐనా బాబూ, మేమేం చదువుకున్న వాళ్లమా ఏమన్నానా, ఉండేదేమో ఈ పల్లెటూళ్లోనాయె ఎవర్నడిగినా, లోపమేవిూ లేదు. ఎదుగుతుంటే అంతా అదే సర్దుకుంటుందిలే అన్నారు.

ఆ లోపం నయం చేయించటానికి విూరేమైనా ప్రయత్నం చేశారా ?

ఒకటి రెండుసార్లు హైద్రాబాద్‌లో డాక్టర్లకు చూపించాం. వాళ్ళూ చూసి, ఇది మందులవల్ల తగ్గేదికాదు, మంచి ట్రెయినింగ్ యివ్వాలి అంటో ఏదో చెప్పారు. అక్కడికీ తృప్తి పడక ఏవేవో దేశవాళీ మందులు కూడా వాడేం. కాని ఏమీ నయంకాలేదు.

గౌరి ఏమైనా చదువుకుందా ?

ఇలాంటి దానికి చదువు మాత్రమెలా అంటుతుందీ ? దానికి తెలిసేటట్టు చెప్పటానికి ఏ టీచరుకు మాత్రం ఓపికుంటుంది ? పది పన్నెండేళ్లదాకా అట్లాగే స్కూలుకు పంపించాం. అదేదో క్లాసులన్నీ పాసైందని కాదు. పిచ్చి మాలోకం—విన్నవి, మనసుకు పట్టినవి వూరికే నెమరేసుకుంటూ వుండేది.

డాక్టర్లకు చివరిసారిగా ఎప్పుడు చూపించారు ?

దానికి పెళ్లై పదేళ్లయిందా, పెళ్లికి ముందర ఓ సారి చూపించాం. అదీ, అబ్బాయి తరఫువాళ్లు, యిది కాక యింకేమైనా లోపముందేమోనని అనుమాన పడితే, వాళ్ల తృప్తికోసం

మరి యిలాంటి అమ్మాయికి పెళ్లి సంబంధాలు చూడటానికి యిబ్బంది కలగలేదూ ?

సరే, ఏం చెప్పమంటారు. పొలం సగానికిపైగా దాని పెళ్లి కోసమే హరించుకుపోయింది. ఎన్ని సంబంధాలు చూశామని. చివరికి దేవుడిలాగా ఈ అబ్బాయి కనిపించాడు లేకపోతే ఏమయ్యేదో! చదువుకున్నవాడు, సంస్కారవంతుడు ఐనా యిలాంటి దాన్ని చేసుకోవటానికి ఒప్పుకున్నాడంటే కలియుగంలో శ్రీరామచంద్రుడన్నమాటే. ఆ అబ్బాయి తల్లిదండ్రులు — కట్నం మిచ్చామని వాళ్లను దూషిస్తామనుకోకండి. ఇలాంటి దాన్ని కట్నంతో మాత్రం చేసుకోవటానికి ఎవరు ముందుకొస్తారు !

అక్కడ, వాళ్లు విూ అమ్మాయిని ఎలా చూస్తున్నారో తెలుసా ?

ఏం, ఏమైంది ?

వాళ్లందరూ, విూ అమ్మాయిని చాల నీచంగా చూస్తున్నారు, శ్రీరామచంద్రుల్లాంటి విూ అల్లుడు రాఘవరావుతో సహా, ఆది దంపతుల్లాంటి మీ వియ్యంకుడూ, వియ్యపురాలితో సహా. చివరికి లవకుశుల్లాంటి మీ మనవలు కూడా తల్లి అనే యింగితమైనా లేక ...

ఏమంటారు ?

మీ అమ్మాయికి ఎదురు చెప్పటం తెలియదు. దానికి తోడు పనిలో కూడా మెతక వాళ్లామెను ఎన్ని రకాల తిడతారో, అవ మానిస్తారో ... ఒక్క దానికీ జవాబివ్వదు

అయ్యో అలాగా నా తల్లి ఐనా మొగుడన్నవాడెవడు కొట్ట కుండా తిట్టకుండా వుంటాడు ?

మొగుడొక్కడే కాదు అత్తమామలు, చివరకు కన్న పిల్లలు కూడా అని చెప్పటం లేదూ !

ప్చ్ ! పోనివ్వండి ఇప్పుడేమనుకుంటే ఏంలాభం. వాళ్లింటి పిల్లైపోయింది. ఇప్పుడేం చేసినా అంతా వాళ్లిష్టం.

దారుణం తల్లిదండ్రులు కూడా యిలా మాట్లాడతా రేమిటి ? సరే, అదంత నయం కాని జబ్బేమీ కాదు. నేను ఆమె జబ్బు నయం చెయ్యగలను. డబ్బులు కూడా ఎంతోకావు. ఒకటి రెండు నెలలు నా ట్రీట్‌మెంట్‌లో వుంచేచాలు.

డబ్బులదేముంది లెండిగాని, వాళ్లపిల్లకు మేం ట్రీట్‌మెంట్ చేయిస్తే ఏం బావుంటుంది ? వాళ్లనడగండి. దాని భర్త నడగండి. అంతా వాళ్లిష్టం

*　　　*　　　*

గౌరి ట్రీట్‌మెంట్ విషయం ఆమె తల్లిదండ్రుల్నడిగితే, వాళ్లు మిమ్మల్ని సంప్రదించమన్నారు.

గౌరికి ట్రీట్‌మెంటా ? ఏం ట్రీట్‌మెంట్ ?

ఆమెను మామూలు మనిషిని చెయ్యటానికి.

మామూలు మనిషంటే, అందరూ ఒకే లాగుండరు. గౌరి మామూలుగా అలాగే వుంటుంది. పైగా అదేమన్నా యిప్పుడొచ్చిందా ? పుట్టినప్పటి నుండీ అలాగే వుందిట మా యింటి కొచ్చినప్పుడు అలాగే వుంది

ట్రీట్‌మెంట్ వల్ల ఆమె, విషయాలు త్వరగా గ్రహించ గలుగుతుంది. మనుషుల్ని బాగా అర్థం చేసుకోగలుగుతుంది. బాగా ఎక్స్‌ప్రెస్ చెయ్యగలుగుతుంది.

ఇప్పుడు దానికేం లోపమొచ్చిందనీ. ఒక్కో మనిషి తరహా అంతే. ఇంటి పనులన్నీ చేస్తుంది. వంట చేస్తుంది. నీళ్లు పడుతుంది. గేదెను కూడా అదే చూస్తుంది కుక్కలకు స్నానం చేయిస్తుంది. భర్తకూ, పిల్లలకూ సాయంగా వుంటుంది. ఇంత కన్నా యింకేం కావాలి ! మీ చికిత్సతో మాటకు మాట ఎదురు చెప్పటం నేర్చుకుంటారా ? పని ఎగ్గొట్టటం నేర్చుకుంటారా ? సాధించటం నేర్చుకుంటారా ?

అదేమిటండీ, మామూలు మనిషైతే ఆవిడకు స్వంత వ్యక్తిత్వం వస్తుంది. ఆత్మగౌరవం అంటే ఏమిటో తెలుస్తుంది. పెద్దా చిన్నా భేదం తెలుస్తుంది. గౌరవం—అవమానం అంటే ఏమిటో గ్రహించగలుగుతుంది

సరే, లే.

అదికాదండీ, పనులు చేసినంత మాత్రాన మామూలు మనిషై పోయిందా ? పెంపుడు జంతువులు మనుషులవుతాయా ? మనుషులకూ వాటికీ తేడా లేదూ ?

ఇదిగో డాక్టరూ ఇన్ని మాటలెందుకు ? అది వాడి పెళ్లాం. వాడిష్టం. మమ్మల్నేమడగొద్దు.

హల్లో రఘూ, హౌ ఆర్ యూ ?

హల్లో రండి. రండి. ఏమిటి విశేషం !

ఒక అద్భుతమైన మంచి వార్త చెప్పటానికి వచ్చాను.

చెప్పండి.

ఒక రెణ్ణెల్లు గౌరిని నా ట్రీట్‌మెంట్‌కు వదలిపెట్టు ఆ తరువాత చూస్కో ఎలా అవుతుందో !

గౌరికి ట్రీట్‌మెంటా ?

అవునయ్యా బాబూ, నీ సతీమణికే. ఐ విల్ మేక్ హర్ ఎ నార్మల్ పర్సన్.

కానీ ఆవిడకు జబ్బు లేందే ?

షి ఈజ్ మెంటల్లీ రిటార్డెడ్.

లేదండీ, అలా కనిపిస్తుంది కాని నిజానికి షి ఈజ్ ఆల్‌రైట్ చాలా అడ్జస్టింగ్ నేచర్. షి ఈజ్ వెరీ నైస్. ఇంటి పనులన్నీ చక్కగా ఓపిగ్గా చేసుకుంటుంది. అయామ్ పర్‌ఫెక్ట్‌లీ సాటిస్‌ఫైడ్ విత్ హర్.

రియల్లీ ?

యస్. ఐ డోంట్ వాంట్ ఎనీథింగ్ మోర్ ఫ్రం హర్.



# బాల శిల్పి

## డా॥ పురిపండా అప్పలస్వామి

"అందరికీ నాన్న ఉన్నారు
అమ్మా! నా నాన్నేడే?"

పన్నెండేళ్ళ బాల శిల్పి
ధర్మపదుడు తల్లి నడిగాడు

"అందరికీ నాన్నలున్నారు
నాకేమరి నాన్న లేడని
ఆటపిల్లలు అందరూ
చప్పట్లు కొట్టారే,
అమ్మా! నా నాన్నేడే?"

కళ్ళ నీళ్ళు పెట్టుకుంది
కౌగిలించుకుంది అమ్మ

"నీ నాన్నా వున్నాడమ్మా,
అందరికంటే గొప్పనాన్న.
పన్నెండొందల శిల్పుల పెద్ద
రాజ శిల్పి నీ నాన్న.
మనదేశం మారాజు
సూర్యుడి గుడి కట్టాలని
శిల్పులతో మీ నాన్నని
కోణార్కం పిలిచాడు
నువ్వు నా కడుపులో వున్నావప్పుడు.
పన్నెండేళ్ళు దాటుతోంది,
కోవిలపని పూర్తిచేసి
నాన్న ఇంటి కొస్తారు.
నువ్వు నేర్చిన విద్యచూసి
నిన్ను మెచ్చుకుంటారు
'నా వరాలమూటా' అని
ముద్దుపెట్టుకుంటారు."

తల్లిమాటవిని ధర్మపదుడు
ఎగిరి గెంతువేశాడు.

"నేనూ కోణార్కం వెళతాను
నాన్నని చూస్తానే అమ్మా!
నేనూ కోవిల కడతానే
నువ్వు నేర్పిన శిల్పంతో
నాన్నని మెప్పిస్తానే"
అంటూనే ఆక్షణమే
పయనమయాడు
బాలశిల్పి ధర్మపదుడు
బయలుదేరాడు.

ఆకలనకా దప్పికనకా
పగలూ రాతిరి అనకా
కళింగ సముద్రం వొడ్డున
కోణార్కం చేరాడు.

సూర్యుడిగుడి సుందర శిల్పం
మబ్బుల వొడిలో వుంది శిఖిలం.
గుడికాదది గొప్పరథం
పన్నెండు చక్రాలరథం
ఏడుగుర్రాల రథం,
పగ్గాలు సుడిలిస్తే చాలు
పరిగెట్టిపోతుంది రథం.

శివయ్య సొంతరా కొడుకు
పన్నెండేళ్ళ ధర్మపదుడు
ఆనందం పట్టలేక "అయ్యో!" అని
అరిచాడు.

ఆనవాలుచూపి నాన్న
కౌగిలిలో వాలాడు.

శివయ్య సొంతరా శిల్పుల పెద్ద
కొడుకుని గుండె కద్దుకున్నాడు.
సిరసు ముద్దుపెట్టుకున్నాడు —
అంతలోనె దిగాలుపడి
మొహం వేలవేశాడు.
సులివెచ్చని కంటి నీళ్ళు
జలజలమని రాల్చాడు.

ఏమిటని ధర్మపదుడు
కళ్ళలోకి చూశాడు.
"ఏమయింది నాన్నా?" అని
కళ్ళనీళ్ళు తుడిచాడు.

"ఏముందిరా కన్నతండ్రీ!
ఈ రాతిరి మా తుది రాతిరి
రేపు తూర్పు తెల్లవారితే
పన్నెండు వందల శిల్పుల
తలకాయలు తెగిపోతాయి.
పన్నెండేళ్ళు కట్టిన గుడి
కలశం పెడితే నిలవదు.
ఎక్కడుందా లోపంమరి
ఎంతయినా ఎరుకపడదు
మండిపడి మహారాజు
'ఈ రాతిరిలో కలశం
అమర్చకపోయారంటే
పన్నెండు వందల శిల్పుల
తలలూ నరికేస్తా'నని
శాసనం చాటించాడు.

ఏమైతేనేం బాబూ
కడసారిగ నిన్నుచూసి
కళ్ళు చల్లబడ్డాయి.
నా కంఠం తెగిపోనీ
నువ్వు చల్లగుంటే చాలు"

పొద్దుగూకింది.
సద్దుమణిగింది.
రాతిరి పడింది,
తీతిక కూసింది.
కళింగ సాగరం మీద
చందమామ లేచింది.
నల్లరాతి నీలిరథం
కలలోలా కనపడింది.

పన్నెండేళ్ళ బాలశిల్పి
గుడిమీదికి పాకాడు.
మబ్బులు తిరిగే దారిని
కలశం కడ చేరాడు.

అమ్మ నేర్పిన శిల్పవిద్య
నెమరు వేసుకున్నాడు.
లోపమేదో కనిపెట్టి
కలశం నిలబెట్టాడు.

తూర్పు మొగని వేగుచుక్క
దివ్వెలాగ వెలిగింది.
ఆకాశం రాకాసి నవ్వు నవ్వింది.
భళ్ళుమని తెల్లవారింది.

కోణార్కం పిట్టలన్ని
కలకలమని కూశాయి.
కోణార్కం రవికోవెల
నిటారుగా నిలబడింది.

కలశం చూశారు శిల్పులు
సిగ్గున తలవొంచారు.
గుండెల్లో కుతకుతమని
కుట్రపన్ని లేచారు.

"వేలెడంత గుంటడు
కలశం నిలబెట్టాడు !
మనం నిలపలేదంటే
మన ప్రాణం మరి దక్కదు.

అందుకని కుర్రకుంక
పీక నులిపి చంపేద్దాం.
మనమే కలశం పెట్టామని
మహరాజుకి మనవి చేద్దాం.

శివయ్యా, ఇటు వినవయ్యా,
పన్నెండొందల శిల్పులు కావాలా,
పన్నెండేళ్ళ బాలుడు కావాలా ?"
అంటూనే శివయ్యని
అందరూ చుట్టుముట్టారు.

గుడిమీంచే విన్నాడు
బాలశిల్పి ధర్మపదుడు
"విచారించకు నాన్నా
విచారించకు" అరిచాడు,
"కోవెల పూర్తయింది,
నీపేరే నిలబడింది.

పన్నెండేళ్ళ బాలుడికోసం
పన్నెండు వందలు చావకూడదు.
నేనే చచ్చిపోతాను.
అమ్మకి మాత్రం నిజం చెప్పు.

అమ్మచెప్పిన విద్య ఇది
నాన్నా, సెలవు, అయ్యలారా సెలవు"
పన్నెండేళ్ళ బాలశిల్పి
"నాన్నా, వస్తా" నంటూ
నేలకి దూకేశాడు
పన్నెండేళ్ళ పసిప్రాణం
సంఘం కోసం బలిపెట్టాడు !

కోణార్కం పెద్దకోవెల
కూలిపోయిం దిప్పుడు.
ధర్మపదుడిపేరు మాత్రం
చెరిగిపోదిక నెప్పుడు.

# అరకులో నీరెండ

## శ్రీ శశికాంత్ శాతకర్ణి

రాత్రంతా హేమంతపు చలితో
దగ్గరగా నొక్కిన స్ప్రింగులా ముడుచుకుపోయి
ఈ లోయల్లో కూరుకుపోయిన
చీకటి కడుపు చీల్చడానికి
ప్రాభాతారుణుడు గుండుసూదుల్లాంటి
కిరణాలు గుచ్చుతాడు !

ఉదయాన ఊదుకుంటూ తాగే
వేడి వేడి చాయ్ మీంచి పైకితేలే ఆవిరిలాగ
నొక్కివదిలిన స్ప్రింగులా
దూదిపింజల్లా చీలిపోయిన చీకటి
ఆకాశంలోకి లీనమైపోతుంది !

సంధ్యాసమయంలో
చనిపోయిన దృఢకాయుల శరీరాల్లా
పడివున్న కొండలమీది
మేఘాల నీడలు
వాటి ప్రక్కనే మెరిసే ఎండపొడలు
జీవన తత్త్వాన్ని సన్నగా ఆలపిస్తాయి !

లోకము నిద్దుర మునిగిన వేళల
హాసముతో ఉల్లాసముతో ఇటు
నా ముంగిటిలో లాస్య మొనర్చెడి
నీ వెవ్వరివో ?
తళతళ వెలుగుల వెన్నెల కన్నెవా ?
తూర్పున తోచిన ఉషో రేఖవో ?
నీ వెవ్వరివో ?

* * *

తళుకులీనెడి గగన తారలు
నా స్వరూపము చూపలేదో ?
పరుగులెత్తెడి పిల్లగాలులు
నా ప్రయాణము తెల్పలేదో ?
అమాయికుడా ! అంతరంగపు
కాంతినే దర్శింప లేవో ?

నా కన్నుల పున్నమి వెన్నెల
నా ఊర్పుల చల్లని తెమ్మెర
అలజడిపడు నా గుండెలలో
అణగారని ఆశాదీపిక.

వేద ఋషుల తపో వనమ్ముల
మారు మోగిన గీతి నేనే
బుద్ధదేవుని కంటి కొసలో
జాలువారిన కరుణ నేనే.

పచ్చ పైరుల పంట పొలముల
పల్లవించెడి సిరుల నేనే
గాలి తరగల తేలి వచ్చెడి
పల్లె పాటల సొగసు నేనే.

కల్ల కపటము లెచట లేవో
ఎచట ద్వేషము రగులు కొనదో
స్వార్థ మెచ్చట మోసు లెత్తదో
అచటనే వసియించెదన్.

ఎవని స్వాంతము సు ప్రశాంతమొ
ఎవని పలుకులు దయార్ద్రములో
ఎవని చేతలు జగద్ధితములొ
అతనినే వరియించెదన్.

రక్త దాహపు రాజ్య మోహము
విచ్చు కత్తులు విసరి నప్పుడు
కరడు గట్టిన మతోన్మాదము
విషపు నాల్కలు సాచినపుడు
దగ్ధమైనది నేను కాదో ?

ధన మదాంధుల పాద హతిలో
సర్వ శూన్యులు నలిగి నప్పుడు
దురాచారాపు ఉక్కు కౌగిట
మానవత కూలారి నప్పుడు
చితికినది నా గుండె కాదో ?

కనికరంబే కత్తిపై ఘన
విజయమున్ సాధింప వలయున్
మానవతయే మతముపై తన
ఏలుబడి సాగింప వలయున్.

ప్రాణి ప్రాణికి నడుమ లేచిన
అడ్డుగోడలు కూలిపోవలె
ఆ శుభోదయ కాలమునకై
ఆశతో జీవించెదన్.

కదన రాక్షసి ఇనుప గజ్జెల
ఘలంఘల వినిపించ నప్పుడు
పీడితుల కన్నీట తడిసిన
వసుంధర చల్లారి నప్పుడు
ఉక్కు పంజర మందు క్రుక్కిన
పిట్ట రెక్కలు విప్పినప్పుడు
కారు చీకటి కదల బారిన
కాము పున్నమి వేళలో
మందుటాకలి సెగలు సోకని
నవ్యజీవన యుగములో
తెల్ల రెక్కల పావురముపై
తేలి వచ్చెద హాయిగా —

నన్ను వీడని ధవళ కాంతుల
సకల జగములు జలక మాడగ
నా మహోగళ శాంత గీతుల
జనావళి పరవశము చెందగ
విరులు నిండిన విశ్వ వీధుల
వెలది వెన్నెల కన్నెనై —
అల్లనల్లన అడుగు అడుగున
పుడమి తల్లియె పులకరింపగ
లలిత లాస్య మొనర్చెదన్ ఈ
భువిని దివిగా మార్చెదన్.

# ఓ కవిత

ఈ కాగితాలు
సిరాతో నిండిపోయాయి
నా మనసులో
ఒక్క గీతకూడాలేదు.

ఆకాశాన్నంటుకోవాలనుకుంటున్న
సరుగుడు చెట్లను చూస్తే —
ఈగాలి కెందుకింత కోపమో ! ? !

శ్రీ ఖాసిం యూసుఫి

# నా గీతం

## శ్రీ కె. దినకర్

**1**

నా గీతం
అగణిత సంఖ్యాకులైన
నిర్భాగ్యుల నిస్సహాయ
హృదంతాల నినదించే
వేదనాశ్రు సంగీతం.

**2**

నా గీతం
అణువణువున పొంగిపొరలి
అనవరతం విప్లవ — వి
ద్యుద్ధారను సృజియించే
నవ కవితా జలపాతం.

**3**

నా గీతం
శ్రమజీవుల స్వేదంలో
జనియించిన సంపదలను
దోచుకునే స్వార్థపరుల
నిర్జించే పెనుఘాతం.

**4**

నా గీతం
సామ్యసంఘ స్వర్ణసౌధ
నిర్మాణం సాగించగ
ప్రతివ్యక్తిని కదలించే
ప్రగతి భావ సముపేతం.

**5**

నా గీతం
తమస్సులో ప్రభవించిన
అరుణారుణ కిర్మీరం.
సరస్సులో వికసించిన
నీలి నీలి కల్హారం.

# విజ్ఞాపనం

## శ్రీ కె. కిశోరుబాబు శ్రీ కె. అశోకుబాబు

ఓ దేవ దేవా !
కసాయి యెండ చికిలి కత్తుల ఝుళిపించి కరకరించినను,
పొగరుబోతువాన దుడుకు పిడుగుల కురిపించి
పటాపంచలొనరించినను
రౌడీగాలి 'దిసమొల' గావించి కూచిమారం ప్రదర్శించినను
మొండి చలి పుండయి పీడించి బెండుపరచినను
కలగుండు పడక
అయఃపిండం మాదిరి నిలిచి
వ్రేళ్ళు నిలదొక్కుకొని
జగతికి నీడ నొసంగు కాణయాచిగా రూపొందిన
''మాను హృదయం''
ప్రసాదించమని విజ్ఞాపనం !
ఉదరంభరిలా
దినదినం
స్వార్థం నిండిన సురాళింపు జీవితం కొనసాగించుట
నీచమని నిరంతర చింతనం!
క్షేమంకరున్నై
క్షణ క్షణం
మాకులా మనుగడ దిద్దుకొనుట మేలని భగీరథప్రయత్నం!
గరగరికలు చూపు గొంతెమ్మ కోరిక అనవసరం!
ఆరడి పుచ్చుకక్ష ఈ వరమొక్కటి యనుగ్రహించటమే
నాకు కుతుకబంటి సంతసం !

శ్రీ ఎ. కృష్ణారావు

# జాన్ లాక్ ప్రజాస్వామ్య సిద్ధాంతము

17వ శతాబ్దానికి చెందిన ప్రముఖ ఆంగ్ల రాజనీతి రచయితలలో జాన్‌లాక్[1] అగ్రగణ్యుడు. నిరంకుశ ప్రభుత్వంపై తిరుగుబాటు చేసి, ప్రజలు తమ ఇష్టానుసారం క్రొత్త ప్రభుత్వాన్ని ఏర్పాటు చేసుకోటాన్ని పూర్తిగా సమర్థించినాడు. లాక్‌లో రాజనీతి భావాలలో ప్రజాస్వామికయుగం ప్రారంభమవుతుందని చెప్పవచ్చు ఇతని భావాలను ఈ క్రింది విధంగ చర్చించవచ్చు :

1. ప్రభుత్వాధికారానికి ప్రజల సమ్మతి మూలము.

2. ప్రభుత్వానికి గల అధికారాలు పరిమితమైనవి.

3 పౌరులకుగల ప్రాథమిక హక్కులు కొన్ని రాజకీయ సమాజం ఏర్పాటవటానికి ముందే ఏర్పడినవి.

4. ప్రభుత్వ నిర్మాణంలో శాసన సభ, కార్యనిర్వాహకశాఖ, న్యాయశాఖ ప్రత్యేకంగా ఉండవలెనే కానీ ఒక వ్యక్తి లేదా సంస్థ వాటిని నిర్వహించరాదు.

5 రాజకీయ వ్యవహారాలలో అధిక సంఖ్యాకుల నిర్ణయాన్ని అనుసరించాలి

6. ప్రజల శ్రేయస్సుకు ప్రమాదకరంగా ప్రభుత్వం వ్యవహరించినప్పుడు దానిపై తిరుగుబాటుచేసి శాంతియుతంగా కాని లేదా విప్లవంద్వారా కాని-ప్రభుత్వాన్ని మార్చుకోటానికి ప్రజలకు హక్కు ఉన్నది.

## సాంఘిక ఒడంబడిక

లాక్ అభిప్రాయంలో ప్రజలు ఒక ఒడంబడికద్వారా రాజకియ సమాజాన్ని ఏర్పాటు చేసుకొంటారు.[2] ప్రాకృతిక వ్యవస్థలు (State of Nature) జీవించిన మానవులు సాంఘిక జీవితాన్ని గడిపినారు. వారు సుఖశాంతులతో జీవించేవారు. ప్రకృతి న్యాయం (Natural Law) వారిలో పరస్పర సహకారాన్ని రూపొందించింది. ఈ ప్రకృతిన్యాయం వారి నడవడిని నియతం చేస్తుంది. అంతేకాక నాగరిక సమాజం (Civil society) ఏర్పడిన తరవాత వారి జీవిత విధానాన్ని నిర్దేశిస్తుంది. పౌర ప్రభుత్వం లేదా రాజకీయాధికారం ఈ న్యాయాలకు చట్టరూపం ఇస్తుంది.

ప్రాకృతిక వ్యవస్థలో మానవులు కొన్ని హక్కులు కలిగి ఉన్నారని లాక్ అభిప్రాయము. వ్యక్తుల హక్కులను పరిమితం చేయటానికి ఎవరికీ అధికారంలేదు. వాటిలో ముఖ్యమైనవి ఆత్మరక్షణ, వ్యక్తిగత స్వేచ్ఛ, ఆస్తిహక్కు. హక్కులను అమలుపరుచుకోవటంలో ప్రతి వ్యక్తికీ సమానాధికారం ఉన్నది. సహజ న్యాయాన్ని ప్రతి వ్యక్తి అమలుపరచవచ్చు. ఈ సందర్భంలో లాక్ ఇలా చెబుతాడు :

''ప్రాచీన దశలో మానవునికి తన జీవితము, ఆస్తిని ఏ విధమైన నిర్బంధము లేకుండా వినియోగించుటకు స్వాతంత్ర్యం ఉన్న మాట వాస్తవమే. కాని అతనికి తనను కాని, తన అధికారంలోఉన్న ఇతరులను కాని వధించుటకు హక్కులేదు. కేవలం ప్రాణరక్షణ కంటే ఉదాత్తమైన సందర్భమేదైనా ఏర్పడినప్పుడు మాత్రం పై సూత్రం వర్తించేదికాదు. ప్రాకృతిక స్థితిలో ప్రతి మానవుడు ప్రాకృతిక న్యాయాలను అనుసరించేవాడు. వాటికి మూలము వివేకము (Reason) దానిని గుర్తించి అనుసరించేవారికి, దానిప్రకారం ప్రవర్తించేవారికి మానవులందరూ సమానులు, సర్వస్వతంత్రులు. కాబట్టి ఏ ఒక్కరు మరొక్కరి ప్రాణము, ఆరోగ్యము, స్వాతంత్ర్యము, ఆస్తి మొదలైన వాటికి హాని చేకూర్చరాదు.''[3]

ఇటువంటి శాంతియుతమైన సమాజంలో ప్రజలు తమ హక్కులు విధులను సరిగా అవగాహన చేసుకొని బాధ్యతాయుతంగా వ్యవహరిస్తున్నప్పుడు రాజకీయ సమాజాన్ని ఏర్పరుచుకొని, ప్రభుత్వానికి బద్ధులై వ్యవహరించవలసిన అవసరం ఎందుకు ఏర్పడింది?

పౌరసమాజం ఏర్పాటు చేసుకోటానికి కారణం లాక్ తన గ్రంథం రెండవ భాగంలో చెబుతాడు. ప్రాకృతిక వ్యవస్థ ఆదర్శప్రాయంగా ఉన్నా అందులో ఒక తీవ్రమైన లోపం ఉన్నది! ప్రతి వ్యక్తికీ ప్రాకృతిక న్యాయాన్ని నిర్ణయించి అమలు జరిపే హక్కు ఉన్నది. దానిని వ్యతిరేకించే వ్యక్తులను శిక్షించే అధికారం ఉన్నది. అయితే ప్రతి వ్యక్తి తాను తీసుకొనే చర్య మంచి చెడ్డలను తానే నిర్ణయించటం క్షేమంకాదు. ఎందుకంటే తాను ఒక తప్పుచేసి అది తప్పుకాదని సమర్థించుకోవచ్చు. దుష్టస్వభావము, ఉద్వేగము, పగ మానవుడిని ఇతరుల నడకను నిర్ణయించటంలో లేదా వారిని శిక్షించటంలో అమానుషంగా ప్రవర్తించేటట్లు చేయవచ్చు. అటువంటి వ్యవస్థలో అయోమయము, అరాజకము ప్రబలుతాయి. ప్రతివ్యక్తి తన ఇష్టానుసారం ప్రకృతి న్యాయాన్ని అర్థంచేసుకొని దానిని అనుసరించటానికి ప్రయత్నించినప్పుడు అది అరాజకానికి దారితీస్తుంది అందరూ సమబుద్ధితో ప్రవర్తించలేరు. అందువల్ల అటువంటి ప్రమాదంనుంచి బయట పడటానికి ప్రజలు ఒక ఒప్పందంద్వారా రాజకీయ సమాజాన్ని ఏర్పాటు చేసుకొంటారు.

ప్రజలు రాజకీయ సమాజాన్ని ఏర్పాటు చేసుకోటానికి రెండవ ముఖ్యమైన కారణం తమ సహజ హక్కులను కాపాడుకోవటానికే లాక్ రూపొందించిన ఒడంబడిక ద్వారా మానవులు తమ హక్కులన్నింటినీ వదలుకోరు. అలాగే వదలుకొన్నా అధికారం నిర్నిబంధంకాదు, చేవతుగా సార్వభౌమాధికారాన్ని **(supreme power)** వారు అంగీకరించరు. ప్రకృత న్యాయాన్ని నిర్ణయించి, దానిని అమలుజరిపే అధికారాన్ని మాత్రమే ప్రతివ్యక్తి సమాజానికిఇస్తాడు. మిగతా హక్కులను తనే ఉంచుకొంటాడు.

లాక్ ప్రతిపాదించిన సాంఘిక ఒడంబడికలో మరొక విశేషం ఉన్నది. అదేమిటంటే ఒడంబడిక ఏకగ్రీవంగా జరగాలి ప్రాకృతిక వ్యవస్థలోని మానవులంతా స్వేచ్ఛాజీవులు, స్వతంత్రులు కావటం వల్ల ఏ వొక్కరినీ వారి అనుమతి లేకుండా ఒడంబడికకు బద్ధులు కావలెనని నిర్బంధించరాదు. సమాజంలో చేరని వ్యక్తులు ప్రాకృతిక వ్యవస్థలో ఉండవచ్చు. లాక్ అభిప్రాయంలో రాజ్యము ప్రజల సమ్మతిపై ఏర్పడుతుంది.

ఒడంబడికద్వారా ఏర్పడిన పౌరసమాజం ప్రజల తరపున ప్రభుత్వాన్ని ఏర్పాటు చేస్తుంది. ఈ ప్రభుత్వం సమాజ నియంత్రణకు, అజమాయిషీకీ లోబడి పనిచేస్తుంది. రాజ్యము , ప్రభుత్వము వేరు వేరు వ్యవస్థలని గుర్తించిన ఆధునిక రాజనీతి తత్త్వవేత్తలలో లాక్ మొదటివాడు.

## సమాజము - ప్రభుత్వము

లాక్ 1688లో జరిగిన విప్లవాన్ని దృష్టిలో పెట్టుకొని ప్రభుత్వ కార్యకలాపాలలో శాసన నిర్మాణం అత్యున్నతమైనదని భావించాడు [4] కార్యనిర్వాహకవర్గంకంటే శాసన నిర్మాణంలో భాగం పంచుకొన్న శాసన సభ అధికారం అత్యున్నతమైనది. అయితే ఈ రెండూ పరిమితమైనవే ప్రజల ఆస్తులను, ఆసక్తులను కాపాడటానికి శాసనసభ కార్యనిర్వాహకవర్గం కృషిచేయాలి.

లాక్ అభిప్రాయంలో ప్రభుత్వం ఒక ధర్మనిధి **(Trust)** వంటిది. ప్రజాశ్రేయస్సును పెంపొందించటానికి ఇది ఏర్పడింది. ప్రజల హక్కులను కాపాడటానికి ప్రభుత్వం ముఖ్యంగా మూడు విధులను నిర్వహించాలి. అవి ప్రభుత్వ కార్యకలాపాలను పరిమితం చేస్తాయి. ప్రభుత్వ విధులలో మొదటిది, ప్రకృతి న్యాయాన్ని వివరించటం; ప్రజలకు అది వర్తింపచేయటం, ప్రజలలో ఏర్పడే తగాదాలను పరిష్కరించటం ప్రభుత్వాధికారాలు పరిమితమైనవి. ప్రజాకంటక ప్రభుత్వాన్ని రద్దుచేసి మరొక ప్రభుత్వ స్థాపనకు ప్రజలకు అధికారం ఉన్నదని చెప్పిన మొదటి తత్త్వవేత్త జాన్‌లాక్. అయితే ప్రజలను పూర్తిగా ప్రభుత్వాన్ని శాసించే విధంగా అతడు రూపొందించలేదు. ప్రజలు తమ ఇష్టం వచ్చినప్పుడల్లా ఏదో ఒక కారణంపై ప్రభుత్వాన్ని మార్చలేరు; రద్దు చేయలేరు. ప్రభుత్వం తన విధులను సక్రమంగా నిర్వహించినంతకాలం సమాజానికి దానిని రద్దుచేసే అధికారంలేదు. విధుల నిర్వహణలో విఫలమైనప్పుడే దానిని రద్దుచేసే హక్కు, అధికారం ప్రజలకు ఉంటుంది. అయితే ఇది ఎప్పుడు ఏవిధంగా, ఎవరు ఉపయోగించాలో లాక్ సరిగ్గా వివరించలేదు.

## సహజ హక్కులు

లాక్ అభిప్రాయంలో మానవుడికి కొన్ని ప్రాథమిక, మౌలిక హక్కులు ఉన్నాయి. ఇవి రాజకీయ సమాజంకంటే ముందే ఏర్పడినాయి. వీటిని పరిరక్షించుకోటానికే మానవులు ఒడంబడికద్వారా రాజ్యాన్ని, ప్రభుత్వాన్ని ఏర్పాటు చేసుకొంటారు. ఆత్మరక్షణ, వ్యక్తిగతస్వేచ్ఛ, ఆస్తి సంపాదన లాక్ మానవుని సహజ హక్కులుగా[5] భావిస్తాడు.

మానవునికి గల సహజ హక్కులను లాక్ ఈ విధంగా సమర్థిస్తాడుట. ''వివేకంతో ఆలోచిస్తే భూలోకంలో పుట్టిన మానవులందరికి తమ ప్రాణాన్ని కాపాడుకోటానికి అధికారం ఉంది ఆ కారణంవల్ల ప్రాణ పోషణకై ప్రకృతి కల్పించిన ఆహార పానీయాదులన్నీ మానవులకు చెందుతాయి. ఇటువంటి సహజ హక్కులను పరిమితం చేయటానికి రాజకీయ సమాజం ప్రయత్నించరాదు. కాగా ఇవి ప్రభుత్వాధికారాల వినియోగంపై పరిమితులను విధిస్తాయి. అవి సమాజ, ప్రభుత్వ నియంత్రణలకు అతీతమైనవి. వాటిని కాపాడటానికే రాజకీయ సమాజం అవతరించింది.''[6]

ముఖ్యంగా లాక్ ఆస్తి హక్కును తీవ్రంగా సమర్థించాడు. ప్రాకృతిక వ్యవస్థలో ''భూసంపద, పశుపక్ష్యాదులు, మానవులందరికీ సమానమే కాని ఏ మానవుని శ్రమ అతని ప్రత్యేకమైన ఆస్తి. తద్వారా సంపాదించిన సంపదపై అతనికి తప్ప మరొకనికి హక్కులేదు'' లాక్ అభిప్రాయంలో 'శ్రమ'మానవునికి ఆస్తిని కల్పిస్తుంది. శ్రమ ద్వారా ఉత్పత్తి చేసిన వస్తు సామగ్రి అంతా అతనికే చెందుతుంది. అది అతని వ్యక్తిగతమైన ఆస్తి. వ్యక్తిగత ఆస్తిని పరిమితం చేయటానికి భంగం కలిగించటానికి సమాజానికి కాని, ప్రభుత్వానికి గాని, అధిక సంఖ్యాకులకు గాని ఎటువంటి అధికారం లేదు.

స్వంత ఆస్తిని సమర్థించిన వారిలో జాన్‌లాక్ ప్రథముడు. ఆస్తి లేనిదే స్వేచ్ఛలేదని లాక్ వాదము. ఈనాడు కొన్ని రాజకీయ పార్టీలు ఆస్తి హక్కును ప్రాథమిక హక్కుల నుంచి తొలగించాలని వాదిస్తున్నాయి. ఆస్తిలేని స్వేచ్ఛ హాస్యాస్పదము. అయితే అశేష ప్రజానీకం పేదరికపు దిగువ పరిమితి కన్నా కింద **(Below the Poverty line)** జీవిస్తున్న మన దేశంలో ఇటువంటి వాదం విపరీతంగా, విడ్డూరంగా కనిపించవచ్చు. కాని ఆస్తి హక్కు ఒక్కటే సంపదను సృష్టించదు. దానికి తగిన శ్రమ, సామర్థ్యము, దృఢ నిశ్చయము అవసరము.

## ముగింపు

పరిస్థితుల ప్రభావం లాక్‌ను 1688 విప్లవాన్ని సమర్థించే టట్లు చేసినప్పటికీ ఇతడు ఏ విధంగానూ తీవ్రవాది కాడు. మానసికంగా నూ, మేధావిత్వంలోనూ సిద్ధాంతాలపట్ల తక్కువ ఆసక్తిని చూపిన వారిలో లాక్ ఒకడు. ఇతని రాజకీయ భావాలు చాలావరకూ ఆనాటి ఇంగ్లండ్ రాజకీయ సాంఘిక పరిస్థితులకు అనుగుణంగా ఉన్నప్పటికీ, వాటిలోని విశేషమేమిటంటే రాజకీయ సమస్యలను పరిష్కరించటానికి కేవలం పాక్షిక దృష్టితో వ్రాయబడిన కర పత్రాల స్థాయికి దిగజారకుండా సార్వజనీన ఆసక్తిని కలిగించే ఆసక్తికరమైన రాజకీయపు విలువలను అవి సృష్టించినాయి.[7]

## అధోజ్ఞాపికలు

1 జాన్‌లాక్ (1632-1704) ఇంగ్లండ్ దేశపు చరిత్రలో విప్లవ యుగమని ప్రఖ్యాతి వహించిన 17వ శతాబ్దంలో పుట్టి పెరిగినాడు. ఇరవై సంవత్సరాల వయస్సులో ఆక్స్ ఫర్డ్ విశ్వ విద్యాలయంలో ప్రవేశించి ఉన్నత విద్యాభ్యాసం చేశాడు. ఇతని రచనలలో ప్రముఖమైనవి 1) Two Treatises on Government; 2) Essay concerning Human understanding.

2 హాబ్స్, లాక్, రూసో మొదలైన రాజనీతి తత్త్వవేత్తలు మానవ సమాజాన్ని రెండు దశలుగా విభజించినారు. రాజ్య వ్యవస్థ ఏర్పడటానికిముందు మానవ సమాజాన్ని ప్రాకృతిక దశ (State of nature) అని, రాజ్య మేర్పడిన తరవాత, రాజకీయ సమాజమని వారు వివరించినారు.

3 జాన్‌లాక్ : పౌర ప్రభుత్వము, తెలుగు అనువాదం శ్రీ ఖండవల్లి బాలెందు శేఖరం, పి 4. శ్రీ సరస్వతీ బుక్ డిపో, చార్‌కమాన్, హైదరాబాదు–500 002.

4 1688లో ఇంగ్లండ్‌లో రక్తపాత విప్లవం (Bloodless revolution) సంభవించెను. ఆనాటి రాజైన రెండవ జేమ్స్ నిరంకుశుడగుటయేకాక, ప్రజల మత వ్యవహారాలలో జోక్యం చేసుకొని అధిక సంఖ్యాకుల ఆగ్రహాన్ని చూర గొన్నాడు. దానికి వ్యతిరేకంగా జేమ్స్‌ను ఎదిరించి, అతనిని ఇంగ్లండ్ నుంచి తరిమివేసి హాలండ్ దేశ రాణి అయిన మేరీని, ఆమె భర్త విలియమ్‌ను ఇంగ్లండ్ సింహాసనాన్ని అలంకరించమని పార్లమెంట్ నాయకులు ఆహ్వానించిరి. అప్పటి నుంచి రాజులను సింహాసనము నుంచి తొలగించుటకు, క్రొత్తవారిని రాజ్యాధిపతులుగా నియమించుటకు, ప్రజలెన్నుకొన్న పార్లమెంట్‌కు అధికారం ఉన్నదన్న సంప్రదాయం (Convention) ఏర్పడింది.

5 సహజ హక్కులపై పూర్తి ఏర్పుకు ప్రస్తుత వ్యాసకర్త రచించిన "జాన్‌లాక్ - సహజ హక్కుల సిద్ధాంతము" – తెలుగులో (త్రైమాసపత్రిక) జూలై - సెప్టెంబర్ 1977 చదవండి.

6 "Such claims can never be justly set aside, since society itself exists to protect them; they can be regulated only to the extent that is necessary to give them effective protection In other words, the 'life, liberty and state' of one person can be limited only to make effective the equally valid claim of another person to the same right" – G. Sabine, A History of Political Theory, p. 528.

7 "Every piece of significant political writing is a fragment of the biography of its age. Yet, it becomes great only, if, in addition to its vital connection with the period from which it emanates, it possesses universal appeal because of its general human interest. A Political treatise that is wholly submerged in the issues of its own age can never rise above the level of a Partisan pamphlet. On the other hand, a political work that is isolated from its own age is bound to be abstract. The Two Treatises would not have been written by a man without practical experience and interest of John Locke" – Maxcy – "Political Philosophies" – p. 249.



శ్రీ కశింకోట ప్రభాకరదేవ్

# అభిజాత్యం

వారంరోజులనుండి 'పాప' కనిపించకపోయేసరికి డాక్టర్ శైలజకు తానేదో కోల్పోతున్నట్లుగా బాధ కలిగింది.

రకరకాల రోగులమధ్య అలసిపోయి యింటికి వచ్చే శైలజకు 'పాప' చిరునవ్వు గొప్ప రిలీఫ్. 'పాప', శైలజ చిన్ననాటి స్నేహితురాలైన లలిత కూతురు. ఆరు సంవత్సరాలుంటాయి. తెల్లగా, బొద్దుగా ముద్దు వచ్చేలాగ వుంటుంది.

'పాప' అంటే శైలజకు ప్రాణం. శైలజ యింట్లో వున్నంతసేపూ యించు మించుగా ఆమెతోనే వుంటుంటుంది పాప. శైలజ దగ్గర పాప బాగా చేరిక అయింది. రాత్రిపూట కూడా వొక్కొక్కసారి తల్లి దగ్గరకు వెళ్ళకుండా శైలజ దగ్గరే వుంటానని మారాంచేసి వుండిపోతుంటుంది. అటువంటి 'పాప' వారం రోజుల నుండి తన యింటి ఛాయలకైనా రాకపోయేసరికి శైలజ మనసు పరిపరివిధాల పోయింది. ఒకసారి స్నేహితురాలి యింటికి వెళ్ళి 'పాప' రాకపోవడానికి గల కారణం ఏమిటో తెలుసుకోవాలని పించింది. కాని, పనుల వొత్తిడి వలన వెళ్ళడానికి వీలు చిక్కింది కాదు.

ఆ దినం ఆదివారం.

'పాప' కనిపించి అప్పటికి పది రోజులు అయింది. ఆ దినం లలిత ఇంటికి ఎలాగైనా వెళ్ళి 'పాప'ను చూసిరావాలని నిశ్చయించుకుంది.

పది గంటలకల్లా గృహకృత్యాలను ముగించి లలిత యింటికి బయలుదేరింది.

అయితే, అప్పటికే సమయం మించిపోయింది.

శైలజ వెళ్ళేసరికి లలిత యింటి గుమ్మం ముందు 'పాప' నిర్జీవంగా వుంది.

ఇరుగు పొరుగు గుమిగూడి వున్నారు.

లలిత గుండె బాదుకొంటూ ఏడుస్తోంది.

శైలజ నిలువునా వణికిపోయింది. గుండె లోతుల్నుండి దుఃఖం ఎగదన్నుకు వచ్చింది.

అక్కడ గుమిగూడివున్న యిరుగు పొరుగువాళ్ళు 'పాప' చిన్నారి చేష్టల్ని గురించి చెప్పుకుంటూ, కంటతడితో విలవిల్లాడి పోతున్నారు.

వికలమైన మనసుతో శైలజ వెనుతిరిగింది.

*　　　*　　　*

మర్నాడు, లలితను పరామర్శించడానికని వెళ్ళింది శైలజ.

శైలజను చూడగానే లలిత బావురుమంది.

దుఃఖం కన్నీరై ప్రవహించిన తరువాత —

"పాప యింత హఠాత్తుగా ... చనిపోవడానికి కారణం ఏమిటి? ఏమన్నా జబ్బా??" అని బరువెక్కిన హృదయంతో, బొంగురుపోతున్న కంఠంతో శైలజ అడిగింది.

తలూపింది లలిత.

"టైఫాయిడ్..." అంది.

"మరి ... ఆ సంగతి నాకు చెప్పలేదేం? కబురు పెట్టవచ్చుగా." నిష్ఠూరం ధ్వనించింది స్వరంలో.

శైలజ అడిగినదానికి జవాబుగా లలిత తల వాలిపోయింది. మనసులో బడబాగ్ని చెలరేగింది.

"నేనంత పరాయిదాన్నయిపోయానా?" లలిత మౌనానికి మరింత బాధ చెందుతూ ప్రశ్నించింది శైలజ. ఆ ప్రశ్నకు తలెత్తి తడిదేరిన కళ్ళతో చూసింది లలిత.

"లేదు శైలూ! నువ్వు ... నువ్వు ... పాపకు పరాయిదానివి ఎలాగ అవుతావు? నేను కన్నానేగాని పాప నీదగ్గరే పెరిగింది..." అంది.

"మరి ... కబురెందుకు చెయ్యలేదు?" ప్రశ్నను పునరావృతం గావించింది—జవాబు కోసం ఆరాటం చెందుతూ.

లలిత కొద్ది క్షణాలు మౌనం వహించింది.

ఆ తరువాత నెమ్మదిగా ... సంకోచపు తెర్లను తొలగించుకుంటూ ...

"ఆ రోజు నువ్వు ... పాప గొలుసును విడిపించమని రెండు వందలు యిచ్చావు. గుర్తుందా?" మెల్లగా ప్రశ్నించింది.

శైలజ తలూపింది. గతం గుర్తుకు వచ్చింది.

పదిరోజుల క్రితం, పాప మెడబోసిగా వుండడం చూసి—

"పాపా! నీ గొలుసేది?" అని ప్రశ్నించింది తను.

"అమ్మ తీసేసింది ఆంటీ!" అంది పాప. ఆ సమయంలో లలిత అక్కడే వుంది.

"లలితా! పాప గొలుసును ఎందుకు తీశావు? గొలుసు లేకపోతే పాప మెడ బోసిగా వుంది" అంది తను.

తన మాటలకు లలిత —

"డబ్బు అవసరంవలన పాప గొలుసును తాకట్టు పెట్టవల్సి వచ్చింది" అని జవాబు చెప్పింది.

లలిత జవాబుకు తన మనసు చివుక్కుమంది.

"డబ్బు అవసరమైతే నన్ను అడగకలేకపోయావా? పాప గొలుసు తాకట్టు పెట్టడం బాగులేదు. ఇంతకీ గొలుసు ఎంతకు తాకట్టు పెట్టావు?"

"రెండు వందలు."

"సరే ఆ డబ్బు నేను యిస్తాను. తీసుకువెళ్ళి పాప గొలుసును వెంటనే విడిపించు" అని రెండు వందలు యిచ్చింది.

గతంను గుర్తుకు తెచ్చుకుంటూ, లలిత ముఖంలోకి ప్రశ్నార్థకంగా చూసింది శైలజ.

ఆమె మనసులో రకరకాల ఆలోచనలు ... అనుమానాలు చెలరేగాయి.

"రెండు వందలకీ...నువ్వు నాకు కబురు చెయ్యకపోవడానికి సంబంధం ఏమిటి లలితా?" అడిగింది శైలజ.

లలిత దోషిలాగ తలవాల్చుకుంది.

"ఉంది శైలూ! ఆ రోజు నువ్విచ్చిన రెండు వందలతో పాప గొలుసు విడిపించలేకపోయాను. చుట్టాలు రావడంతో ఆ డబ్బు ఖర్చయిపోయింది. ఇంతలో, పాపకు టైఫాయిడ్. నీకు కబురు చేద్దామంటే...పాప గొలుసును విడిపించావా అని అడుగుతావని ... భయంతో ... సిగ్గుతో ... వూరుకున్నాను." అంటూ వెక్కి వెక్కి ఏడవసాగింది లలిత.

శైలజ భారంగా నిట్టూర్చింది

శ్రీ రాపిరంగారావు

# వచన పద్యంలో పదగణాలు

సంప్రదాయ విధానంలో సమానమైన అక్షరాల వలనగాని, సమానమైన గణాలవలన కాని, సమానమైన మాత్రలవలన గాని పద్యపాదాలలో లయ సిద్ధిస్తుంది. ఉత్పలమాలలో ప్రతి పాదానికి ఇరవై అక్షరాలుంటాయని, తేటగీతిలో ఒక్కో సూర్య గణం, రెండేసి ఇంద్రగణాలు, రెండేసి సూర్యగణాలు క్రమంగా వస్తాయని, కందపద్యంలో ఒకటో పాదంలోను మూడో పాదం, లోను సమాన మాత్రలుంటాయని, అలాగే రెండో పాదం, నాలుగో పాదంలోను సమాన మాత్రలుంటాయని పండితులకు తెలిసిన విషయాలే. ఇలానే వచన పద్యంలో సమానమైన పదగణాల ద్వారా లయ సిద్ధిస్తుందని నేను ప్రతిపాదిస్తున్నాను ఆను షంగికంగా యతులు, ప్రాసలు, అంత్యప్రాసలు కూడా వచన పద్యానికి ఈ ప్రయోజనాన్ని కల్గించే అవకాశమూ వుంది. పద్యాన్ని నాలుగు పాదాలకంటె ఎక్కువగా వ్రాయకూడదని మన పూర్వ కవులుకూడ భావించలేదు. అలాంటప్పుడు—వచన పద్యానికి పాదాలు ఖచ్చితంగా ఇన్నే వుండాలని నిర్ణయించగూడదు. వచన పద్యపాదాలు సంఖ్యలో గట్టిగా నియతం గాకున్నా కొన్ని విషయాలలో సామాన్య లక్షణాలు సంతరించుకొని వుంటాయని భావిస్తున్నాను వీటిని జాగ్రత్తగా ఉదాహరణ పూర్వకంగా పరిశీలిస్తూ సాధ్యమైనంత వరకు నాకు తోచిన వచన పద్య లక్షణచర్చ చేయటానికి ప్రయత్నిస్తాను.

పదగణాలంటే ఏమిటో చెప్పబోయేముందు -- ఈ లక్షణ చర్చకు సంబంధించిన 'పద'మంటే ఏమిటో ముందుగా తెలియ జేస్తాను. దుష్టుడు, మానవుడు—ఇది ఒక్కొటి ఒక్కోపదం. చిన్నయసూరి చెప్పినట్లు 'సమర్థంబులైన పదంబు లేక పదం బగుట సమాసంబు' అనటంవల్ల 'దుష్టమానవుడు'వంటి సమాసం చేస్తే అది ఏకపదం కాటానికి అవకాశం వుంది. కాని నేను ఇలాంటి తత్సమ సమాస సందర్భాలలో ఈ 'దుష్టమానవుడు' వంటి వాటిని రెండు పదాలుగా గ్రహిస్తాను. ''దుష్ట'' అనేది ''మానవుడు'' అనేది రెండుగా గ్రహించి ఇందులో రెండు ''పద గణాలు'' ఉన్నాయని భావిస్తాను. కొన్ని పాదాలలో వచ్చే దీర్ఘ సమాసాల్ని అనేక పదగణాలుగా విభజించుకోవడంకోసం .. నేనిలా భావిస్తున్నాను.

కొన్ని తెలుగు వచన పద్యాలను ఈ దృష్టితో పరిశీలించి చూస్తాను. వచన పద్యానికి భావగణాలు ప్రతిపాదించిన శ్రీ సంపత్కుమార తీసుకున్న కొన్ని ఉదాహరణలను ముందుగా నేను స్వీకరించి పరిశీలిస్తాను.

''ప్రతిమాటకీ శక్తిఉంది; పదునుఉంది
ప్రతిమాటకీ అర్థంఉంది; ఔచిత్యంఉంది''

—తిలక్—''నవత–కవిత''

ఈ పాదాలను నా పదగణాలరీత్యా ఇలా విభజించి వ్రాస్తాను.

''ప్రతి మాటకీ శక్తి ఉంది పదును ఉంది
ప్రతి మాటకీ అర్థం ఉంది ఔచిత్యం ఉంది''

మొదటి పాదంలోను, రెండవ పాదంలోను సమానంగా— ఆరేసి పదగణాలున్నాయి. ఇలా రెండు పాదాలకు అంతర్నిర్మాణం సమానంగా వుందన్నమాట. ఆనుషంగికంగా అంత్యప్రాస కూడా వుంది.

''నీకు కలంవుంది, ప్రజలకు బలంవుంది
నీకు హృదయంవుంది, ప్రజలకు ఉదయంవుంది''

—'ఆశ'లో కుందుర్తి

ఈ పాదాలను పై రీతిగనే విభజింపవచ్చు. కాని పాద నిర్మాణంలో ఒక నూతన లక్షణం వుంది. ఇంతకుముందుదాహరించిన పాదాల్లో ప్రతి పాదాన్ని రెండు సమభాగాలుగా అర్థస్ఫూర్తి రీత్యా విభజించలేము. కాని ఈ పాదాల్లోని ప్రతి పాదాన్ని రెండు సమ భాగాలుగా విభజించవచ్చు. మరోరకంగా చెప్పాలంటే ఇది నాలుగు పాదాల వచన పద్యం.

''నీకు కలం వుంది
ప్రజలకు బలం వుంది
నీకు హృదయం వుంది
ప్రజలకు ఉగయం వుంది''

ప్రతి పాదంలోను మూడేసి పదగణాలున్నాయి. అటు తర్వాత అంత్యప్రాస కూడా ఈ భావానికే దోహదం చేస్తున్నది.

''దూకండి సముద్రంలోకి
ప్రాకండి కీర్తిలోకాలలోకి

బ్రతుకును గుప్పిట్లోబంధించకండి
భయంమీద ఆగ్నేయాస్త్రంసంధించండి''

దీన్ని ఇలా విభజించి చూపిస్తాను.

''దూకండి సముద్రంలోకి
ప్రాకండి కీర్తి లోకాలలోకి

బ్రతుకును గుప్పిట్లో బంధించండి
భయంమీద ఆగ్నేయాస్త్రం సంధించండి''

ఇక్కడ మొదటి రెండు పాదాలు ఒక విభాగంగా, తరువాతి రెండు పాదాలు మరో విభాగంగా భావించవచ్చు. ఇక్కడ ఒక్కో విభాగంలోని పాదాలకు అంత్యప్రాస వుంది. ఒకటో విభాగంలోని మొదటి పాదంకన్నా రెండవ పాదంలో ఒక పదగణం ఎక్కువగా వుంది. అలాగే రెండో విభాగంలోని మొదటి పాదంకన్నా రెండో పాదంలో ఒక పదగణం ఎక్కువగా వుంది. ఇలా రెండు విభాగాలకు ఒక సమానత్వం స్థాపింపబడటంవల్ల పాదాలకు లయ బాగా సిద్ధిస్తుందన్నమాట. ఇలా వచన పద్య భిన్నత్వంలో ఏకత్వం సాధించటానికి "వచన కవి తన కవితారూపాన్ని తనే సృష్టించుకోవాలి...ఎప్పటికప్పుడు కొత్తరూపాలు సృష్టించుకొంటున్నప్పుడు ఆ రూపాల సంఖ్యకు పరిమితిలేదు. కవి సృజనశక్తినిబట్టి కవితా రూపం వుంటుంది–'' (శ్రీ చేకూరి రామారావుగారి వాక్యాలు). ఒక్కో విభాగంలోని ద్వితీయ పాదాల్లో ఒక్కో గణం పెంచటమనే సమానమైన మార్పు ఉన్నత భావాన్ని ఒక ఆవేగంతో, ఆవేశంతో ప్రజలకు అందించటంకోసంగా మనం భావింపవచ్చు.

''వివ్వచ్చునిబాణంలా విచారందూసుకుపోయిన గుండెతో
దిగులుతో, దైన్యంతో, బరువుతో, బాధతో
బ్రతుకు బజార్లోనిలబడింది''

—కుందుర్తి, ''కాలం ఆగిపోయింది''

దీన్ని యిలా విభజించి వ్రాస్తాను.

''వివ్వచ్చుని బాణంలా విచారం దూసుకు పోయిన గుండెతో
దిగులుతో దైన్యంతో బరువుతో బాధతో
బ్రతుకు బజార్లో నిలబడింది''

ఈ పాదాల్లో క్రమంగా ఒక్కోపాదం గడిచేసరికి పదగణాలు తగ్గుతూ రావటమనే ఏకత్వం కవి ఆశించిన దైన్య భావస్ఫూర్తి కోసమే. భావానుగుణంగా పాదాల్లోని పదగణాల సంఖ్య తగ్గుతూ పోవచ్చును, లేదా పెరుగుతూ పోవచ్చునని గ్రహింపవచ్చు. ఈపాదాల్ని మరోవిధంగా కూడా—అంటే నాలుగు పాదాలుగా వ్రాసి పద గణవిభజన చేసి సమాన లక్షణాలున్నాయేమోనని పరిశీలిస్తాను.

''వివ్వచ్చుని బాణంలా
విచారం దూసుకు పోయిన గుండెతో
దిగులుతో దైన్యంతో బరువుతో బాధతో
బ్రతుకు, బజార్లో నిలబడింది

ఒకటి, నాలుగు పాదాల్లో రెండేసి పదగణాలు, రెండు, మూడు పాదాల్లో నాలుగేసి పదగణాలున్నాయనుకోవచ్చు. ఈ పాదాలలోని భావం అంతటికీ ప్రధానమైనది, ఒకరకంగా కర్తలాంటిది ''బ్రతుకు.'' ఇది నాలుగో పాదంలో పెట్టి గుర్తులోవున్న అదనపు పదగణంగా భావస్ఫూర్తికోసం ఉన్నదన్నమాట. కొన్ని పాదాల్లో భావ ప్రకటనకోసం పదగణాలు ఎక్కువ గాని, తక్కువ గాని ఉంటాయి. కాని ఇలాంటి సందర్భాలు అరుదుగా వుంటాయి (ఈ విషయాన్ని ముందు ముందు మరింత విశదీకరిస్తాను)—గణాలరీత్యా ఈ నాలుగు పాదాలను పరిశీలిస్తే – ఒకటోపాదం నాలుగోపాదంతోను, రెండోపాదం మూడోపాదంతోను సమానమన్నమాట. మొదటి పెద్ద పాదాన్ని రెండు పాదాలుగా విభజించటానికి ఆ రెంటి పాదాద్యక్షరాలు (వి–వి) ఒక్కటే కావటం (అక్షర మైత్రి) కూడా ఒక కారణంగా చెప్పవచ్చు. ఇలా. మార్చి వ్రాసిన పాదాలను అందులోని లయను స్పష్టంగా నిరూపించటంకోసం మరోరకంగా కూడా వ్రాసి చూపవచ్చు.

బ్రతుకు—
బజార్లో నిలబడింది
దిగులుతో దైన్యంతో బరువుతో బాధతో
వివ్వచ్చుని బాణంలా
విచారం దూసుకు పోయిన గుండెతో

ఇందులోని మొదటి పాదంలోని ఒకేఒక పదగణం భావస్ఫూర్తికోసం వచ్చింది. తరువాత వచ్చిన రెండు, మూడు, నాలుగైదు పాదాలు ఒక యూనిట్. 2, 3 పాదాలొక సబ్‌యూనిట్‌గా, నాలుగైదు పాదాలు మరో సబ్‌యూనిట్‌గను మనం స్వీకరించవచ్చు. ఈ సబ్ యూనిట్లకు అంత్యప్రాసకూడా వుంది. ఒక్కో సబ్ యూనిట్‌లో సమానంగా ఆరేసి పదగణాలున్నాయి. విడివిడిగా చూస్తే—రెండోపాదం నాల్గో పాదానికి, మూడోపాదం అయిదో పాదానికి సమానమవుతాయి. వచన పద్య నిర్మాణంలో కవులెంతో వైవిధ్యాన్ని ప్రదర్శింపవచ్చునని, ఎంతటి వైవిధ్యంలోనైనా కొన్ని సామాన్య లక్షణాలుండక పోవని నా భావన. వచన పద్యంలోని లయను గూర్చి దాని వైవిధ్యాన్ని గూర్చి స్పష్టంగా చెప్పటంకోసం ఇలా పై వచన పద్య పాదాలను భిన్నరీతుల్లో వ్రాసి చూపడం జరిగింది. ఇంతవరకు నేను స్వీకరించిన ఉదాహరణలు ''వచనపద్యం–లక్షణచర్చ'' అనే పుస్తకంలో శ్రీ సంపత్కుమార గ్రహించిన వాటిల్లో కొన్ని మాత్రమే. సంపత్కుమారగారు స్వీకరించిన ఉదాహరణలను నేనూ తీసుకోవటానికి కారణం వారి కృషిమీద నాకున్న గౌరవ భావమే.

ఫిబ్రవరి 'భారతి'లో శ్రీ చేకూరి రామారావు స్వీకరించిన **Martyr**[2] అనే కవితనుకూడా విభజించి చూపిస్తాను.

The white Man killed my father,
My father was proud
The white Man seduced my mother
My mother was beautiful
The white Man burnt my brother
beneath the noon day sun,
My brother was strong
His hands red with black blood

The white Man turned to me
And in the conquerer's voice said
Boy! a chair a napkin a drink.
— DAVID DIOP

ఇందులోని 1, 3, 5 పాదాల్లో ఆరేసి పదగణాలున్నాయి. ఇవి పరస్పరం (ఒకదానికొకటి) సమానం. అలాగే 2, 4, 6 పాదాల్లో నాలుగేసి పదగణాలున్నాయి. ఇలా ఇవి పరస్పరం సమానమౌతున్నాయి. 1, 3, 5 పాదాల్లోగల ఆరు పదగణాల నిర్మాణమే 7,8,9,10 పాదాల్లోకూడా తిరిగి తీసుకోబడింది. ఇక్కడ వరుసగా నాలుగు పాదాలు ఒకదాని కొకటి సమానం. పెట్టెలో పెట్టినట్లు సూచించబడ్డ అయిదవ పాదంలోని beneath the noon day sun అనేది విశేషభావస్ఫూర్తికోసం వచ్చిన "అధిక పదగణరాశి" యన్న మాట. తెల్లవాడు మా అన్నను కేవలం మాడ్చాడనటంవల్ల వాడి దుష్కృత్యంలోని భావసాంద్రత తెలియదు. అందుకోసం భయంకరమైన మధ్యాహ్నపు మండుటెండను కవి అధికంగా ఈ పాదంలోనికి పట్టుకువచ్చాడు. అలాగే చివరి పాదంలో పెట్టెగుర్తులో వున్న Boy అనే పదగణం కూడా ఎంతో ప్రధానంగా కావాలని అధికంగా వేసినటువంటిది. తెల్లవాడి దుష్కృత్యాలను చెప్పుకొంటున్నది వయస్సులో చాలా చిన్నవాడనే సంగతి ఈ చివరిపాదంవరకు మనకు తెలియదు. ఈ అధిక పదగణంతో ఆ suspenseను కవి తొలగించే సందర్భమిది. ఈ Boy అనే పదగణం మనమింతకు ముందు చెప్పుకున్న కుందుర్తి కవితలోని "బ్రతుకు" వంటిది.

వచన పద్యలక్షణాలను మరికొంత విశాలంగా పరిశీలించటం కోసం వర్తమాన ప్రముఖ కవులు వ్రాసిన కొన్ని వచన పద్యాల్ని అక్కడక్కడ తీసుకొని మీముందు ప్రదర్శిస్తాను. చెరబండరాజు వ్రాసిన 'గమ్యం'[3] అనే కవితలోని పంక్తుల్ని ఇలా విభజించి వ్రాస్తున్నాను.

"నా పేరు ఆకలి
సాయుధం నా శరీరం
ఆక్రమణ నా ఉనికి
ఉద్యమం నా ఊపిరి
విప్లవం మా ఊరు"

ఈ రచనలో ఐదు పాదాలున్నాయి. ప్రతి పాదంలోను మూడేసి పదగణాలున్నాయి. ఇలా ఈ పాదాలు పరస్పరం సమానం. ఇదంతా ఒక యూనిట్.

ఆరుద్ర వ్రాసిన 'వరమిచ్చే పూజారి'[4] అనే కవితను పరిశీలిస్తాను.

"ఆఫీసు మూసేసినా ఉంటాడు బంట్రోతు
ఆఫీసరు గుర్రం, అతగాడు రౌతు
అవలా నీ పని అవకుండా జాప్యం
అయితే పెట్టు ఆ చేతిలో రూప్యం"

మొదటి రెండు పాదాల్లోను నాలుగేసి పదగణాలున్నాయి. చివరి రెండు పాదాల్లో అయిదేసి పదగణాలున్నాయి. ఇక్కడ వరుసగా రెండేసి పాదాలను ఒకో యూనిట్‌గా భావించవచ్చు. అలా భావించటానికి అందులోని అంత్య ప్రాస కూడా దోహదంచేస్తుంది. ఇక్కడ రెండు యూనిట్లకును అంత్యప్రాస లేకున్నా ఆద్యక్షర మైత్రి రావటంమాత్రం గమనించవలసిన ప్రత్యేకత.

శ్రీ కె. శివారెడ్డి వ్రాసిన కవిత[5] లో

"ఆకాశపు వక్షంలోకి
అవని అక్షుల్లోకి
తొలి కిరణంలా చొరబారి పోతాను
నా కలాన్ని ఉలిగా మలచి
దానవుణ్ణి దేవుణ్ణి చేస్తాను
నా పాళీకి ప్రాణం పోసి
ఇంటింటా సన్నాయి మ్రోగిస్తాను"

ఈ ఏడు పాదాల్ని రెండు యూనిట్లుగా విభజింపవచ్చు. మొదటి మూడు పాదాలు ఒక యూనిట్. ఒకటి, రెండు పాదాల్లో రెండేసి పదగణాలున్నాయి. ఈ రెండు పాదాలు పరస్పరం సమానం. ఈ రెండు పాదాలూ కలిసి నాలుగు పద గణాలున్న మూడవ పాదానికి సమానం. ఈ మూడవపాదం మొదటి యూనిట్‌లో నాల్గవ పాదం లేని లోపాన్ని రెట్టింపు గణాల్ని కల్గివుండటంవల్ల తొలగించగల్గింది.

రెండో యూనిట్ మళ్ళీ విడిగా వ్రాసి పరిశీలిస్తాను స్పష్టత కోసం—

"నా కలాన్ని ఉలిగా మలచి
దానవుణ్ణి దేవుణ్ణి చేస్తాను
నా పాళీకి ప్రాణం పోసి
ఇంటింటా సన్నాయి మ్రోగిస్తాను"

ఇందులోని ఒకటి, మూడు పాదాలలో నాలుగేసి పద గణాలున్నాయి. ఈ రెండు పాదాలు ఒకదాని కొకటి సమానం. అంత్యప్రాస కూడ సరిపోతుంది. అలాగే రెండు, నాలుగు పాదాలలో మూడేసి పదగణాలున్నాయి. ఈ రెండు పాదాలు ఒకదాని కొకటి సమానం. అంత్యప్రాస కూడా సరిపోతుంది. ఇక ఇందులోని సబ్ యూనిట్ల గూర్చి తెలియజేస్తాను. ఒకటి, రెండు పాదాలలో మొత్తం ఏడు పదగణాలున్నాయి. అలాగే మూడు, నాలుగు పాదాలలో మొత్తం ఏడు పదగణాలున్నాయి. ఇలా ఈ నాలుగు పాదాలు రెండు సమానమైన భాగాలు. ఈ రెండు సమాన భాగాలను సబ్ యూనిట్లంటాము. ఇక్కడ ఈ రెండు సబ్ యూనిట్లకు ఆద్యక్షర మైత్రి, అంత్యప్రాస—రెండూ కలసి వచ్చాయి.

శ్రీ విహారి వ్రాసిన ఒక మినీకవిత[6] చూడండి.

"తెరలా వాలి
వానలా ముంచి

రాక్షసిలా నవ్వే
భయం ముందు
కామాలూ
గామాలూ
తల్లక్రిందు''

దీన్ని రెండు యూనిట్లుగా విభజించవచ్చు. మొదటి నాలుగు పాదాలు ఒకయూనిట్. ప్రతి పాదంలోను రెండేసి పదగణాలున్నాయి. రెండు సమ భాగాలుగా ఈ యూనిట్‌ను విడదీస్తే మొదటి రెండు పాదాలు ఒక సబ్ యూనిట్, తరువాతి రెండు పాదాలు మరో సబ్ యూనిట్. ఈ రెండు సబ్ యూనిట్లకు ఆద్యక్షర మైత్రిగాని, అంత్యప్రాస గాని లేకపోవటం గమనించవలసిన ప్రత్యేకత. ఆ తరువాత వచ్చిన ఒక్కొక్క పద గణంగల మూడు పాదాలూ రెండో యూనిట్. ఇందులోని మూడు పాదాలు పరస్పరం సమానం. కాని ఈ యూనిట్‌లో సబ్ యూనిట్లు లేవు మూడు పాదాలు తప్ప. మొత్తంమీద గమనించవలసిన విశేషం మరొకటి వుంది. మొదటి యూనిట్‌కు, రెండో యూనిట్‌కు అంత్యప్రాస వుంది. శ్రీ మాదిరాజు రంగారావు వ్రాసిన ''అందుకే అతడు''[7] అన్న కవితలో నుండి పరిశీలిద్దాం.

''అతనికి చావు లేదని
అందరికీ తెలుసు
ఎందరిలో నిజంగా
ఉన్నా డన్నదే ప్రశ్న''

ఇందులో ఒకటి, నాలుగు పాదాలు మూడేసి పదగణాలు కలిగి సమానమవుతాయి. రెండు, మూడు పాదాలు రెండేసి పద గణాల్ని కలిగి సమానమవుతాయి. ఈ నాలుగు పాదాల్ని మొత్తం మీద రెండు సమాన భాగాలుగా చేసి ఒక్కొక్కదానిని సబ్ యూనిట్ అనవచ్చు. ఒకటి, రెండు పాదాలు కలిసి ఏర్పడే మొదటి సబ్ యూనిట్‌లో ఎన్ని పదగణాలైతే వున్నాయో మూడు, నాల్గు పాదాలు కలిసి ఏర్పడే రెండో సబ్ యూనిట్‌లోను అన్ని పదగణాలే వున్నాయి. ఈ రెండు సబ్ యూనిట్లకు ఆద్యక్షర మైత్రి, అంత్యప్రాస—రెండూ లేవు.

శ్రీ వేగుంట మోహనప్రసాద్ వ్రాసిన 'త్రికాల బాధితం'[8] కవితలో —

''ఇహం పొట్టి
పరం దూరం
వేగం ఒకటే
టైమ్ వేరు
టెన్స్ వేరు
ట్రైన్ పొడుగు
టెన్స్ పొట్టి
టైమ్ పొడుగ్గా పర్చుకున్న వెడల్పు ...''

ఇక్కడి పాదాల్ని చాల జాగ్రత్తగా ఆలోచించాలి. మొదటి ఏడు పాదాల్లోను కేవలం రెండేసి పదగణాలే వున్నాయి. ఇలా చేయడం వలన కవిత పొడుగు పెరుగుతుంది. చివరి పాదంలో ''టైమ్ పొడుగ్గా పర్చుకొన్న వెడల్పు'' ద్వారా ఇక్కడ అంతకు ముందు పాదాల్లో విడిగా వచ్చిన పద గణాలకు రెట్టింపు గణాలు అకస్మాత్తుగా రావటంవల్ల — ఈ చివరి పాదం వెడల్పు పెరుగుతుంది. సమర్థుడైన కవి కలం నుండి భావానుగుణమైన నిర్మాణం గల పాదాలు వెలువడతాయని తెలుస్తున్నది.

మహాకవి శ్రీశ్రీ నుండి కూడ ఒక ఉదాహరణ[9] విశదీకరిస్తాను.

''విదూషకుని వికట హాసంలో
కపాలం పకా లన్నది
ఆకలి అన్నం వండుకుంది
హంస ఆకాశం అందుకుంది''

ఇందులో ప్రతి పాదంలోను మూడేసి పద గణాలున్నాయి నాలుగు పాదాలు ఒక దాని కొకటి సమానం. ఇది ఒక యూనిట్. ఇందులోని మొదటి రెండు పాదాలు ఒక సబ్ యూనిట్ చివరి రెండు పాదాలు మరో సబ్ యూనిట్. మొదటి సబ్ యూనిట్‌లోని పాదాలకు పరస్పరం అంత్యప్రాస లేకపోయినా చివరి సబ్ యూనిట్‌లోని

పాదాలకు అంత్యప్రాస వుంది. అలాగే మొదటి సబ్ యూనిట్‌కు, రెండో సబ్ యూనిట్‌కూ కూడ అంత్యప్రాస ఉన్నది.

డాక్టరు సి. నారాయణరెడ్డి నుండి ఒక ఉదాహరణ[10] పరిశీలిస్తాను.

''జగత్తు మత్తుగా పడుకుంది
తమస్సు తపస్సులో వుంది
సగం పీల్చి పారేసిన సిగరెట్టు
జ్వలనమే తన ధ్యేయ మంటుంది''

ఇందులోని మొదటి రెండు పాదాల్లో మూడేసి పద గణాలున్నాయి. చివరి రెండు పాదాలలో నాలుగేసి పద గణాలున్నాయి. మొదటి రెండు పాదాలు ఒక యూనిట్. చివరి రెండు పాదాలు మరో యూనిట్. మొదటి యూనిట్‌లోని పాదాలకు అంత్యప్రాస వుంది. రెండో యూనిట్‌లోని పాదాలకు అంత్యప్రాసలేదు. కాని మొదటి యూనిట్‌కు రెండో యూనిట్‌కు అంత్యప్రాస ఉన్నది.

నా పరిశీలనలో తేలిన విషయాలను యిక్కడ పొందు పరుస్తాను.

1 వచన పద్యాన్ని కొన్ని యూనిట్లుగా విభజింపవచ్చు.

2 ఒక్కో యూనిట్‌లోని పాదాల సంఖ్య నియతం కాదు.

3 సమాన పదగణాలను కలిగిన కొన్ని పాదాల సమూహాన్ని ఒక యూనిట్ అనవచ్చు.

4 ఒకటిగాని, అంతకు మించిన యూనిట్లనుగాని వచన పద్యం కలిగి వుంటుంది.

5 పాద విశ్రాంతి సరిపోయేటట్లుగా ఒక యూనిట్ రెండు సమానమైన భాగాలుగా వుంటే ఒక్కో సగభాగాన్ని ''సబ్ యూనిట్' అనవచ్చు.

6 సబ్ యూనిట్ అంటే కనీసం రెండు పాదాలకు తక్కువగా ఉండదు. (అంతకు తగ్గితే దాన్ని ఒక పాదమనే అనాల్సి వుంటుంది పాదానికి సబ్ యూనిట్‌కి తేడా ఉండటం కోసం ఇలా భావిస్తున్నాను.)

7 ప్రతి యూనిట్‌లోను సబ్ యూనిట్ ఉండాలని లేదు. (రెండు పాదాల యూనిట్ ఉన్నప్పుడు అందులో సబ్ యూనిట్ ఉండదు.)

8 సబ్ యూనిట్లకు గాని, యూనిట్లకుగాని ఆద్యక్షరమైత్రి ఉంటే ఉండవచ్చు, లేకపోతే లేకపోవచ్చు — అలాగే ప్రాస, అంత్యప్రాసలు కూడా.

9 విశేష భావ స్ఫూర్తికోసం అక్కడక్కడ కొన్ని పాదాల్లో కొన్ని పదగణాలు ఎక్కువగానూ ఉండవచ్చు, తక్కువగానూ ఉండవచ్చు. కాని ఇలాంటిసందర్భాలు అరుదుగా ఉంటాయి.

పాదాంత విషయంలో విరామం ఉంటుందన్న శ్రీసంపత్కుమార అభిప్రాయంతో నేనూ ఏకీభవిస్తాను. ఇలా పదగణాలను బట్టి వచన పద్యాలకు లక్షణాలు భావింపవచ్చు. వచన పద్య లక్షణాలను ఇంకా ఎవరూ సర్వ సమగ్రంగా నిర్ణయించలేదు కాబట్టి నేను నా పరిశీలనలోకి వచ్చిన విషయాలను ఇలా ఈ వ్యాసం ద్వారా సహృదయులందరికీ తెలియజేసుకుంటున్నాను. రామారావుగారు, సంపత్కుమారగారు ... ఇంకా ఇలాంటి ఎందరో మేధావులు ఈ విషయం మీద తగిన మార్పులు, చేర్పులు సూచిస్తారని ఆశిస్తూ ముగిస్తున్నాను.

## ఉపయుక్త రచనలు


1 వచన పద్యం — (లక్షణ చర్చ) - రామారావు అండ్ సంపత్కుమార — నాగార్జున ప్రింటర్సు, హైదరాబాదు 1978 — అనుబంధం—2.

2 వచనపద్యంలో వ్యాకరణం (వ్యాసం)-చేకూరి రామారావు— భారతి, ఫిబ్రవరి 1980 — పుట 33.

3 మహా సంకల్పం (కవితా సంపుటి) — చైతన్య భారతి, విజయవాడ, 1975 — పుట 200. (చెరబండరాజు).

4 ఇంటింటి పజ్యాలు (కవితా సంపుటి) —ఆరుద్ర—నవోదయ పబ్లిషర్స్, విజయవాడ, పుట 68.

5 స్పందన (కవితా సంపుటి) — కె. శివారెడ్డి స్పందనసాహితీ సమాఖ్య ప్రచురణ, 1965, పుట 8.

6 చలనమ్ (కవితా సంపుటి) - విహారి — స్పందన సాహితీ సమాఖ్య ప్రచురణ, 1979, పుట 57.

7 యుగ సంకేతం — (కవితా సంపుటి) — మాదిరాజు రంగారావు—విజయాప్రెస్, హనుమకొండ, 1969, పుట 49.

8 చితి—చింత (కవితా సంపుటి)—వేగుంట మోహనప్రసాద్— శేషాచలం అండ్ కో, 1969, పుట 9.

9 ఖడ్గసృష్టి (కవితా సంపుటి) — శ్రీ శ్రీ — విశాలాంధ్ర ప్రచురణాలయం, విజయవాడ—1966, పుట 54.

10 అక్షరాల గవాక్షాలు — సి నారాయణరెడ్డి కవితా సంపుటి— శేషాచలం అండ్ కో, 1965, పుట 123.




శ్రీ సోమరాజుపల్లి వెంచయ్య

# ఆధ్యాత్మిక దృక్కోణాన్నుంచి : చలం

**1959 లో** అనుకుంటాను. మా గురువరేణ్యులైన స్వర్గీయ శ్రీ చింతా దీక్షితులుగారు ఒక ఉత్తరంలో ఇలా రాశారు :

''చలంగారి రచనలు చదివావుగదా ? చలంగారు ప్రస్తుతం, రమణాశ్రమంలో చేరి ఉన్నారు అంటే — చలంగారి మీద నీ అభిప్రాయము రాస్తావా ?'' అని రాశారు.

అప్పట్లో నేను ''చలంగారిని గురించి నా అభిప్రాయాలు మరోసారి రాస్తాను'' అని రాయడమేగాదు, జలసూత్రం రుక్మిణీనాథ శాస్త్రిగారిని గురించి, అడివి బాపిరాజుగారిని గురించి, కృష్ణశాస్త్రిగారి లాంటి వారిని గురించి చాలా విషయాలు మా ఇద్దరి మధ్య ఉత్తర ప్రత్యుత్తరాలు జరిగాయిగాని, ఆ తర్వాత, దీక్షితులుగారు అనారోగ్య పరిస్థితులలో కడలూరు నందుండడము వలన నేను చలంగారిని గురించి నా అభిప్రాయాలు నాలోనే ఉండిపోవడం ... వారి మరణవార్త, దీక్షితులుగారి కుమారులైన శ్రీ మల్లికార్జునరావు ద్వారా కడలూరి నుంచి నాకు అందడము ... ''మరపురాని దీక్షితులుగారు'' పేరిట ''సోమనాథ్'' అను నా కలం పేరిట ''స్రవంతి'' యందు ప్రచురించాను.

నా ''మరపురాని దీక్షితులుగారు'' వ్యాసం చదివి...ఆ వ్యాసములో, నేను వారి ఇద్దరిని గురించి వ్రాసిన విషయాలు సైతము బాగున్నాయని నాకు ఉత్తరం రాస్తూ ... దీక్షితులుగారిని గురించి తాను వ్రాసిన వ్యాసం, ఆంధ్రప్రభకు పంపిస్తున్నానని రాశారు -- చలంగారు.

కొలది రోజులలో, చలంగారు రాసిన వ్యాసము ఆంధ్రప్రభలో వెలువడింది.

ఐతే, గత ఫిబ్రవరి 'భారతి' సంచికయందు వెలువడిన, నిఖిలేశ్వర్‌గారి ''చలం'' వ్యాసము చదివిన తర్వాత, చలంగారిమీద నాకు గల అభిప్రాయాలు తప్పనిసరిగా రాయాలనిపించి రాస్తున్నాను.

చలంగారు మొదట శ్రీ వెంకటరత్నం నాయుడుగారి వలన, బ్రహ్మసమాజమువేపు ఆకర్షితుడైనాడు. ఆ రోజులలోనే బ్రహ్మ సమాజ ప్రచారము కోసరము...కొన్ని చిన్నచిన్న రచనలు చేసేవాడని, శ్రీ గొట్టిపాటి వెంకట సుబ్బయ్యగారురాసిన ''చలం'' జీవితచరిత్ర వలన తెలియుచున్నది.

ఆనాటి మన కులవ్యవస్థ యందు పేరుకుని, ఆచారముల పేరిట, విశ్వాసముల పేరిట ఉండిన, అంధ విశ్వాసములు చలంగారిని, అగ్రవర్ణులవారి ఆచారములకు దూరం జేయడం మాత్రమే గాదు, అందరికిమల్లే అతనికి గూడా ... సమాజంలో, స్త్రీ జన సంఘోద్ధారకుడుగా, ప్రసిద్ధుడు గావాలనే ఆకాంక్షయే అతడిని, రచనా వ్యాసంగంలోకి దించింది.

దీక్షితులుగారు పంపించిన''చలంగారి తొలికథ''అచ్చుగావడం వారి కలానికి చేవ ఇచ్చింది ! మస్తిష్కానికి పదునుబెట్టింది !!

తరువాయి విషయాలు అందరికి తెలిసినవే ! !

సాధారణముగా నేటి యువతరం ''భౌతిక దృక్కోణం'' నుంచి మాత్రమే . హేతువాదదృష్టిలో చలాన్ని... పరిశోధించడం జరిగింది.

అందుచేత, నేను ''చలం''గారిని, ఆధ్యాత్మిక దృక్కోణం నుంచి పరిశీలిస్తూ ... ఈ వ్యాసము రాస్తున్నాను.

చలంగారు మొదట నుంచీ చాలా సిన్సియర్ అయిన వ్యక్తి ఐతే ... అతనిలోని, ఆ సిన్సియారిటీ అనేదే ... బ్రహ్మసమాజము వాళ్ళకి గిట్టలేదు. అందుచేతనే, ఒకనాడు చలాన్ని బ్రహ్మసమాజం మందిరాన్నుంచి, బలవంతంగా బైటికిలాగి గెంటివేయడం జరిగింది!!

అప్పట్నుంచీ చలం ఒంటరిగా ఉంటూ, (దీక్షితులుగారు మినహా) ఏ సమితికీ, సమాజానికీ, కట్టుబడకుండా ... రచనలు చేసేవారు.

చలంగారు స్వతహాగా తనకు వాస్తవము అనిపించిన విషయాన్ని ఎవరేమనుకున్నాగాని...ఘట్టిగా నమ్మే స్వభావంకలిగిన వ్యక్తి !

కామిగానివాడు మోక్షకామి గాడు; అనే విషయము, ఆనాటి వేమనగారికి మాత్రమేగాక—చలంగారికి కూడా వర్తిస్తుంది.

చలానికి, ఎప్పుడు గూడా ''జ్యోతిష్యం''మీదా—''అతీతశక్తి'' మీదా...నమ్మకము ఉంటుండేది.

ఉద్యోగం వదిలిన తర్వాత కులం నుంచి బహిష్కరించబడడం...తన గత జీవిత ఘట్టాల్ని కుటుంబాన్ని గురించి, నిరంతరం ... ఆలోచించుకునేట్లు చేశాయి .. నాటి చలం జీవిత పరిస్థితులు ! !

ఆనాటి చలంగారి, మానసిక వ్యధని...స్థితిగతుల్ని...మనం, ''మ్యూజింగ్స్''లో చూడగలం !!

దీక్షితులుగారి వెంట అరుణాచలం వెళ్ళి శ్రీరమణమహర్షి దర్శనం చేసుకుని వచ్చిన తర్వాత, చలంగారి చూపు...ఆధ్యాత్మికం వేపు మళ్ళింది !!

చలం, అతడి కుటుంబ సభ్యులూ, అరుణాచలం — రమణాశ్రమానికి మకాం మార్చడం జరిగింది.

రమణాశ్రమానికి చేరిన తర్వాతనే చలంగారు, సాహితీ విలువలు కలిగిన కథలు రాయగలిగారు.

నాటి సాహితీ లోకమేగాక, చలంగారి ఆత్మకు తృప్తినిగూడా ఇవ్వగలిగిన ఉత్తమశ్రేణి కథా రచనలు, రమణాశ్రమంలోనే...చలంగారి కలాన్నుంచి అవతరించాయి.

## ఓ పువ్వు ... పూసింది

'భారతి' రజితోత్సవ సంచిక కోసరం, నాటి 'భారతి' సంపాదకులు స్వర్గీయ శ్రీశివలెంక శంభుప్రసాద్‌గారు, రమణాశ్రమానికి వెళ్ళి ''భారతి'' ప్రత్యేక సంచిక కోసరమని చలంగారి కలంనుంచి అవతరించిన ''ఓ పువ్వు'' పట్టుకొచ్చారు !!

'ఓ పువ్వు'' — చలంగారి కథా రచనా పరిణతకీ . ఆయన యందు కలిగిన మానసిక పరిణామాలకీ ... ఆధ్యాత్మిక జీవితానుభూతులకీ .. ఈశ్వరాన్వేషణయందు చలంగారు చేసే గవేషణలకు దర్పణంగా నిలిచింది...ఓ పువ్వు పూసింది !!

ఆ సంపుటి యందు వెలువడిన ''కల్యాణి'' వంటి మిగతా కథలు గూడా...రమణాశ్రమంలో ఉన్నప్పుడు రాయబడినవే !

''1960''—కథ, 1946 ప్రాంతమునందు, స్వర్గీయ శ్రీ చక్రపాణిగారి సంపాదకత్వమునందు, మదరాసునుంచి వెలువడుచుండిన ''ఆంధ్రజ్యోతి'' మాసపత్రికయందు వెలువడింది. ఐనా, ఇటీవలి మన దేశరాజకీయ పరిస్థితులు లీలగా ఆ రచనయందు ప్రతిఫలిస్తున్నాయనిపిస్తుంటుంది ఆ కథ చదివేటప్పుడు !!

చలంగారి ఊహారచన అయిన ''1960'' కాదు...... ''1977'' అనిపిస్తుంటుంది . పాఠకులకి !!

రమణాశ్రమంలో ఉండే చివరి రోజులలో...... ''జీసస్ శుభవార్తలు'', ''వంటిట్లో రమణ భగవాన్'', ''యశోదాగీతాలు'' లాంటి గ్రంథాలు రాశారాయన !!

*  *  *

చలంగారు రమణాశ్రమం చేరిన తర్వాత, యువతరం అతడి కంటే చాలా ముందుకెళ్ళిందంటాడు నిఖిలేశ్వర్‌గారు? ఇంతవరకు వాస్తవం?

దిగంబర కవితా సంపుటి—తొలిదానియందు, తన కవితను ప్రకటించిన మా మిత్రుడు ''మహాస్వప్న'' ఏమైనాడు? ఆ వలయం నుంచి ఇవతలికి వచ్చేశాడు!

''చెంచయ్యాగారూ? నేను ఆ సంకుచిత వలయంలో,...... కవిత్వము రాయలేక...దిగంబర కవులనుంచి ఇవతలికి వచ్చేశాను'' అన్నాడు...నాతోటి!

ఇలాగే, నాటి ఆరుమంది దిగంబరకవులు ఇవాళ ఏమైనారు?

విభిన్న రకాలుగా ఆ వలయంలో ఇముడలేక, వేరైనారుగదా?

అందుచేతనే, కేవలం భౌతిక దృక్పథమునుంచి రచనలు చేసిన పాశ్చాత్య దేశాలకు జెందిన రచయితలు ఎందరు, ఆత్మశాంతికి దూరమై...ఎందరు ఆత్మహత్యలకు పాల్పడేది...నిఖిలేశ్వర్ గారు పత్రికలలో చదివి ఉండగలరనుకుంటాను.

ఓ రచయిత...ఓ ఉద్యమ నాయకుడు...ఆధ్యాత్మిక జీవనుడు అయినంత మాత్రమున దేశానికి, ప్రజలకు సేవ చేయడానికి ముందుకు నడిపించడానికి అవసరమైన లక్ష్యాలను గోల్పోవగలడను కోవడము...హేతువాదులు, భౌతిక దృక్పథంనుంచి మాత్రమే ప్రతి విషయాన్ని పరిశీలించే యువతరం—ఆధ్యాత్మిక దృక్కోణ పరిశీలన చేయనందువలన...యిలా పొరపాటు అభిప్రాయాల్ని కలిగించుకోవడం సహజమైపోయింది?

ఒకనాటి రాడికలిస్టు, హ్యూమనిస్టు అయిన, స్వర్గీయ శ్రీ గోపీచంద్...అరవిందాశ్రమం ఎందుకు వెళ్ళాల్సి వచ్చింది?

ఆ తర్వాతనే గోపీచంద్‌గారు ''పోస్టు చెయ్యని ఉత్తరాలు'' (ఇవి ఆంధ్రపత్రికయందు, ఆదివారము అనుబంధమునందు ప్రచురితమై...పుస్తకంగా వెలువడినపుడు ... రచయితకు మిత్రులైన, ఆంధ్రపత్రిక అధిపతులు శ్రీ శంభుప్రసాద్‌గారికి అంకితమివ్వడం జరిగింది) ఆధ్యాత్మిక జీవనం జేస్తూనే...(కాషాయి గుడ్డలు ధరించి, గడ్డం పెంచుకుని కాదుసుమండీ!) ... గాంధేయుడు గానేకాక... ఆంధ్రుల అభ్యుదయం కోసరము, ఆంధ్రసాహిత్యాభివృద్ధి కోసరము, ఆంధ్రపత్రిక, ఆంధ్రసచిత్ర వారపత్రిక, భారతిలాంటి మహావృక్షాల్ని పెంచి పెద్దజేసి నేటికీ మన వారసత్వంలాగా ఇచ్చి వెళ్ళిన దేశోద్ధారక కాశీనాధుని నాగేశ్వరరావు పంతులు లాంటివారు ఇందుకు నిదర్శనము కాగలరు

దళిత జనుల సంక్షేమ కార్యకలాపాలకోసరము, వాళ్ళ ఉద్ధరణకోసరము, ఎలాంటి రాజకీయ పదవీకాంక్ష లేకుండా ... దేశం నలుచెఱగులా, నిర్వహించబడే ... శ్రీ రామకృష్ణమిషన్ సంస్థ లాంటివి...ఎన్నో ఉన్నాయి గనుక, యీ విషయంలో, నిఖిలేశ్వర్ గారు తన అభిప్రాయాల్ని మార్చుకోగలరని ఆశిస్తున్నాను.

అంతేకాదు రమణాశ్రమవాసి అయి...ఆధ్యాత్మికరంగం... లోతుపాతులను అన్వేషించనారంభించిన తర్వాతనే ... నిరంతరం తాను ఆడిపోసుకునే...విశ్వనాథని - ''ఇప్పటికీ బ్రతికి ఉండి రచనలు చేస్తున్నవాడు, ఒక్క విశ్వనాథ సత్యనారాయణ మాత్రమే.'' అంటూ...రమణాశ్రమంనుంచి శ్రీ వజీర్ రహ్మాన్‌గారికి రాసిన ఓ

ఉత్తరంలో ... రాయడం జరిగిందంటే ... చలంగారి సమ్యక్ దృష్టికి . నిదర్శనం కాగలదు !!

కనుక ఆధ్యాత్మికరంగప్రవేశం చేసిన ఓ రచయిత గానీండి రాజకీయ నాయకుడు గానీండి...అతడియందు కార్యదీక్ష, ఆత్మ బలం...అభివృద్ధి ఔతాయేగాని...ఏమాత్రం క్షీణించి... ఆ వ్యక్తి ఏ తరంవారికి పనికిరానివాడు కాజాలడు. అందుకు నిదర్శనం :

''కండెబొట్టున ఐదు ఖండాల నోడించి కొలువు లందిన వాడు మా కోమటన్న
సీమలో ఆచార్య సింహపీఠిక నెక్కి
కొలువు లందినవాడు మా తెలుగువాడు
బహు దేశమంత మహా పరిషత్తు తలమూచ పలికి వచ్చినది మా వంగసుతుడు.

[రచన : స్వర్గీయ శ్రీ జాషువా — అభ్యుదయ–1946, నాటి అభ్యుదయ రచయితల పాఠశాల ... ప్రత్యేకసంచిక.]

ఈ పద్యమునందలి మహనీయులందరు... ఆధ్యాత్మిక జీవను లేనా? కాదా? నిఖిలేశ్వర్ గారూ?

# నిరీక్షణ

## శ్రీ గూడ శ్రీరాములు

బహుజ మేధా వక్రీభవన ప్రసూతిలో
సిద్ధాంత స్ఫటిక మీనిన
దారిమల్లింపు రంగురేకుల
జిలుగు కట్టల్దాటి
అనంతాకాశం నీలాలపైకి ఫోకస్సైన
భావబాష్పాల మైక్రోవేవ్ గుణింతం —
పేద గులకరాయి గుండ్రం ట్రాన్స్మిట్చేసే దీర్ఘోతిహాసం
మంచుబొట్టు అంచుల్లో రాజుకున్న అగ్నికణం
కాలం నొసటిమీద దిక్కులుచెక్కే చరిత్ర సంకలనం.

ఆశపింజ యువనక్షత్రం
నిరంతర పథిక్రాంత వ్యధల ముక్కల్ని
నిశ్వాసాల మంటల్లో ముంచి
వెన్నెల పిండిలో తడిపి
పాకం పట్టి
అంతరాళం పైకప్పుమీద
అందని కుంచెతో
వర్ణచిత్రాల తంటాలుపడుతూ —
రాశిచక్ర సమస్యా చిక్కుదారం విప్పి
భవిష్యానికి కండెచుట్టబోతున్నది.

ఉరుం గుండు గుండెలోదూసి
రక్తం నీరు కక్కుకుంటూ —
ఉదాసీనంలో నిదురబోతున్న
పొన్నచెట్టు సందులోంచి —
జాలిగా జారిపడ్డ స్వాతిచినుకు
ఇసుక దూది పరుపులో
కునుకు తాగుతున్నది
విఫల వీరుని చివరి ఆశలా —
ఓ తూరుపు తొలి తెలుపులో
ఏ కుంకుమ పురుగో పాక్కుంటూ
వచ్చి
తట్టి
లేపి
కెరటాలమీద వెలుగురవ్వ
విసిరేసిన
తళుకు తోరణాల
మ్రోపుల్తో ఎత్తిన
స్మృతి స్తంభం ఫలకంలో
ఊపిరి నింపుకోమంటుందని
పేరు చదువుకోమంటుందని.

# కలగూరగంప

## కబంధమూర్తి

కీసరగుట్ట త్రవ్వకాల్లో పురాతత్వ శాఖవారికి లభించిన శిథిలాలు విష్ణుకుండినుల నాటివని హైదరాబాదు సచిత్రవార్త. అందులో ఒకటి తలలేని స్త్రీ దిగంబరంగా పంగరించుకూర్చున్న ప్రతిమను 'మాతృదేవత' అన్నారు. పద్మసహితంగా ఉన్నందున శ్రీ—లక్ష్మి అనవచ్చునన్నారు. పూర్వులామెను సౌభాగ్య సంతాన దాతగా పూజించేవారట. సింహం తలకూడా ఉన్నందున విష్ణు నరసింహావతార సంబంధం అనవచ్చన్నారు.

ప్రసవాసీన భంగిమలోనున్న ఈ కబంధమూర్తి విష్ణు భార్యా కాదు, నరసింహావతార సంబంధం లేదు. అష్టాదశ శక్తిపీఠాల్లో ఒకటనే యెల్లమ్మాపురాన (ఆలంపూరు, మహబూబు నగర్ జిల్లా) సరిగ్గా ఇల్లాంటిదో కబంధమూర్తి ఉన్నది. ఎల్లమ్మ, రేణుక, భూశక్తి అంటున్నారు. అక్కడ ఇలాంటి ప్రతిమలు మొత్తం మూడున్నవన్నారు, మైసూరు పురాతత్వశాఖ సుబ్రహ్మణ్యంగారు.

పురాతన ప్రసవాసీన భంగిమలో ఉన్న కబంధమూర్తి కంఠ ముండదగినచోట పద్మం ఉంది. భుజాలపై ఆకులలములున్నాయి. సంతానార్థులామె జననేంద్రియానికి వెన్నపూసి నాకెదరట. పనిగట్టుకుని ప్రదర్శిస్తున్నట్లే కబంధమూర్తి యోన్యుదర సయోధరాలు సుస్పష్టం.

నా రేణుకా జాతకాన్వేషణ పూర్తికాలేదు. ఎల్లమ్మ (జగజ్జనని), ఏకవీర, రేణుక ఒకే దేవత పేర్లుగా పరిగణన, పూజలున్నాయి. రూపకల్పన వింతగా ఉంది. అంతటా స్త్రీ జనారాధ్యగానేఉన్నది. సంతానార్థులెక్కువగా పూజిస్తున్నా, రోగనివారణార్థం, మశూచివంటి వాటికీ, విషనివారణార్థం కూడా పూజిస్తున్నారు. దీర్ఘసుమంగళీ విశ్వాసం కర్ణాటకమున ఉండనే ఉన్నది.

మంత్రాలు, సాహిత్యంలో గల వర్ణనలకు విభిన్నమైన రూపాలుండుట మైలారుదేవర రూపాల్లో గుర్తించాను.

''క్రీడాభిరామ'' వర్ణనల్లో ఈమె ఫణిరాజ మండన, సోమ సూర్యానలనేత్ర, శోభనాకార, నీలోత్పలాక్షి, ఇందిరావరుని తల్లి, జగదంబ, దేవముని సిద్ధసేవ్య, జమదగ్ని భార్య, గిరిరాజనందని, నిత్యకల్యాణి, ఆదిశక్తి, వేదవేదాంతసార, ఏకవీర, కొడుకుచే 21 సార్లు నరుల జంపించినది, త్రేతాద్వాపర సంధ్యనాటిది, కాక తమ్మకు సైదోడు, రాజునాండ్ర ... రట్టుకత్తె, జమదగ్ని ... వేడ్కకత్తె, క్షత్రియుల...కోపకత్తె, బవనీల ... రంతుకత్తె, పల్లికదేబెలతల్లి, ఓలిమిగదుళ్ల వాగులో ఓలలాడును.

ఈ వర్ణన కనుకూలమైన ప్రతిమల్లేవు. ఈమె రూపాలు—(1) విశాఖపట్నం ఎల్లమ్మతోటలో పాములపుట్ట (2) కీసరగుట్ట, ఆలంపూరు కబంధ (3) గోల్కొండ కోటలో, కర్ణాటకమునా దిగువభాగం ఏమియో తెలియని శీర్షమూర్తి (4) చతుర్భుజామూర్తి (5) మహారాష్ట్ర బౌద్ధక్షేత్ర శిథిలాలవద్ద సుందరి (6) నెల్లూరు జిల్లాలో ద్విభుజ, ఖడ్గపాణి, పురుషముండపాణి (7) మాహురిలో తలగా మార్చిన అండాకృతి—గుండ్రాయి. అసలు అండాకారం శీర్షమూర్తిని చేసిన వైనం ఉంది.

నా సచిత్ర వ్యాసాల సంపుటాలు మూటిలో ''మైలారదేవ, గుడిగుంపా (కాపీల్లేవు), కళిజ్ఞదేవ''లో రూపాల గూర్చి చర్చించాను. ''గుడిగుంపా'' పాఠకులొకరు ఎల్లారమ్మ వగైరాల రూప విశేషాలు లేవనే ''ఆంధ్రప్రభ''లో వ్యాసం ప్రచురించారు. ఫొటోలే ప్రచురించాను మరిక రూపవివరణ ఎందుకని ఒకవ్యాసం—వాలా ఫొటోలు (ఏప్రిల్ 1979) ప్రచురణార్థం పంపాను. ప్రచురించనందునా, ఉత్తరాలు వ్రాసినా వాపస్ కానందునా ఈ వ్యాసానికి పనికివచ్చే ఫొటోలు కొన్ని ''ఆంధ్రప్రభ'' (విజయవాడ) సంపాదకునివద్ద చిక్కుబడ్డాయి. అమ్మవార్ల గూర్చిన నా సచిత్ర వ్యాసాలు ''ఆంధ్రపత్రిక'' రెండు ఉగాది సంచికల్లో ఉన్నాయి. మండపాక ఎల్లారమ్మ గూర్చిన వాద ప్రతివాదాలు—నేనూ, డాక్టర్ శ్రీపాద గోపాలకృష్ణమూర్తిగారు—నా సచిత్ర వ్యాసాలు ''భారతి'' పాఠకులకు గుర్తుండునను కుంటాను. మా వాద ప్రతివాద సంధర్భంగా వేటూరి ప్రభాకరశాస్త్రిగారి సేకరణలుగా శంకరశాస్త్రిగారు ''భారతి''లో తలలేని గర్భిణీ, నిలచి ఉన్న దిగంబరి వగైరా ఫొటోలు ప్రచురించారు.

నరుడు తన రూపంలో ఊహించుకున్న వారి (ప్రతిమలు—సాహిత్యం) నే బహుభుజలు, బహుశీర్షులు, కపాల కంకాళరూపాల్లోనూ ఉపాసించాడు. వీటికేపోలికాలేని ప్రసవాసీన—కబంధమూర్తి నిర్మాణంలో నాటి పురాతన భావం నేడు గుర్తించలేము. మతం, భాష, పేర్లు, కథలు వేర్వేరైనా రేణుకా కబంధమూర్తి పోలిన ప్రతిమ ఇతరప్రాంతాల్లో ఉన్నాయి.

ఆలంపూరు, కీసరగుట్ట బొమ్మలపోలిన దొకటి మధుర వద్ద కంకతీ శిథిలాల్లో పురావస్తు శాఖవారు గుర్తించారు. ఆ శిథిలాలు కనిష్కుని నాటివన్నారు. ఈ ప్రతిమ భంగిమ అదే అయినా కబంధ కాదు. కబంధుడనే రాక్షసుడు రామలక్ష్మణుల తన బాహువుల్లో బంధించాడట (''రామాయణము''). ఆలంపూరు భూశక్తి ప్రతిమలో బల ప్రదర్శనలేదు. మూడు పేర్లలో ఏ పేరనున్నా రేణుక రూపం భయంకరీ, రాక్షసే కాదు. రెండు చేతులు భుజాలపై మడచినట్లుంది. రాయలసీమలో పేడ మట్టి బొమ్మలు యెల్లమ్మ—రేణుక చతుర్భుజగానూ, కబంధగానూ ఉన్నాయట. క్షేత్రాల్లో ఆరాధ్య ప్రతిమలతో సింహలాంఛనాలుంటే రాయలసీమలో సూకర చిహ్నాలున్నాయట. పామరు (జానపద)ల పందినే పండితులు

సింహంగా మార్చారు! ఈమె కథారూపాల్లో మానవుని మనుగడకూ నాగరికతకూ రెండిటి సంబంధం ఉంది.

సింధు నాగరికతా శిథిలాల్లో పురాతత్వశాఖ వారికి లభించిన వాట్లో ప్రసవాసీన భంగిమలో స్త్రీ–జననేంద్రియంనుండి బైల్పడిన తామరపూవో, తాబేలో నీట తేలుచున్నట్లుందట.

గ్రీకు గాథల్లో మెడూసా శీర్ష కబంధమూర్తులు పోలికలు చాలా ఉన్నాయి. ఈ గార్గోనీలు ముగ్గురూ అక్కచెల్లెండ్రట.

పారసీకుల మహామాత అనాహిత (అనైతిస్) కూడా కబంధయేనట. ఈజిప్టు పురావస్తు శాఖ సేకరణల్లో ఒక పాత్ర రూపం స్త్రీ ఆసీనభంగిమ మర్మాంగాన్ని రెండుచేతులా పట్టి చూపుతున్నట్లుంది (తార్త్) కాని కబంధకాదు. మరో దేశాన ఖడ్గపాణి ప్రసవాసీన భంగిమలో పంగరించి కూచున్నది. గ్రీకు ఆఫ్రోదితీ కబంధకాదు కాని స్తన మర్మాంగ ప్రదర్శన ఉన్నది. బహుపురాతన కాలానిదైన మహామాత నిన్ హూర్ సాగ్ (శీర్షమూర్తి) బిళ్లపై పాము పోలిక రెండు జడలమధ్య తల, నాభీ స్తన సూచన, దిగువ శష్పసహిత మర్మాంగం–ఆదిశక్తి వగైరా పోలికల్లో బహురూపి–స్త్రీ పురుష రూపాలు–మరో కబంధమూర్తి 'బెస్'. ఒకరూపం పద్మస్థితా–స్తనద్వయంపై స్త్రీ వదనం. గ్రీకు గాథల్లో కబంధమూర్తి అకఫాల.

కబంధమూర్తుల కల్పనా కారణాలు ప్రచారంలో ఉన్నాయి. ఆలంపూరు ప్రతిమా సందర్భంగా పండితులుకూడా వీరశైవ విజృంభణ అన్నారు. జైన బౌద్ధ విగ్రహాలను వీరశైవులు నరికివేసారట. కర్నాటక పరిసర ప్రాంతాల్లో కారణం కాబోలు అనుకున్నారు. జైనంలో పరశురాముడు, 'తలిదండ్రులకే పవిత్రతా గౌరవాల్లేవు సరికదా క్షత్రియుడొకడు (సుభూమ) పరశురాము నోడించి 21సార్లు బ్రాహ్మణుల జంపెనట కీసరగుట్ట విష్ణుకుండినుల నాడు వీరశైవు లున్నారా? వీరశైవులు విగ్రహాల తలలు నరికివేసారనే నమ్మకం నిజంకాదు. తల తీసేస్తే మెడపై పద్మాలెలా వచ్చాయి? కాబట్టి ప్రతిమా నిర్మాణంలోనే కబంధమూర్తి పద్మసహిత అనాలి.

అలంపూరు భూశక్తి భుజాలపై ఆకులలము ఉన్నాయి. శుంగ కుశాణులనాటి సరస్వతి తాళపత్ర కిరీటధారిణి వేదాల బాపతు ఇలా దేవి చేతులూ, తలా చెప్పేనట. ఈజిప్టు 'మస్కోనిత' శీర్షంకూడా చెట్టే బహుపురాతన కాలంనుండీ ఊర్లు, ప్రాంతాలు చివరికి మనుష్యుల పేర్లు, స్త్రీ శరీర భాగాలు పోలికల్లో కూడా తరులతా పత్ర పుష్పఫలాల ఉపమానాలున్నాయి. నరుని నాగరికతా చరిత్రలో చెట్టుకు చాలా సంబంధం ఉంది. అదే వృక్షపూజ, ఓషధీమాత ఉత్సవాలూ సంతాన దాతలనే నమ్మకాలు క్కారణం. జీవకోటి జీవితాల్లో వృక్షప్రసక్తి చాలా ఉంది.

కబంధ రూపకల్పనక్కారణం రేణుకా సందర్భంగా మనవారి విశ్వాసం–పరశురాముడు తల్లి తల తరగడం–నిజానికి తల తరగడం, పునర్జీవిత గాథలో ఉన్నది చెట్టు నరికివేసినా మూలం ఉంటే తిరిగి ఫలవంతం కావడం. ప్రకృతి గూర్చిన నమ్మకాలు కావాలి. కబంధ రూపాలున్న ప్రాంతాల్లో పరశురాముడు లేడు కాని నరకుడు కథలున్నాయి. మెడుసా తల తెచ్చినది పరశు (**Perseus**). భార్గవరాముడు పరశుధారి. శిరచ్ఛేదనా పోలికల్లో సృష్టి నిలుపుదల చేయడమనిపించే పితృ ప్రాధాన్య గాథల్లో పురుషాంగం ఒక దేవుడిది మరొకడు కొరికివేయడం మరోదేశపు కథ. ఇటీవలి వార్తల్లో (ముజఫర్‌పూర్) భార్యపై కినిసిన భర్త స్వలింగచ్ఛేదన. కన్నడవీరభద్ర భక్తులూ కురుబలూ తలలపై టెంకాయలు కొట్టుకోడం ప్రజాపతి దక్షుని తల దీయడం. ఈజిప్టు మహాదేవుని సృష్ట్యవయవాలు రాలిన స్థలాలు పుణ్యక్షేత్రాలైనాయి. మన గాథల్లో సతి శరీర భాగాలు రాలినచోట్లూ అంతే. సతి జననేంద్రియం రాలిన చోటనే అస్సాం కామాఖ్యాదేవి క్షేత్రం. ఈ కూచ్ బిహార్ దేవత రూపాలూ మూడే–యోని, పద్మస్థితా భయంకరీ, త్రిపురసుందరీ దయారూప. సుమేరు గాథలనాటినుండీ అనేక దేశాల్లో కథలు దేవుడు లేక దేవత పాతాళ (యమలోక) దర్శన, జలయానం. సుమేరు గిల్గమేశ వీరుని హుంబబ (క్రూరసత్వ)పై విజయం, నిన్‌హూర్ సాగ్ దేవత ఎంకిని తన యోనియందుంచి స్వస్థుని చేయడం–బెస్ శిరచ్ఛేదన - అండం అందుండి కబంధ అందుండి హార్మొక్రేట్స్ పుట్టుక–రేణుక పోలికల్లో ఈజిప్టు మహామాత ఈశి శిరచ్ఛేదకుడు కొడుకు హోర (**Horus**).

విశ్వాసాల వస్త్రఫహాళితం చేసిన పరిశోధకుల కనిపించే వాస్తవం–ఆకాశం, భూమి, నీరు. నిప్పు ఋతుక్రమానుగతమైన ప్రకృతి. సృష్టిగూర్చిన ఒకనాటి నమ్మకాలు–రేణుకా గాథల్లో జానపద ప్రమేయం ఎక్కువగా ఉన్నా సృష్టిగూర్చిన పరిశీలనలో పామరులు పండితులకు తీసికట్టు కాదనే విషయం లేకపోలేదు.

స్త్రీనాభి, గర్భం, జననేంద్రియారాధన తాంత్రికమంటారు. తాంత్రికులు భౌతిక–శరీర శాస్త్రవిజ్ఞులా? సజీవ జననేంద్రియారాధన ఈ శతాబ్దంలో ఉండేది. ఇందులో అశ్లీలం, జుగుప్స వగైరాల్లేవు. దేవత రూపకల్పనే అలాంటిదట. భగ్నా, భగరూపా, భగాలసా, భగార్చితా, భగారాధ్యా–స్థితా రమయతుం తత్ర నిత్యమేక హిమాద్రిజా రమయతుం రమ్యం–ఇవేమీ 'పంచాస్తోపనిషద్రహస్యాలు' కావు అని గ్రహించడానికి చాలా చర్చ కావాలి. యోన్యుదర పయోధరాల ప్రదర్శన! తలలేని బొమ్మ!

పద్మం కేవల విష్ణుపత్నీ సూచనకాదు. పద్మ ప్రాధాన్యత ఇతర దేశాల్లోనూ ఉంది–పద్మలోచన, పద్మసంభవ, పద్మనాభ, పద్మపాణి, పద్మాలయ, పద్మార్చితా వగైరా. ఐతే మొగ్గ — విరిసిన పూవు భావాలువేరు. జననేంద్రియాన్నీ పద్మంతో పోల్చారు. ఈజిప్టు మహామాత ఈశి(స్) పద్మప్రియా, పద్మార్చితా వగైరా. కేరళ రైతాంగం పూర్వాచారాల్లో ఒకటి–పొలం దున్నేముందు తామరపూవులు వేసి దున్నడం—పరిశోధకాభిప్రాయాల్లో పద్మం సూచించేది జీవం — జీవశక్తి. రక్తవర్ణం, సౌరం–సృష్టి. చిహ్నం — వంశవ్యాప్తి.

దిగంబర రూపాలన్నీ మహామాతవనే పరిశోధకాభిప్రాయాల్లో ప్రతిమలు సాలంకృతులు, పిరుదులూ, స్తనాలూ పెద్దవి. లేదా చేరువనే శిశు వుంటుంది.

ఈ కబంధమూర్తి జగజ్జననీ భావాలే. పద్మం, పంకజం, జలజ, అంబుజ, సరోజ - ఈ ప్రతిమల్లో ప్రకృతీ, పోషణ, సృష్టి వగైరాల్లేవా? భూమిపై స్థావర జీవోత్పత్తికి మట్టి నీరు ప్రాధాన్యత. సుమెరు గాథలనాటికే జంగమ జీవుల్లో స్త్రీ—పురుష సంయోగం సృష్టి కారణంగా గుర్తింపబడెను. ఒక దేవత దేవుని వెంబడించడంలో ఏరు దాటింది. అతడ్ని కౌగలించుకొని (రతి) అతని హృదయ జలం గ్రహించుటతో గర్భిణి కావడం కథ. సస్తన్య జీవుల్లో సృష్టి కారకాలు ద్రవరూపం.

కీసరగుట్ట 'మాతృదేవత' అలంపూరు రేణుకా, భూశక్తిలో జగజ్జననీ, ప్రకృతీమాత వగైరాతో ఉన్న ప్రత్యేకత జలశక్తి. పార శీక అనాహిత అతిబల జలదేవత — కబంధమూర్తి.

ఏకవీర గూర్చిన మరో వ్యాసంలో చర్చించ యత్నిస్తాను. మహారాష్ట్ర ప్రాంతాల ఏకవీర యమాయి. "కళింజ్గ దేవ" లో యమస్య భగినీ చర్చ చూడుడు. నరుని నాగరికతా చరిత్రలో యామీయమ ప్రసక్తి ఉంది. పారసీకుల్లో పోలినవారు యిమాజల సంబంధం—దేవతల ఆభరణాల్లో పాముల సూచను జలమే (గోనసా భరణ, ఫణిరాజ మండన) — మెడుసా శిరోజాలు పాములట. రేణుక కథల్లో అప్సొతపాలున్నాయి. 'కార్తవీర్య విధి' అనే ఇంద్రజాల? గుప్తవిద్య గూర్చి పరిశోధన చేయాల్సున్నది. కార్తవీర్యుడు సహస్ర బాహువు ప్రవాహాన్నరికట్టిన కథ ఉన్నది. కంటికి కనిపించే నీరు—వాన, నది ప్రవాహాలు, వాడే కూప తటాక జలాలు వగైరా. రేవతి అర్థాల్లో గంగ (నీరు) ఒకటి. అనావృష్టి కాలాన రేణుకా పూజ లుండేవి. గంగమ్మ జాతరగా మారిన ఆచారాల్లో ఉన్నది రేణుకయే నట. "క్రీడాభిరామము" వర్ణనలో ఓలిమిగదుళ్ళ వాగులో ఓల లాడు ఒకటే కాదు జల సంబంధం — నీరు సంబంధించిన బహు నామాల్లో కబంధ ఒకటి.

సృష్టికారకం ద్రవరూపం — సృష్టికి మూలం నీరు అనే భావం బహు పురాతనం — సృష్టి గూర్చిన కథల్లో నీటి ప్రసక్తి చాలా ఉంది. అలంపూరు కబంధమూర్తి స్ఫురింపజేసేది అంత ర్వాహిని — భూమిలో ఊటలు, పాతాళ గంగ. సస్తన్య జీవుల్లో సృష్టి. శక్తి ద్రవం అంతర్గతం. కబంధరూపిణీ రేణుకలో ప్రకృతిమాత జగజ్జననీ లక్షణాలన్నీ ఉన్నాయి మరో (ఎల్లమ్మ — ఏకవీర) వ్యాసం — శీర్షమూర్తి సచిత్రంగా ప్రచురించయత్నిస్తాను. ఆర్థికారోగ్యాలు బాగుపడగానే "మోక్షకుణ్డమ్" నాల్గో పుస్తకం ప్రారంభిస్తాను.

శ్రీ జి. ఆర్. వర్మ

# కృష్ణశాస్త్రి: 1948

['భోగమూ, బద్ధకమూ ఎక్కువై' కృష్ణశాస్త్రిగారికి పనిచేసే అలవాటు తప్పిపోయింది. 1923లో స్కూలు మాష్టరీ ఉద్యోగం పోయింది. తమ అదృష్టంవల్లనే పోయిందన్నారు. ఆ సంవత్సరం తమకు గొప్ప సంవత్సర మన్నారు. అటువంటి కృష్ణశాస్త్రిగారిచే ఒకవ్యాసం రాయించి దాన్ని 'భారతి' రజతోత్సవ సంచికలో వేయించాలని సంపాదకులు శంభుప్రసాదుగారి భీష్మ సంకల్పం. ఇది సంకల్పం కాదు. చివరికి సవాలే అయింది. నక్షత్రకుల వంటి వారిని వారి వెంటబడేటట్లు చేశారు. చివరికి కృతకృత్యులయ్యారు. ఆ వ్యాసమే 'పాతిక సంవత్సరాల తెలుగు కవిత్వము' 'భారతి' రజతోత్సవ సంచికలో ప్రక టితం కృష్ణశాస్త్రిగారు రాసిన ప్రశస్త వచన కావ్యం. ఆధునిక కవితావిర్భావ చరిత్ర తెలుసుకునేవారికి అవశ్య పఠనీయం. శంభుప్రసాద్‌గారే పూనుకోక పోతే కృష్ణశాస్త్రిగారు ఏం చెప్పినా అవి మాటలుగానే ఉండిపోయేవి.

ఆ వ్యాసంలోని ముఖ్య విషయాలు గ్రహించి ఈ వ్యాసాన్ని పోత పోశాను.

— సుందరేశ్వరరావు]

వీరేశలింగం చేతి దెబ్బలకు ఆంధ్రజాతి నిద్రలో నుంచి కాస్త ఒత్తిగిల్లి, ఒళ్ళు విరుచుకొని, కళ్ళు నులుముకొని అప్పుడే ఆవులించి లేచి కూర్చున్న రోజులవి విజయనగరం గిడుగు, గుర జాడలు నవ్యభాషా కవిత్వాలకు నాంది పలికారు. పిఠాపురం, కాకి నాడలలో రఘుపతి వేంకటరత్నం నాయుడుగారి ద్వారా మానవోద్య మమూ, దానికి సంబంధించిన ఉన్నతోజ్జ్వలములైన లక్ష్యాలూ, ఉర్దూ పారశీకాంగ్ల సాహిత్యాల ఘనతా, లావణ్యాము వారి శిష్యులకు పరిచయమయింది. రాజమహేంద్రవరంలో కూ(్రడ్డే వంటి ప్రతిభా శాలి కవికొండల వెంకటరావు, అడవి బాపిరాజు వంటి కవులను చేరదీసుకుని వర్డ్స్‌వర్తు వంటి కావ్యాల రుచి చూపించాడు. బంధ రులో చెళ్ళపిళ్ల వెంకటశాస్త్రిగారున్నచోట కవిత్వపు తిరునాళ్లే. విశ్వనాథ, పింగళి, కాటూరి, త్రిపురనేని రామస్వామి చౌదరి, మాధవపెద్ది బుచ్చి సుందర రామశాస్త్రి సామాన్య సదస్సులలో కూడా కవితోత్సవాలు కావించేవారు.

హైందవ జాతీయోద్యమం కృష్ణా, గుంటూరు జిల్లాలలో ఆంధ్రోద్యమ రూపాన ఎక్కువ విజృంభించింది. జాతి గౌరవాన్ని కావ్యాలల్లిన కవులందరు దాదాపు అక్కడివాళ్లే.

## స్వీయ కథ

పిఠాపురం దగ్గిర కూచిమంచి తిమ్మకవి చంద్రంపాలెం మావూరు. తండ్రీ, పెద్ద తండ్రీ మంచి పండిత కవులని ఆ రోజుల్లో పేరు పొందారు. ఆ పితృదేవుళ్ని ప్రతినిత్యమూ స్మరించు కుంటూంటాను. మొదట పిఠాపురం సంస్థానానికి సన్నిహితుణ్ణ వడంచేత, జీవితంలో భోగమూ, బద్ధకమూ ఎక్కువై కృషితక్కువ. ఇంటివద్ద అహరహాలు పూర్వ కార్యగోష్ఠి జరుగుతూ ఉండేది. కాకినాడలో వెంకటరత్నం నాయుడుగారి శిష్యుణ్ణాయి మత సంఘ సంస్కరణోద్యమాల ప్రభావంలో పూర్తిగా పడ్డాను; ఆంగ్ల సాహి

త్యంతోను, సూఫీవంగ వైష్ణవ సాహిత్యాలతోను నా గురుదేవుల ద్వారానే నాకు కొంచెం పరిచయం.

తరవాత హరిజనోద్యమంలోనూ, కళావంతుల వివాహోద్యమంలోనూ మావూళ్ళో కొంత తిరిగాను కొన్ని సంవత్సరాలపాటు నన్ను బంధువులూ, బ్రాహ్మణులూ బహిష్కరించారు. నా జీవితంలో అతి తీవ్రమైన వేదనా ఆవేశమూ కలిగించే గొప్ప అనుభవాలు కొన్నివచ్చాయి. ఉద్యోగం ఎవరయినా ఇచ్చినా అది ఉంచుకొనే గుణంలేక నవ్యకావ్యాలు చదువుతూ నవ్యకవిత్వం మొదలైన వాటిమీద ప్రసంగిస్తూ కొంత తిరిగాను.

## మొదటి కావ్యపఠనం దామెర్ల రామారావు ఇంట్లో

మొట్టమొదటి నా కావ్యపఠనం దామెర్ల రామారావుగారి యింట చిన్న సభలో అనుకొంటాను. ఆయనకీ, ఆయన అన్నగారికి నా పద్యాలన్నా, నా చదవడమన్నా చాలా ఇష్టం. తరవాత దాదాపు పదేళ్ళపాటు పద్యాలు చదువుతూ దేశమంతా తిరిగాను. ఓ! ఏమి తిరగడం. అప్పుడు నాకు నిత్యమూ కవిత్వోత్సవం కావాలి. ఇదంతా ఎందుకు చెబుతున్నానంటే నవ్యకవిత్వం ఒక తీవ్రోద్యమమయి నిలవడానికి ఈ నా కృషి కొంతవరకయినా కారణమని ఇప్పుడింత దూరాన్నుంచి అనుకుంటే మన్నించండి.

కృష్ణపక్షం ప్రచురించాక మద్రాసు వచ్చాను. అక్కడ నండూరి సుబ్బారావు 'యెంకి పాటలు' లా కాలేజీలో చదువుతూ అచ్చు వేయిస్తున్నాడు బసవరాజు ఆంధ్రపత్రికలో ఉన్నాడు. నాయని ఉన్నాడు. రోజూ కలుసుకొని పద్యాలు, పాటలు చదువుకొనే వాళ్ళం.

## అక్కిరాజువారి అశనిపాతం

1925లో నేమో అక్కిరాజు ఉమాకాంతంగారు వ్రాసిన 'నేటి కాలపు కవిత్వము' అనే గ్రంథం వచ్చింది. అశనిపాతమంత తీవ్రధాటితో వచ్చింది రాకేం జేస్తుంది? ఎప్పుడయితే నిజమయిన ఒక ఉద్యమం బయలుదేరిందో అప్పుడే దాని గుణ దోష విమర్శనా వస్తుంది. ఆయన తీవ్ర విమర్శనుంచి నావంటి కవులు నేర్చుకోవలసింది లేకపోలేదు; కాని కొంత ఆర్ద్ర దృష్టితో, కవితా హృదయంతో ఆ విమర్శ సాగితే నేటి కాలపు కవిత్వంలో వారు చక్కదనమూ, కవిత్వగుణము గ్రహించేవారు. ఊపిరాడనీయనంత కోపంతో ఆ గ్రంథం దాడిచేసినట్లనిపించింది. దానికి జవాబు రాద్దామన్నారు కొందరు. ఏమి జవాబు మేము వ్రాయగలం? కొత్త పద్యాలు రాయడమే జవాబనిపించింది.

## గిరజాల సరదా

నాకు బాగా జ్ఞాపకం కొత్తగా పెంచిన నా గిరజాలను లాలిస్తూ గిడుగు రామ్మూర్తి పంతులుగారు పర్లాకిమిడిలో, నాతో మాట్లాడుతూ మా పద్యాలు వినడం.

ఈ గిరజాలు ఎన్ని కష్టాలు తెచ్చాయి నవకవికి! కేశసంపదకీ, కవిత్వశ్రీకి నిజానికి సంబంధం ఏముంది? మరి సమితి వారందరూ గిరజాలు పెంచనూలేదు; పెంచిన వారమయినా కుటిల శిరోజపాశాలతో సాహిత్యలోకాన్ని బంధించి జయించాలని అనుకోనూలేదు; బాగుంటాయని పెంచిన గిరజాలు! అంతే! తరవాత లోకం ఒత్తిడివల్లో, విరక్తివల్లో మావాళ్ళు అందరూ తీసేశారు; నాకు ఇంకా ఉన్నాయి. నవ్యకవిత్వానికి, గిరజాలకీ ఈ సంబంధం కల్పించడం, నవ్యకవిత్వ ప్రతినిధిగ సభల్లో కనబడుతూ వస్తూన్న నన్ను తెనుగువారు చూస్తూ ఉండడంవల్ల కొంతవరకున్నూ, తరువాత మా తరువాతి యువకవులు మరికొంద రక్కడా అక్కడా వాటిని పెంచడంవల్ల కొంతవరకున్నూనూ అనుకొంటాను.

## 'భారతి' పత్రిక

1923 డిసెంబరు మాసాంతంలో కాకినాడ కాంగ్రెసు జరుగుతూన్నప్పుడనుకుంటాను, బసవరాజు అప్పారావు చేతిలో 'భారతి' మొదటి సంచిక చూశాను. చూసిన తక్షణం ఎవరెవరి పద్యాలు దానిలో పడ్డాయా అని పేజీలు ఆత్రంగా తిరగేశాను. 'కన్నీరు' అనే నా పద్యం దానిలో పడ్డట్టు జ్ఞాపకం. అప్పటికప్పుడే మా సాహితి, శారద వస్తున్నా భారతిలాగ నిగనిగలతోను, నిండుదనంతోను ఏదీ రాలేదు. అందుచేతనే భారతిని అంత ఉత్సాహంతో అందుకున్నాను. ఇక నాడు మొదలుకొని ఈరోజుదాకా నిరాఘాటంగా హుందాగా వెలువడుతూ వస్తూ ఉన్న పత్రిక 'భారతి' ఒకటే. అంతేకాక తరతరాలవారివీ, రకరకాలవీ కావ్యాలకి సమానాదరాలు చూపుతూ వస్తున్న పత్రిక కూడా 'భారతే'.

# సమకాలీనులపై కృష్ణశాస్త్రి అభిప్రాయాలు

## మహాత్మాగాంధి

ప్రభువులు, ప్రబలులూ, పండితులు చూస్తూండగా సామాన్య జీవితాన్ని స్ఫురింపజేసే కూడు, గుడ్డా, కుటీవాసమూ, జీర్ణశరీరంతో గాంధీ ఏనాడైతే ప్రప్రథమ పీఠంమీదికి ఎక్కి కూర్చున్నాడో ఆనాడే ప్రతి సామాన్య మానవుడూ జగత్తంత ఆధికృతమీద అధిరోహించి ఊరుకున్నాడు.

## ర వీ ం ద్రు డు

భారతీయ సాహిత్యసీమలో హిమాలయ శిఖరంలాగ ఆకాశం లోకి పొడుచుకొని పైకి లేచి, ఉద్యమానికి ఉత్తమోత్తమ ప్రతినిధిగా కనబడేవాడు రవీంద్రుడు.

## వి శ్వ నా థ

ఇతనిది గాఢ ప్రతిభ—మహాకావ్య ఘట్టోల్లంఘన పటిష్ఠమైనది. ఇతనిలో తెలుగుతనం ఎక్కువ. ఎట్టి వస్తువునయినా కావ్యవస్తువుగా తీసుకుందుకు జంకడు. ఎట్టి మాటనయినా కావ్య భాషలోకి పొదగడానికి వెనుకాడడు. కల్పనాదీక్ష, ఏకాగ్రత, భావనా సమృద్ధి—ఈ గుణాలు కలిగి అవిశ్రాంతంగా కావ్యసృష్టి చేస్తాడితడు తరతరాల హైందవ విజ్ఞాన సంస్కృతులను నేటి ఆంధ్ర లోకంలో పునఃప్రతిష్ఠ చేయాలనే ప్రయోజన మర్థించి ఇతడు కావ్యరచన కావిస్తున్నట్లు కనబడుతుంది.

## గా యు ప్రో లు

ఆంధ్రజాతి పూర్వాన్వత్యము, తరవాత తెనుగు పడుచుల ప్రణయాలు, నగలు, నోములు, ముగ్ధక్రీడలు, అరటి తోటలు, పొలాల త్రోవలు, పచ్చిబాలెంతలను, పేరంటాండ్రను, పాడి ఆవులను ఎంత సొగసుగానయినా ఈయన ప్రదర్శిస్తాడు. ఈయన కావ్యాలు హాయిగా, ఒయారంగా, ఆరామాల్లో విహారం చేయిస్తాయి.

## అ బ్బూ రి

ఇతనిదొక ప్రత్యేక కంఠరవమే కాని ప్రతిధ్వని కాదు.

## శ్రీ శ్రీ

శ్రీరంగం శ్రీనివాసరావు—అంటే శ్రీశ్రీ—తో మానవోద్యమంలో రెండోతరం పొలిమేరల దగ్గిరకి నవ్యకవిత్వం వస్తుంది. నవ్య కవిత్వావరణలో మరొక కవిత్వోద్యమానికి ప్రతినిధిగా నిలబడ్డాడు.

శరీరమంతా ఒక ఆవరణలో నిలబడగా శిరస్సు బాడి మరొక ఆవరణలోకి చూస్తున్నట్లుంటాడితడు. ఇతడు శబ్దాలమీద, ఛందస్సుమీద అమోఘమయిన అధికారం చెలాయిస్తాడు. ఆంధ్రాంగ్ల సాహిత్యాలతో అతి గాఢమైన స్నేహం ఇతనికి.

## బసవరాజు అప్పారావు

బసవరాజు అప్పారావు వచ్చి గురజాడవారి కావ్యాల్నూ, తన సెలయేటి గానమూ అహరహమూ ఆలపిస్తూ ఉండేవాడు. బసవ రాజింత సూటిగా, తీక్ష్ణంగా తన కష్టసుఖాలను కావ్యాల్లో వెళ్ల బోసుకున్న నవ కవి మరొకడులేడు. అంతరంగ స్నేహితుడూ తానూ ఏకాంతంగా కూర్చున్నప్పుడు దాపరికంలేని అమాయకత్వపు తొందరలో హృదయభావాలు దిగబోసుకున్నట్లు పాటలో, పద్యంలో చెప్పుకునేవాడు. ఆ రోజుల్లో ఎన్నిసార్లు ఏకాంతంలో బసవరాజు కావ్యాలు పాడుకునేవాణ్ణో!

## నండూరి సుబ్బారావు

1921లోనో, 1922లోనో ఒకనాడు సాయంకాలం చామర్లకోట రైల్వేప్లాటుఫారంమీద నేను నిలబడి ఉండగా కొన్నియేండ్ల తరవాత మా నండూరి కనబడ్డాడు. అప్పుడు ముసురుకూడా పట్టి 'పాట పాటగా' చినుకులు పడుతున్నాయి. 'శాస్త్రీ! విను'మని సుబ్బారావు గొంతు విప్పాడు. ఎంత బాగా పాడేవాడు సుబ్బారావు! ఇద్దరం అలాగే ప్లాటుఫారంమీద కూర్చున్నాం. 'గుండె గొంతుకల లోన కొట్లాడుతాది' అని మొదలుపెట్టి తాను వ్రాసిన నాలుగు పాటలూ పాడాడు. నేనూ వినుమన్నాను. 'ఆకులో ఆకునై' అనే నా కృష్ణపక్షంలో మొదటిపద్యం ''అన్వేషణము'' చదివాను. మా బసవరాజు వింటే బాగుండునని అనుకున్నాం.

## దువ్వూరి రామిరెడ్డి

ఇతనిది గొప్ప సంస్కారము; సమగ్ర సుందరమూ, నిర్మలమూ అయినది. ఇతని స్వభావములాగే నిర్దుష్టమూ, స్వచ్ఛ మోహనమూ ఇతని వాణి.

## కవికొండల వెంకటరావు

రాజమహేంద్రవరంలో కవికొండల వెంకటరావుది వింత గొంతు. ఇతడు కర్షకులవద్ద ఆగడు. కూలి అన్నలదాకా పోతాడు. సామాన్య జనానికి ఇంతగా సన్నిహితుడైన తెలుగుకవి ఈ యుగంలో మరెవ్వడూలేడు.

## పింగళి కాటూరి కవులు

పూర్వాంధ్ర మహాకావ్యాలన్నీ మనస్సులో ఇంకగా, ఇంకగా తయారయిన శిల్పమూ, బాణీ వీళ్లది. శాంతసుందరంగా, గంభీరంగా, మహోహిందాగా నడుస్తాయి వీరి భావన, పద్యమూ కూడా.

## శివశంకరస్వామి

వీరు మహావ్యక్తి; వీరే ఒక సంస్థ. ఎన్ని భాషలో వీరెరుగుదురు. కాని సంస్కృత వాఙ్మయం అంటే మోజు ఎక్కువ.

## నాయని సుబ్బారావు

కవిత్వం చెప్పవలసి చెప్పాడు—బసవరాజులాగ. ఆ రోజుల్లో ఆ కావ్యరచనే లేకపోతే అతని జీవితం ఎంతబరువుగా అయిపోయేదో.

## వేదుల

కవిత్వపు లావణ్యాలు, లోతులు వేదులకి తెలిసినంత మరెవ్వరికీ తెలుసునా అని ఆలోచిస్తున్నాను. పాత మాటలే సరికొత్తవయిపోయి పాత వృత్తాలలోనే పడి ఓయ్యారంగాను, ఓరగాను, ఉద్వేగంతోను, ఉల్లాసంతోను ఊగుతూ ఊగుతూ ఇదివరకెరగనివని అనిపిస్తాయి.

## నను భవదీయ దాసుని ... పద్యమునకు మూలము

ఆన్ధ్ర సాహితీ ప్రపంచంలో ముద్దుల మూటగట్టు రచనతో చిరస్మరణీయుడైన నన్ది తిమ్మన ఉపలబ్ధ కావ్యము "పారిజాతాపహరణము." ఇమ్మహాకవి అనుపలబ్ధ కృతులు మూడు. అవి ౧. వాణీ విలాసము ౨. శృంగార గజ రత్నాకరము ౩. త్రిస్థలీ దండకము

పారిజాతాపహరణము ఎంతటి సుందర మృదు శబ్ద విలసితమో, అంతటి క్లిష్టప్రయోగ బంధురము. ఇందులోని అత్యంత జనాదరణ పూర్వకమయిన మనోరమమైన చొక్కపు పద్యమిది.

"నను భవదీయదాసుని మ –
 నంబున నెయ్యపుఁ గిన్క బూని తా –
చిన యది నాకు మన్ననయ
 చెల్వగు నీ పదపల్లవంబు మ –
త్తనుపులకాగ్రకంటక వి
 తానము దాఁకిన నొచ్చు నంచు నే –
ననియెద, నల్క మానవుగ –
 దా యికనైన నరాళకుంతలా!

(పారిజా. ౧–౧౨౩.)

తిమ్మన సామాన్య కవి కాదు. "శ్రీ ఉమామహేశ్వర వర ప్రసాద లబ్ధ సారసారస్వతాభి నంది." పయి పద్యమున చక్కని భావము శృంగార రస ప్లుతముగ తీర్చి దిద్దిన తీరు సహృదయ మనోరంజకము.

కాని ఈ భావన నంది తిమ్మన స్వంతముగాదు. సంస్కృత సాహిత్యంలో 'వాక్పతి'గా ప్రఖ్యాతి గాంచిన ఉత్పల రాజకవి (క్రి. శ. ౯౭౪–౯౯౫) దిగా ఒక శ్లోకము ప్రచారములో గలదు. దానికి ప్రతిధ్వనియే పయి నంది తిమ్మన పద్యము.

శ్రీ వల్లభ – ముఞ్జదేవ – పృథ్వీ వల్లభ – అమోఘవర్ష – ఇత్యాది నామములతో ప్రసిద్ధి గాంచిన వాక్పతి రాజు ఎన్నో గ్రంథ

ములను సంస్కృతంలో రచించెను. కాని విధి వైపరీత్యమున అన్నియు కాలగర్భంలో కలసిపోయాయి. సంస్కృత సంచిత కృతులలో (Anthologies) ఇక్కడిగా ముప్పది పద్యములు రసనిర్భరము లయినవి లభించినవి.

పై ఉదాహరించబడిన నంది తిమ్మన తెనుగు పద్యమునకు మూల మనదగిన శ్లోకను ఇది.

> దాసే కృతాగసి భవత్యుచితః ప్రభూణాం
> పాద ప్రహార ఇతి సున్దరి నాస్మిదూయే!
> ఉద్యత్కఠోర పులకాఙ్కుర కణ్టకాగ్రైః
> యత్ఖిద్యతే తవ పదం నను సా వ్యథా మే॥

వాక్పతి దేవుని పయి శ్లోకమును అర్జునవర్మదేవ రచిత అమరుక వ్యాఖ్య – రసిక సఞ్జీవనీలో 'ఏకస్మిఞ్శయనే' శ్లోకము పట్టున కాంచనగును. మఱియు జల్హణుని 'సూక్తి ముక్తావళి' లోను, శ్రీధరదాసుని 'సదుక్తి కర్ణామృతము'లోను ఉటంకింప బడినది.

ఇందువలన నన్ది తిమ్మన బహుళ కావ్య పరిశీలనాసక్తి విదితమే గదా! ఇక సహృదయులే ప్రమాణము.

## ఉపయుక్త గ్రంథములు


౧ పారిజాతాపహరణము
సంపాదకుడు : తాపీ ధర్మారావు
హైదరాబాదు – ౧౯౬౬.

౨ అమరుకమ్ – రసిక సఞ్జీవనీ సహితమ్
సం॥ నారాయణరామ ఆచార్య
బొంబాయి – ౧౯౫౪.

౩ సూక్తిముక్తావళీ
భగదత్త జల్హణ
సం॥ ఎంబర్ కృష్ణమాచార్య
బరోడా – ౧౯౩౮.

౪ సదుక్తి కర్ణామృతమ్
శ్రీధరదాస
సం॥ రామావతారశర్మ
లాహోరు – ౧౯౩౩.

౫ సంస్కృత వాఙ్మయ చరిత్ర
డాక్టర్ ఎం. కృష్ణమాచారియర్
పరివర్ధిత తృతీయ సంస్కరణ
ఢిల్లీ – ౧౯౭౫.


శ్రీ ఇ. సాయిబాబా

# శైలి - పాశ్చాత్య పండితాభిప్రాయ పరామర్శ*

శైలీ శబ్దం ఈనాడు సర్వత్రా విశ్రుతమైంది. సంస్కృత భాషలో ఈ శబ్దం ఉన్నా అది ఒక సాహిత్య సంప్రదాయంగా రూఢికెక్కింది పాశ్చాత్య సాహిత్యంలోనే. శైలీ సిద్ధాంతం పాశ్చాత్య సాహిత్యంనుంచే మనకు దిగుమతి అయింది.

శైలిని పాశ్చాత్యులు పలువురు వ్యాఖ్యానించారు. కొందరు ప్రత్యేక గ్రంథాలు వ్రాశారు. కొంతమంది అప్పుడప్పుడు అలవోకగా కొన్ని చెణుకుల్ని చెల్లాచెదరుగా విసిరారు. ఇలాంటి చెదురుమదురు నిర్వచనాలను సేకరించి సంకలనం చేసి గ్రంథరూపంలో అందించారు కొంతమంది.

ఈ నిర్వచనాలన్నీ ఆయా పండితుల అనుభవాలూ అభిరుచులూ ఆధారంగా చేయబడ్డవి. శైలివంటి అనుభవైక వేద్యాలయిన విషయాలను గిరిగీసి అందులో కుదించాలని చేసే ప్రయత్నాలు అసమగ్రంగా ఉంటాయి. ఎంత నిర్వచించినా ఎంతో కొంత మిగిలిపోతుంటుంది. అట్లని ఉపలబ్ధ సామగ్రిని ఉజ్జగించం! దొరికే నిర్వచనాల ఆధారంతో కావించే మథనం తత్త్వపరిశీలనానికి తప్పక దోహదకారి అవుతుంది.

ఈ నిర్వచనాలను ప్రధానంగా నాలుగు విధాలుగా వర్గీకరింప వచ్చు. 1. ఆత్మీయతా ప్రధానాలు, 2. భావప్రధానాలు 3. భాషా ప్రధానాలు, 4. ఉభయ ప్రధానాలు.

## ఆత్మీయతా ప్రధానాలు

అరిస్టాటిల్ తన పాయెటిక్స్‌లో భాషాగతిని గూర్చి చర్చించినా ఆత్మీయతకు వ్యతిరేకికాదు. కావ్యానందానికి కారణం ఆత్మీయతే అని అరిస్టాటిల్ భావించాడని మోక్సన్ అభిప్రాయం.[1] వక్తృత్వం విషయంలో అరిస్టాటిల్ తన అభిప్రాయాన్ని ఇలా స్పష్టం చేశాడు.

> వక్త మాటల కొరకే చూచుకోరాదు. శ్రోతలు తనని గురించి ఆలోచించేటట్లుగా తన వ్యక్తిత్వాన్ని వారి ముందుంచాలి. ఆ వ్యక్తిత్వం వల్లనే శ్రోతలు సుముఖులో విముఖులో కావడం జరుగుతుంది.[2]

'శైలి మానవుని శీలానికి ప్రతిబింబం' అని గిబ్బన్ అభిప్రాయం.[3] 'మనిషినిబట్టే భాష ఉంటుం'దని సోక్రటిస్ అభిప్రాయం.[4] 'శైలి వ్యక్తిత్వపు ప్రతిధ్వని' అని లాంగినస్ అభిప్రాయం.[5] 'వ్యక్తికి ప్రవర్తన ఏలాంటిదో రచయితకు శైలి అలాంటి'దని డబుల్యు. బేసిల్ వోర్స్‌ఫోల్డ్ అభిప్రాయం.[6] 'శైలి స్వకీయమైనది. అది వ్యక్తిశీలంలోని భాగం' అని బుఫాన్ భావించాడు.[7] 'మనుష్యుని వ్యక్తి

* నాగార్జున విశ్వవిద్యాలయంలో చదివిన సెమినార్ వ్యాసం.

త్వమే శైలి' అని ఇతడు గంభీరంగా వ్రాక్రుచ్చాడు.[8] ఈ ఫ్రెంచి రచయిత తనకు పూర్వం ఉన్న 'అలంకారమే శైలి' అనే వాదాన్ని పరాస్తం చేశాడు. 'మనిషిని అతని మాటల్లోను రచనల్లోను పట్టి యిచ్చేది శైలి. సరసుడైన వ్యక్తి సౌజన్యం అతని శైలి మూలంగానే గుర్తింపబడగింది' అని లాటిన్ సామెత.[9] 'సాధారణంగా చెప్పాలంటే శైలి రచయిత మనస్సుకి ప్రతిబింబం. ఉదాత్త శైలీ ప్రయోక్త కాదలచిన రచయిత ఉదాత్తశీలి కావాలి' అని గెథే.[10] 'శైలి కవి ఆత్మీయతతో అవినాభావ సంబంధం కలది. అది అతని నైతిక మానసిక జీవనానికి అక్షరాకృతి' అని ఇ.పి. ష్లిఫెల్.[11] 'రచయిత శైలి అతని ముఖాకృతిని హృదయ స్పందనాన్నీ పోలినది. రచయిత మనోవ్యాపారాలకు లోబడి వర్తించే దేహభాగమే శైలి' అని ఫెనొలాన్.[12] 'ఒక మహారచయిత చెరపరాని ఆత్మీయతా ముద్రాంకితమైన శైలిని నిర్మిస్తాడు. అట్టి శైలీ నిర్మాత అనామకుడుగా ఉండడానికి వీలు లేదని వాల్టేర్ నిశ్చయం.[13] 'ఒక రచయిత సహజ శైలిని గాంచినప్పుడు ఆ రచనచేసిన వ్యక్తినే కనుగొన్నంతగా ఆశ్చర్యానందాలు కలుగుతాయి' అని పాస్కాల్.[14] 'ఆత్మాకృతియే శైలి' అని షోపెన్‌హాయెర్.[15] 'వాగ్రూపాన్ని ధరించిన మనస్సే శైలి' అని ఎమర్సన్.[16] 'మహాకవులు గ్రంథరూపంగా వారి ఆత్మను మన ఆత్మలోకి ప్రసరింపజేస్తారు' అని డబ్ల్యు. ఇ. చానింగ్.[17] 'ఉత్తమ గ్రంథంలో రచయిత జీవన సర్వస్వం ఉంటుంది' అని మిల్టన్.[18]

ఇంతమంది విమర్శకులు శైలిని ఆత్మీయతతో అభేదమైన దానినిగా పరిగణించారు. వీరిలో లియో స్పిట్జర్ అగ్రగణ్యుడు. ఇతనిపై ఫ్రాయిడ్ ప్రభావం అపారంగా వుంది. కావ్యపరిశీలనం, కవి మనః పరిశీలనం, సమన్వయం అనే మూడంశాలతో సమ్మిళితమైంది ఇతని భాషాకృషి.

ఆత్మీయత అంటే కవి భౌతికజీవితమనేపాశ్చాత్యుల తలంపు మనం మానసికస్థితినీ కలుపుకోవచ్చు. ఈ భౌతిక మానసిక పరిస్థితులు కావ్యంలో ప్రతిఫలించినా విమర్శకులు గుర్తించడం కష్టం. సమకాల కవుల రచనలలోనే వారి జీవితాంశాలు అన్వేషించడం అసాధ్యం. ఇక ఎన్నో వందల సంవత్సరాలనాడు కాలగర్భంలో కలిసిపోయిన పూర్వకవుల జీవితాలను పసికట్టి, అందలి విశేషాలు వాళ్ల కావ్యాల్లో యెంతవరకు ప్రతిబింబించాయో కనుగొనడం అసాధ్యమని వేరేచెప్పడమెందుకు? తెలుగు కవుల విషయంలో మరీ కష్టం! వీరికి—ఆధునికులలోనూ చాలా మందికి — స్వీయచరిత్రలు వ్రాసుకునే అలవాటులేదు. పైపెచ్చు తమ జీవిత విశేషాలు పాఠకులకు అనవసరమని కొందరు ఆధునికులు భావిస్తున్నారు కూడా!

ఆత్మీయతా పద్ధతి ప్రకారమైతే తమ గ్రంథంలో తమ జీవిత విశేషాలు ఎలా ప్రతిఫలించాయో నిరూపిస్తూ రచయితలు స్వయం వ్యాఖ్యలు సంతరించాలి. లేదా సన్నిహితులచేత వ్రాయించుకోవాలి. ఇంతజరిగినా ఫలితం శూన్యం. ఇందువల్ల కావ్యవిమర్శ పరిధి సంకుచితమై జీవిత చరిత్ర రచన అవుతుంది.

అదీగాక కావ్యాలలోని ఆదర్శాలనుబట్టి ఆ కవి ఉత్తమశీల సంపన్నుడని అంచనావేయడం సరికాదు. త్రికరణశుద్ధిగల కవులు ఎందరుంటారు? చాలామంది కవులు తమ జీవితంలో ఆచరించేది ఒకటి, కావ్యాలలో వర్ణించే ఆదర్శం ఇంకొకటి. అందుకనే ఛార్లెస్ కింగ్‌స్‌లీ హెచ్చరిస్తాడు— తన రచనమబట్టి తన గాంభీర్యాన్ని కొలవవద్దని! అట్లని మనం ఆత్మీయతకు తిలోదకాలిచ్చి అనుకరణ చక్రవర్తులకు అంజలి ఘటించలేం!

కవి వాస్తవిక జీవిత ప్రవృత్తీ, మానసిక జీవన ప్రవృత్తీ, ఒక్కటే అయితే అతడు మహానుభావుడూ మహర్షీ అయిన కవి. ఏ దేశంలోనైనా ఇటువంటి కవులు ఒకరిద్దరు మాత్రం ఉంటే ఉండవచ్చు. తెలుగుదేశంలో పోతన తాదృశుడైన కవి. అందుకే ఆయన కవిత్వం, ఆయన వ్యక్తిత్వం ప్రజాభిమానాన్ని చూరగొన్నాయి.[19]

పాశ్చాత్య విమర్శకు లందరూ ఆత్మీయత అంటే వాస్తవిక జీవితం అని నిస్సారమైన వాదాన్ని లేవదీశారు. వాస్తవిక జీవితానుభవం కల కవే విశద వర్ణనం చేయగలడనీ, తదితరులు అలా చేయలేరనీ వారి అభిప్రాయం. క్రాంతదర్శనత్వం, ఆంతరంగిక భావన కొరవడిన కవులకు ఇటువంటి అనుభవాలు అవసరమే. క్రాంతదర్శులూ, ఆంతరంగికభావనా శోభితులైన కవులు వాస్తవికానుభవం లేకపోయినా భావనాపటిమచేత ఊహాబలంచేత, వాస్తవికానుభవం కలవారికన్న మిన్నగా వర్ణింపగల శక్తిసామర్థ్యాలు కలవారవుతారు. ఇట్టివారే దార్శనికులైన కవులు.

అందుచేత కవికి భావన ప్రధానం. అట్టి భావనా గమనాన్ని అనుసరించే భాషాగమనం ఉంటుంది. అదే శైలి. తద్భావ భావనం కవి ఆత్మీయతా, శక్తి సామర్థ్యాలపై ఆధారపడి ఉంటుంది. అందుచేత సమకాలీన కావ్యకర్తల ఆత్మీయతను గూడ వారి కావ్యాలలోని ఆంతరంగిక సాక్ష్యాలు (ఇంటర్నల్ ఎవిడెన్సెస్) ఆధారంగా పునర్నిర్మాణం (రికన్‌స్ట్రక్షన్) చేయాలి. అటువంటి పునర్నిర్మితాత్మీయతా శక్తి సామర్థ్యాలమీదనే శైలి ఆధారపడి వుంటుంది.

## భావ ప్రధానాలు

శైలిని భావ ప్రధానంగా భావించి నిర్వచించిన పండితులు కొందరు ఉన్నారు. 'రచయిత సమున్నత భావ సంపన్నుడైతే దాన్ని అతడు సమున్నతంగానే వ్యక్తీకరించగలడు. భావం ఎంత తీవ్రమో వ్యక్తీకరణం అంత తీవ్రంఅవుతుం'దని ఎమ్మెన్స్ నిశ్చయించాడు.[20] 'అధికంగా ఆలోచించేవ్యక్తి భావానుగుణమైన సంక్షిప్తతతో పలుకగలుగుతాడు. అతడు సరళమైన భాష మూలంగానే భావ ప్రకటన చేస్తాడు. ఎంతటి పెద్ద ఆలోచననైనా సాధ్యమైనంత తక్కువ పదాలలోకి కుదించివేస్తా'డు' అని వాషింగ్‌టన్ ఇర్వింగ్ వక్కాణించాడు.[21] ఈ నిర్వచనాలనుబట్టి చూస్తే సంక్షిప్తతకూ, స్పష్టతకూ భావపుష్టిప్రధానమని తేలుతుంది. 'సత్యం ప్రపంచవ్యాప్తం అయ్యేందుకు శైలి దోహదం చేస్తుందని బాంక్రాఫ్ట్ భావిం

చాడు.[22] గడ్డిపూలను చూచి వాటిక్రింద బంగారు గినులు ఉన్నాయని భ్రాంతి పడేటట్లు కేవల ధారాశుద్ధినే మంచిశైలిగా అపోహ పడవద్దని లాంగ్‌ఫెలో పాఠకులను హెచ్చరించాడు. ధారాశుద్ధి చాటునగల భావగాంభీర్యాన్ని కూడా దృష్టిలో ఉంచుకొన్నప్పుడే శైలి ద్యోతమానమవుతుంది.[23] ఉదాత్త భావమూలంగానే శైలి స్వీయమై అనుకరణానికి అలవికాకుండా అలరారుతుంది.

## భాషా ప్రధానాలు

శైలిని భాషా ప్రధానంగా కొందరు పండితులు భావించి నిర్వచించారు. 'స్వచ్ఛతయే శైలీ సంబంధమైన సల్లక్షణం. అది భావనారహితం కారాదు. సామాన్య పదజాలంతో కూడిన రచన స్వచ్ఛతమంగా ఉంటుంది కాని అటువంటిది భావనాస్థాయిని సరిగా పోషింపజాలక పోవచ్చు' అని అరిస్టాటిలు భావన.[24] సాహిత్యశైలీ, వాదశైలీ భిన్నంగా వుంటాయనీ, సాహిత్యశైలి వాదశైలి కన్నా నిర్దుష్టంగా వుండాలనికూడా అరిస్టాటిలు అభిప్రాయపడ్డాడు.[25]

అరిస్టాటిల్ అనంతరం అతని అడుగు జాడల్లో నడుస్తూ, కొన్ని కొత్త విశేషాలు కలిపి డెమిట్రియస్ On Style అనే గ్రంథం రచించాడు. అందులో అతడు శైలిని నాలుగు విధాలుగా విభజించాడు అవి — గంభీర శైలి (స్టేట్‌లీ స్టయిల్), మృదుశైలి (పాలిష్‌డ్ స్టయిల్), ఋజుశైలి (ప్లెయిన్ స్టయిల్), తీవ్రశైలి (పవర్‌ఫుల్ స్టయిల్) అనేవి.[26] గంభీరశైలి దీర్ఘాక్షరాలతోనూ, పరుషాక్షరాలతోనూ, కవి కల్పిత పదాలతోనూ కూడింది. మృదుత్వానికి ఇందులో తావులేదు[27] మృదుశైలి సంక్షిప్తం, సుందర శబ్ద సందోహ సంయుతం. ఋజుశైలి ప్రసిద్ధాలూ, వ్యస్తాలూ అయిన పదాలతో కూడివుంటుంది. తీవ్రశైలిలో ప్రాతవడ్డ మాటలు ఉండవు. దీర్ఘవాక్యాలూ ఉండవు. అలతిఅలతి వాక్యాలు ఉంటాయి.[28]

'శైలి అంటే సరైనచోట్ల సరైన మాటలు పడడం' అని స్విఫ్ట్ అభిప్రాయం.[29] 'ఎన్ని పుటలు చదివినా ఏ మాత్రమూ భాషా క్లేశ మనిపించకూడద'ని కాలెరిడ్జి హెచ్చరిక.[30] 'రచనలోని అనావశ్యకతను ఆడంబరాన్నీ పరిహరించగా మిగిలిందే స్వచ్ఛశైలి' అని మాడ్ నెక్కార్.[31] 'ఒక మహారాజు సంక్షిప్తాజ్ఞలోనే ఠీవి ఉట్టి పడేటట్లుగా ఋజుశైలిలోనే హుందాతనం ఉంటుం'దని సౌత్ భావన.[32] ఈ నిర్వచనాన్నిబట్టి త్రివిధశైలీ భేదాల్నిగుర్తింపవచ్చు— ప్రభు మిత్ర కాంతా సమ్మతాలు 'శైలి అంటే కళాత్మకంగా పదాలను కూర్చటం అని ఎన్‌సయిక్లోపేడియా బ్రిటానికా నిర్వచనం.[33] ప్రతి మహారచయితకూ అధికమైన నుడికారం ఉంటుంది. అదే అతని శైలికి జవాన్నీ జీవాన్నీ చేకూరుస్తుంది' అని లాండార్ అభిప్రాయం.[34] కానీ బెర్నార్డుషా తన రచనలలోని జాతీయాలవల్ల అన్య దేశీయులకు విషయావగాహనం గహనమౌతుందని వాటిని విసర్జించాడు. నిఘంటు సహాయంతో ఇతర దేశీయులు తన భాషను అర్థం చేసుకోవాలని షా సంకల్పం. వాల్టేర్ ఫ్రెంచి భాషను ఈ విధంగానే ప్రయోగించాడు. కాని షా చివరకు జాతీయాలు భాషా సౌష్ఠవానికి అనివార్యాలని తన అభిప్రాయం మార్చుకొన్నట్లు కన్పిస్తుంది.[35]

ఈ నిర్వచనాలను బట్టిచూస్తే స్పష్టత, సంక్షిప్తత, సుకరత, జాతీయత మొదలైన గుణాలు గలిగిన పదాల పొందికా, వాక్య విన్యాసమూ గల భాష శైలికి జీవమని అవగతమౌతున్నది. ధ్వని, వర్ణ, పద, వాక్యాలు భాషా విషయంలో ప్రధానాంగాలు. వ్యక్తీకరణ పటుత్వంగల శబ్ద ప్రయోగం, సమాంతర స్థితి, లయ, నాద సమ్మేళనం — ఇవి ఉత్తమ రచనాగత భాగాలు. వీనికితోడు ఆవేశజనకత్వం, అవయవానురూపత, శ్రావ్యత, వైవిధ్యం, నాగరకత, హాస్యం మొదలైన లక్షణాలూఉంటే ఆ రచన సర్వోత్కృష్టమవుతుంది. శబ్దాలు గ్రాంధికాలా, వ్యావహారికాలా, గ్రామ్యాలా, ప్రాచీనాలా, నవీనాలా, మాండలికాలా, గ్రామీణాలా, వృత్తి సంబంధులా, అన్యదేశ్యాలా, సాంకేతికాలా అని ఆలోచించాలి. విషయోదాత్తతను బట్టి తత్తద్భాషాగత శైలీ భేదాలు ఉపదేయాలు.

కవులు సాధ్యమైనంతవరకు ప్రాతవడ్డ మాటలను పరిహరిస్తూ ఉంటారు. కొందరు కవులు విషయం ప్రాచీనమైనప్పుడు పాత పదాలు వాడుతారు. కొందరు కవులు ప్రాచీన పద పునరుజ్జీవనానికి కంకణం కట్టుకుంటారు. ఇది అవాంఛనీయం. రచనాప్రవీణుడైనవాడు పాత పదాలనే అధిక చమత్కారంతో ప్రయోగిస్తాడు.

గొప్ప రచయిత శబ్దాలను ఎంపిక చేసుకుంటాడు. ఆ ఎంపికకు వ్యవధానమూ ఆకాంక్షా తోడైతే ఆ రచన రసజ్ఞ రసాయనమే. శబ్దార్థాన్ని సమగ్రంగా గ్రహించి సుందరంగా ప్రయోగిస్తే స్వర్లోకంలో కామధేను క్షీరం క్రోలినంత ఆనందం అందిస్తుందని పతంజలి అభిభాషణం. కవి భావోద్రిక్తుడై రచనకు పూనుకొని శబ్దాలకు చేయి ఊపితే 'నేనే వచ్చెద నేనే వచ్చెదను నేనేవత్తు నేవత్తునే నేనే నేనని వచ్చి మీద' బడతాయి. అప్పుడు ఆ కవి 'ఎద్దాని గైకొందు మెద్దానిన్ వీడెద'మని ఉక్కిరి బిక్కిరి అవుతాడు. ఒకే సందర్భానికి సరిపోయే పదాలు కోకొల్లలుగావున్నా లయాన్విత సమయోచితధ్వని విన్యాసంగల పదాలనే గ్రహించాలి. ద్రాఘిష్ఠ సమాసం వెనువెంటనే అల్పిష్ఠ పద సంఘటనం సరసంగా వుండదు. ఈ విధంగానే కర్తృ కర్మ క్రియాక్రమం పాటించడంగాని తప్పించడంగాని సందర్భోచితంగా సమకూర్చాలి. కాళిదాసు 'నఖలు నఖలు బాణః', తిక్కన ''వచ్చెడువాడు ఫల్గుణుడు'', మొల్ల 'కంటిన్ జానకి' ఇందుకు నిదర్శనాలు. ఎంత భాషాభివృద్ధి జరిగినా, భాషభావానికి సమగ్రసాధనం కాజాలదు. అందుచేత వాచ్యంగా సాధింపలేని భావాలను మహాకవి ధ్వని ద్వారా సాధిస్తాడు.[36]

## ఉభయ ప్రధానాలు

శైలిని భాషా భావోభయమయంగా కొందరు భావించారు. ఆలోచనలో, పద సంఘటనంలోవున్న అస్పష్టత, కృతకత్వంశైలిని దోషదూషితం చేస్తాయని ఆయన ఉద్ఘాటన[37] మన భారతీయులు అతి ప్రాచీన కాలంలోనే వాగర్థ దాంపత్యాన్ని అర్ధనారీశ్వర భావంతో సందర్శించి ఆరాధించారు.[38]

కవులు కొందరు కేవలం ఆడంబర పద ప్రయోగంతోనే తృప్తిపడి తమ శైలిని సమకూరుస్తారు. కొందరు అర్థవంతమైన పద ప్రయోగాన్నే కావిస్తారు. కాని చాలా కొద్దిమంది మహాకవులు అంటే కాళిదాసాదులు రంగూ రుచీ వాసనాగల శబ్దాలతో తమ శైలిని గుబాళింపజేస్తారు.

ఉత్తమశైలి త్రివేణీ సంగమం. అందులో భావగతి గంగానది. భాషాగతి యమునా స్రవంతి. కవి ఆత్మీయత సరస్వతీ స్రోతస్విని.

## అధోజ్ఞాపికలు


1 Aristotle's Poetics & Rhetoric, T. A. Moxon, Introduction, London : J. M. Dant & Sons Ltd., 1955, P. viii.

2 F. L. Lucas, Style, p. 50.

3 Ibid. p. 51.

4 Ibid.

5 Ibid p. 50

6 Judgement in Literature, p. 106 – 107.

7 The New Dictionary of Thoughts, London : Universal Text book Limited.

8 Alan warner, A Short guide to English style, 3rd ed; The English Language Book Society, 1975, p. 2

9 The New Dictionary of Thoughts.

10 Ibid.

11 Ibid.

12 Ibid.

13 Ibid.

14 Ibid.

15 Ibid.

16 Alan warner, p. 2.

17 సాహితీ వాల్లభ్యం, తణుకు : నరేంద్రనాథ సాహిత్యమండలి.

18 అందే.

19 తుమ్మల సీతారామమూర్తి, నా కథలు, 1973. పు. 125. కవి గుమ్ములతని...అనే పద్యం.

20 The New Dictionary of Thoughts.

21 Ibid.

22 Ibid.

23 Ibid.

24 Aristotle, Poetics, Ed. Dr.Omprakash, 3rd ed; Bareilly (U. P.) : Prakash Book Depot, 1972, p. 139.

25 భాగవతుల కుటుంబరావు, "ప్రాచ్య పాశ్చాత్య సాహిత్య సిద్ధాంతములు", ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక ౪౧ – 1 - 6.

26 Demetrius, On Style, Tr. T.A. Moxon, London J. M. Dant & Sons Ltd , p. 209.

27 Ibid. p. 213.

28 Ibid.

29 "నిత్య సత్యాలు", ఆంధ్రజ్యోతి దినపత్రిక, మే, 24, 1977.

30 The New Dictionary of Thoughts.

31 Ibid

32 Ibid.

33 Artistic arrangement of words.

34 The New Dictionary of Thoughts.

35 The Complete BernardShaw Prefaces, London 1965 p. 677

36 The Dictionary of Thoughts.

37 Ibid.

38 కాళిదాసు, రఘువంశం. ౧-1.


శ్రీ చెరెడ్డి మస్తాన్ రెడ్డి

# పేదరాసి పెద్దమ్మ
# పేదరాలు పెద్దమ్మ

కథలకు కాళ్ళూ చేతులూ లేవంటారు. అంటే కథల్లో చెప్పేవన్నీ అబద్ధాలనీ, అవిశ్వసనీయాలనీ అభిప్రాయం. అవి వినోదానికి మాత్రమే ఉపయోగిస్తాయి. ఈ కథలు శతాబ్దాలనుండీ వస్తున్నవే! హంసవింశతి, శుకసప్తతి, తోతీనామా కథలు, విక్రమార్కుడి కథలు, భేతాళ కథలు మొదలైనవి ఎన్నో ఉన్నాయి.

ఈ కథలు కొన్నింటిలో రాజకుమారుడు, మంత్రి కొడుకు మున్నగువారు కొత్త పట్టణాలకు వెళ్ళడం, అక్కడ పేదరాసి పెద్దమ్మ యింట్లో బసచేసి, పట్టణంలోని విశేషాలు తెలుసుకొని తమ భావి కార్యాలను నిర్ణయించుకోవడం మొదలైన విషయాలు కానవస్తాయి. కథాంశం అవాస్తవికంగా ఉన్నా, ఆ కథలవల్ల అప్పటి సాంఘిక పరిస్థితులు కొన్నిటిని గ్రహించవచ్చును. పేదరాసి పెద్దమ్మ సంగతినే ఉదాహరణకు తీసుకుందాం.

రాజుగారి రాజధానిపట్నంలో అప్పుడు పూటకూళ్ల యిల్లు ఉండేది. దాన్ని నడిపేది వయసు మీరిన మహిళ. బసకూ, భోజనానికీ కూడా సౌకర్యంగా ఆ గృహం ఉండేది. పై వూళ్లనుండి వచ్చేవారే గాని, ఉన్న ఊరి వారెవ్వరూ అక్కడికి వెళ్లరు. అక్కడ తిను బండారాలు అమ్మడం ఉన్నట్లు కానరాదు. పెద్దమ్మ యిల్లు ఒక్క లేయిూ మాదిరిది ఉన్నట్లు ఊహించవచ్చును. ఆమె గొప్ప తెలివితేటలు కలది. రాజ్యపు వ్యవహారాలు; రహస్యాలు ఆమెకు తెలిసి వుండేవి. రాజాంతఃపురంతో కూడా ఆమెకు పరిచయం ఉండునట్లు కొన్ని కథలవల్ల తెలుస్తున్నది. రాజుతోనూ, ఆయన కుటుంబ సభ్యులతోనూ కూడా పెద్దమ్మ మాట్లాడుతూ ఉండేదట!

పేదరాసి పెద్దమ్మ అనే పేరునుబట్టే ఆమె దరిద్రురాలని తెలుసుకోవచ్చు. పై ఊళ్లనుంచి వచ్చేవారివద్ద ఆమె ఎక్కువ సొమ్ము తీసుకోవచ్చు. కాని ఆమె అలా చెయ్యదు. తనకు దినం గడుస్తే చాలుననుకొంటుంది. అంచేతనే ఆమె ఎప్పుడూ పేదరాలు గానే ఉండిపోయింది.

పతివ్రతా చరిత్ర మొదలైన గ్రంథాలలో పేదరాసి పెద్దమ్మకు బదులు ''పేదరాలి పెద్దమ్మ'' అని ఉన్నది. ఆ పుస్తకం చూచిన తర్వాత ఆ పేరే సరియైనదై ఉంటుందని తోచింది. కాని మన పెద్దలు వినిపించే కథలలో మాత్రం పెద్దమ్మ పేదరాసి పెద్దమ్మగానే వుంటున్నది. ఈ రెండింటిలోనూ ఏది సరియైనది? అని ప్రశ్న వచ్చినప్పుడు అర్థాన్నిబట్టి ''పేదరాలు'' పదం, లోకంలోని వాడుకనుబట్టి ''పేదరాసి'' పదం—రెండున్నూ గ్రహించదగినవే అని తోస్తున్నది.

**"అంగీరస"**

# కావ్యము - కొలతలు

పూర్వం మహాకావ్యం పద్దెనిమిది పర్వాలైతే—ఆధునికుల మహాకావ్యం పద్దెనిమిది పేజీలంటారు కుందుర్తి. ఈ మాట పలికిన కుందుర్తి కవిత్వ పరిమాణంలో ఏర్పడిన పరిణామానికి జవాబు నీయవలసి వచ్చినప్పుడు మినీకవితను నికార్సైన కవితారూపంగా అంగీకరించడానికి వెనుకాడుతున్నారు. కాని నేటి కవులలో కొందరు పద్దెనిమిది పర్వాలను మరచి, పద్దెనిమిది పేజీలను కాదని, పద్దెనిమిది చరణాలను పట్టించుకోక పద్దెనిమిది అక్షరాల మినీకవిత సైతం హృద్యమైన కావ్యంయొక్క స్థానాన్ని ఆక్రమించుకోగలదని విశ్వసిస్తున్నారు. ఇది మినీ కవితాయుగమంటున్నారు. గ్రంథరచనలో ఈ పరిణామానికి సంబంధించిన పరిణామానికిగల హేతువులను అన్వేషించడం ఈ వ్యాసంయొక్క పరమార్థం.

తెలుగులో మొదటిగా గుర్తింపు పొందిన గ్రంథం మహాభారతం. దాని ననుసరించి రామాయణ, హరివంశ, మహాభాగవతానువాదాలు వెలిసాయి. 11వ శతాబ్దినుండి 15వ శతాబ్దిదాకా ఈ గ్రంథాల రచనాకాలం విస్తరించింది. ఇవన్నీ ఉద్గ్రంథాలే. ఈ మధ్యలోనే పై గ్రంథాలకంటె పరిమాణంలో కొంత చిన్నవైన పురాణానువాదాలు వెలిసాయి. ఆ తర్వాత వచ్చింది ప్రబంధయుగం. ఈ యుగంలో పుట్టిన మనుచరిత్ర, వసుచరిత్ర, పారిజాతాపహరణాది కృతులన్నీ పై గ్రంథాలకంటె చిన్నవి. మన సాహిత్యంలో మైలురాళ్లవంటి గ్రంథాలను ఎన్నుకొంటే ప్రబంధాల తర్వాత దక్షిణాంధ్రయుగంలో విజయవిలాసంవంటి మూడాశ్వాసాల గ్రంథాలు, ఆ తర్వాత ఏకాశ్వాస ప్రబంధాలు అవతరించేయి. ఇందుకు అపవాదాలున్నా అవి కేవలం అపవాదాలు మాత్రమే. సజీవమైన సాహిత్యాన్నే లెక్కలోకి తీసుకోవాలనుకుంటే దక్షిణాంధ్రయుగం తర్వాత ఆధునికయుగాన్నే పరిగణించాలి. ఆధునికయుగం ఖండకావ్యాలతో ఆరంభమయింది. అభ్యుదయ సాహిత్యంలో కావ్యం అనే స్పృహ తగ్గి ఖండికలకు ప్రాధాన్యం హెచ్చింది. ఖండికల కాలమే నేటికీ నడుస్తున్నా మినీకవిత అధునాతన కవితాస్వరూపమని తర్జన భర్జనలు జరుగుతున్నాయి. కాలం ఈ పరిణామానికి నేతృత్వం వహిస్తుందా? కవుల, పాఠకుల అభిరుచి ఈ మార్పుకు ఊర్పునిస్తుందా? ప్రక్రియ ఈ గమనానికి దారిచూపుతూందా? విషయం ఈ వైఖరికి వెన్ను తట్టుతుందా? మానవేతిహాసం ఈ మలుపును మదింపు వేస్తుందా? ''నానాటికి తీసికట్టు నాగంభట్లు'' అన్నట్లు ఇది కవుల ప్రతిభాలోపంవల్ల ఏర్పడిన పరిస్థితా అన్న విషయాలు ఆలోచించాలి. అన్నిటికంటె ముందుగా చెప్పవలసిన విషయం ఒకటుంది. కవుల హృదయాలను శాసించే సత్తా ఎవరికీలేదు.

ఆధునిక మానవుడికి ప్రతినిమిషం విలువైనదిగా మారింది. అతని జీవితం అనేకానేక సమస్యలతో సంక్లిష్టంగా తయారయింది. ఆ కారణంగా కవికి - పాఠకునికి ఉద్గ్రంథాలు రచించే—పఠించే తీరిక లేదని కొందరి అభిప్రాయం. కాబట్టి కాలం ఆధారసూత్రంగా గ్రంథపరిమాణం నానాటికీ తగ్గుతూ వస్తుందన్న ఆలోచన ఏర్పడింది. ఇది వాస్తవమైతే నన్నయకాలం కంటె పెద్దన కాలానికి, పెద్దన కాలంకంటె చేమకూర కాలానికి ప్రజలకు తీరిక తగ్గిందని అనవలసివస్తుంది. అంతేకాదు. వ్యాసుని కాలంకంటె కాళిదాసు కాలానికి,కాళిదాసు కాలంకంటె క్షేమేంద్రుని కాలానికి ప్రజల సాహిత్యాస్వాదనానికి తగినంత తీరిక లేకపోయిందనాలి. ఏ సాహిత్యాన్ని పరిశీలించినా వివిధ కాలాలకు చెందిన రచనలకు ఈ సూత్రాన్నిఅన్వయించి చూడవలసి వస్తుంది. అందుచేత ఈ తీరికలేనితనం అనే కారణం సార్వత్రిక సూత్రంకాదు. భారతం రాసిన చేత్తో తిక్కన నిర్వచనోత్తర రామాయణం రాసేడు. శ్రీనాథుడు హరవిలాసం రాసినకాలంలో పోతన మహాభాగవతాన్ని ఆంధ్రీకరించేడు. గురజాడ పూర్ణమ్మకథ రాసిన తర్వాత విశ్వనాథ రామాయణ కల్పవృక్షాన్ని రాయడం జరిగింది. శ్రీశ్రీ మహాప్రస్థానం రాసిన తర్వాత నారాయణరెడ్డి కర్పూర వసంతరాయలు రాసేడు. ఇంద్రగంటి శ్రీకాంత శర్మ మినీపలుకులు పలుకుతూవుంటే పుట్టపర్తి నారాయణాచార్యులు జనప్రియ రామాయణం బాలకాండను వెయ్యిపేజీల్లో వెలువరించేరు. సమగ్ర ఆంధ్ర సాహిత్యాన్ని తీరికగా రాసిన ఆరుద్ర తీరికలేక మరో త్వమేవాహాన్ని రాయలేదా? మహేంద్రోదయాన్ని

మచ్చుచూపించిన దాశరథి అక్కడో కందం ఇక్కడో కస్లెట్టూ కాలం చాలకనే రాస్తున్నారా? కవిత్వం సంగతే ఇలాగుందని అనుకుందామా! మన నవల స్థిరపడిన రోజుల్లో వేయిపడగలు—మాలపల్లి—నారాయణరావు వచ్చాయి కదా! ఆ తర్వాత ఆ రచయితలు గాని, ఇతరులు గాని అంత ప్రమాణంగల నవలలు రాసేరా? కన్యాశుల్కం ప్రతాపరుద్రీయంవంటి పెద్ద నాటకాలు ఆ తర్వాత రాకపోవడానికి కాలానికీ ఏమైనా సంబంధముందా? రామాయణ విషవృక్షం మూడు వాల్యూములు సుచ్చటగా చదువుకుంటూన్న చదువరులంతా కేవలం తీరిక చిక్కిన కొద్ది సమయంలో కాలక్షేపం బఠానీల్లాగా చదివి అవతల పారేస్తున్నారా? పాఠకుల సంఖ్య పూర్వం కంటె నేడే ఎక్కువ అనడంలో సందేహంలేదు. బరువైన విషయాన్ని తీరిక చేసుకుని చదువుతున్నారు. తేలికైన-చదువదగిన విషయాన్ని తీరికలో చదువుతున్నారు. ఆసక్తిలేని అనవసర విషయాలను అసలు చదువరు. అందుచేత కవిత్వ పరిమాణంలోని పరిణామానికి కాలమే ఆధారసూత్రం కాదు.

ఈ రోజుల్లో ఉద్గ్రంథాన్ని రచిస్తే దాన్ని "చాటభారతం" అని పరిహసించడం పరిపాటి అయింది అలాంటి రచనలను 'తలగడ'గా ఉపయోగించుకోవచ్చుననే చమత్కారాలు కూడా ఎక్కువయ్యాయి. 'ఏజ్ఞలవారి బృహత్తు' అని వ్యవహరించడం ఇలాంటిదే. అంటే పాఠకుల అభిరుచి ఆవిధంగా వుంటని అనుకోవచ్చును. సంస్కృత భాషలో పంచకావ్యాలు పుట్టిన కాలానికే ఈ అభిరుచి వుందని తెలుస్తోంది సాహిత్యంలో రసానికి ప్రాధాన్యం ఎప్పుడేర్పడిందో అప్పటినుండీ గ్రంథపరిమాణం తగ్గుతూ వచ్చింది. "అస్తు నామా నిస్సీమా అర్థసార్థః కింతు రసదేవ నిబంధనం యుక్తః" అన్నాడు లొల్లటుడు 'అర్థవ్యాపారం సీమారహితమైనదైనా అందులో రసవంతమైన దానినే కవి గ్రహించాలని పై వాక్యార్థం. ఈ మాటనే ఆనందవర్ధనాదులు తిరిగి చెప్పేరు. ఇతివృత్తమాత్ర నిర్వహణంవల్ల కవి ఆత్మపద లాభాన్ని పొందలేడన్నారు. సరంతర రసోద్గార గర్భ సందర్భ నిర్భరములైన కవుల వాక్కులు కథామాత్రాశ్రితాలు కావన్నారు. రమణీయార్థ ప్రతిపాదకమైతే వాక్యమే కావ్యమన్నారు. ఒక్క ముక్తకం నూరు ప్రబంధాల ఎత్తు కాగలదన్నారు. ఇదంతా అభిరుచికి సంబంధించిన అంశం. ఈ అభిరుచి కొంతవరకు గ్రంథప్రమాణాన్ని తగ్గించడానికి కారణమైతే-అపూర్వతా సంపాదనకోసం కవుల అన్వేషణ కొనసాగడంవల్ల మరి కొంత ప్రమాణం తగ్గుతూ వచ్చింది. మహాభారతం ఒక దేశం యొక్క సంప్రదాయాన్ని, కొన్ని తరాలకు చెందిన అనేకుల జీవితాలను, మానవుని ఔన్నత్యాన్ను—బలహీనతలను కొల్లగొట్టి ఒక సమగ్రతను సాధించింది! ఆ తర్వాత ఆ విధమైన సమగ్రత వేరొక గ్రంథానికి రాలేదు. రసదృష్టితో ఏదో ఒక అంశాన్ని గ్రహించి విస్తరించడమే తర్వాత కవుల అభిరుచి అయింది. ఇలాగే వేయిపడగలు—మాలపల్లివంటి నవలలు తమ దృక్కోణానికి అనువుగా వున్న సమస్త విషయాలను గ్రహించి ఒక సమగ్రతను సంతరించుకున్నాయి. ఆ తరువాత వచ్చిన నవలల్లో అధికశాతం ఒక వ్యక్తికి లేదా కుటుంబానికి సంబంధించిన సమస్యను లేదా సమస్యలను మాత్రం గ్రహించడం కనిపిస్తుంది. కన్యాశుల్కంలో కానిస్టేబుల్ దగ్గరనుండి సౌజన్యారావుపంతులు వరకు ఒక్కొక్క పాత్ర వెనుకా ఒకొక్కలోకం దాగివుంది. ఆ తర్వాత వచ్చిన నాటకాలకు ఆ విధమైన సమగ్రతలేదు సమగ్రతను కాక ఏకదేశాన్ని లక్ష్యంగా చేసుకున్న అభిరుచి గ్రంథపరిమాణం తగ్గడానికి కారణంగా కనిపిస్తుంది. కొంచెం చెప్పదలుచుకున్నప్పుడే చక్కగా చెప్పగలమనే ఆలోచన కూడా ఇందుకు కారణం కావచ్చును.

ప్రక్రియ కూడా గ్రంథపరిమాణం తగ్గడానికి—హెచ్చడానికి కొంతవరకు దోహదకారి అయింది. నాటకం ఐదంకాలు గాని—ఏడంకాలు గాని వుండాలని; నాయక విజయంగాని, వివాహంగాని ప్రయోజనంగా కలిగి వుండాలని గాని నియమాలుండడం మనకు తెలిసినదే. ఇంచుమించుగా ఐదునుండి ఎనిమిదాశ్వాసాలకు మించి మన ప్రబంధాలు పెరుగలేదు. వీనిలో కూడా కథాంశం పరిమితమైనదే. గతానుగతికంగా రచనలు చేయవలసి వచ్చిన సందర్భాలలో రసంతోపాటు చమత్కారాన్ని ఆశ్రయించి దాని నిర్వహణకనుగుణంగా గ్రంథ పరిమాణాన్ని తగ్గించడం కూడా జరిగింది. మొదటినుండీ పద్యప్రక్రియ వర్ణనకు—గద్యప్రక్రియ కథకు అనువైనవనే అభిప్రాయం మన వారికుంది. ఆధునికయుగంలో గాని గద్యానికి ప్రచారం రాలేదు అందుచేత వర్ణన ప్రధానంగాను, కథ అప్రధానంగాను కావ్యాలు రచింపబడ్డాయి. ఎప్పుడైతే కథారచనకు తగిన గద్యం పుంజుకుందో ఆ వెంటనే కవిత్వంలోంచి కథ బదలాయింపబడింది. ఆ కారణంగా కవిత్వంయొక్క పరిమాణం నానాటికీ చిన్నది కాజొచ్చింది. కథ కావాలనే పాఠకులందరూ నవలల వెంట కథలచుట్టూ తిరుగుతూ వున్న కారణంగా కవిత్వానికి పాఠకులు కరువయ్యారు. కవులే కవిత్వానికి శ్రోతలు. పాఠకులు అనే దశకూడా ఏర్పడింది. ప్రక్రియాపరంగా నాటకాలకంటె నాటికలకు ప్రయోగ సౌలభ్యం ఎక్కువ. అందుచేత నాటకంయొక్క నిడివి తగ్గి నాటికల ప్రాబల్యం ఎక్కువయింది. మొదటి నాటకాలు ప్రదర్శన విషయంలో కొంత క్లేశాన్ని కలిగించినా అవి చదివి ఆనందించే అవకాశం కూడా చాలా ఎక్కువ అని చెప్పవచ్చును. ఛందఃప్రక్రియలో వచ్చిన మార్పు కూడా ఇక్కడ చెప్పుకోదగినది. మనకు మధ్య మధ్య ద్విపద కావ్యాలు వచ్చాయి. ఐనా వాటికి విశేష ప్రచారంలేదు. ఒకే ఛందం - ఒకేగతి కావ్యమంతటా వుండడం ఆ నిరాదరణకు కారణమయింది. వైవిధ్యంగల వృత్తాలు—జాతులు—ఉపజాతులు అనేక గతులతో చాలాకాలం పాఠకులను పట్టి వుంచేయి. నేడు ఆ పద్యాల స్థానాన్ని వచనగేయం ఆక్రమించింది. కాని వచనగేయంలో బృహద్గ్రంథాన్ని నిర్వహించడం సులభమనడానికి మన కవులు దాఖలా చూపించలేకపోయారు. ఆరుద్ర రచనల్లో కేవల వచనకావ్యం సినీవాలికంటె గతి వైవిధ్యంగల త్వమేవాహం ప్రచారం పొందింది. వచనగేయం ఖండికలకు మాత్రమే పనికివస్తుందనే అభిప్రాయం వుంది. ఇది నిజమో అబద్ధమో గాని నిడివి తగ్గడానికి ప్రక్రియాపరమైన కారణాలలో వచనగేయానికి కూడా స్థానముంది. నిరోధపూర్వకమైన ఛందో

మార్గంలో కంటె నిర్నిరోధ నిబంధమైన వచన గేయంలో ఈ క్లేశం ఏర్పడడం పరిశీలించదగిన విషయం.

విషయంయొక్క పరిధి - స్వభావం కూడా గ్రంథంయొక్క పరిమాణాన్ని నిర్ణయించవచ్చును. పూర్వులు "రమ్యం జుగుప్సిత ముదార మథాపి నీచం" అన్నా వస్తుస్వీకరణంలో కొన్ని కొలబద్దలు పెట్టుకుని సంకుచితంగా ప్రవర్తించేరని, కావ్యంలో సమకాలికేతి వృత్తం కాలు పెట్టకుండా కంచెకట్టేరని ఆధునికుల అభిప్రాయం. ఈ దృష్టితో పరిశీలిస్తే "ఆకాశాలు లోకాలకు చేరువైన" ఆధునికుల కావ్య వస్తువు బాగా విస్తరించింది. నేడు నేల నాలుగు చెరగులను మూటకట్టి కావ్య వస్తువును సంగ్రహించవచ్చును. పూర్వ రచన లెన్నో చర్విత చర్వణంగా నూతన వస్తువులుగా రచ్చ కెక్కుతున్నాయి. ఒక క్రీస్తు చరిత్ర, ఒక జాలిరత్నం, ఒక ఆత్మకథ, ఒక శివాజీ కథ, ఒక రాణాప్రతాపసింహ చరిత్ర కావ్య వస్తువు లవుతున్నాయి. కావలసిన కొద్దిమంది చదువుకున్నారు; అక్కరలేని అనేకమంది వదలుకున్నారు అయితే సామాన్యుడు కేంద్రంగా, వెలసిన వస్తువుతో మనకొక ఆధునిక బృహత్కావ్యం వెలువడిందా? అభ్యుదయోద్యమాలన్నీ - ప్రజా పోరాటాలన్నీ పాత్రలు లేకుండా నిర్వహింపబడలేదు కాని ఆరుద్ర త్వమేవాఽహంలో, కుందుర్తి తెలంగాణలో శీలా వీర్రాజు మళ్ళీ వెలుగులో మనకు పాత్రలు కానరావు. ఆ ఉద్యమాలే వస్తువుగా దాశరథి రంగాచార్య, వట్టికోట ఆళ్వారుస్వామి నవలలు రాసేరు. అంటే నేటి కవిత్వానికి సామాన్యుడి జీవితం లేదా సాంఘికోద్యమాలు ప్రేరణలే కాని వస్తువులు కావన్నమాట. ఈ విధమైన వస్తువును ప్రవేశపెట్టి ఆధునిక కవిత్వాన్ని ఖండికలనుండి కావ్యానికి మళ్ళించడానికి రంథి సోమరాజు వంటివారు ప్రయత్నించారు కానిఅది కేవలం ప్రయత్నమేఅయింది. వస్తువును ఒక చట్టంలో బిగించడం ద్వారా ప్రబంధకవులు కావ్యావరణంలో 144 వ సెక్షను విధిస్తే, వచన గేయం – సామాజిక స్పృహ సామ్యవాద అవగాహన మొదలైన తుపాకులన్నీ నేటి కవిత్వపు వీధుల్లో కర్ఫ్యూను విధించాయి. ఈరకంగా అనడం ప్రగతి నిరోధకమని నాకు తెలుసు. కాని కవిత్వావరణంలో నేడేర్పడిన స్తంభనకు ఈ స్థితి కూడా ఒక కారణమని మాత్రమే నేను చెప్పదలచుకున్నాను! స్తంభన ఏర్పడినప్పుడు బలవంతంగా ముందుకుసాగడం కంటె అది సడలేవరకు ఆ ప్రయత్నాన్ని విరమించడం ఒకమార్గం. కవులు ఈ మార్గం పట్టబట్టే నేటి యుగం మినీ కవితా యుగం అంటే బహుశా ఎవరికీ అభ్యంతరం వుండదనుకుంటాను. ఈమినీ కవితా స్పృహ నేడే పుట్టిందని ఎవరైనా అంటే ఒక విషయం జ్ఞాపకం వస్తుంది. మనవడు నానమ్మను బెదిరించబోతే ఆవిడ "పోరా! నీ తాత బెదిరింపులకే నేను భయపడలేదు" అందట. ఇక్కడ బెదరించడం మనవడికి కొత్తగాని ముసలమ్మకు కొత్తకాదు. కవిత్వాన్ని మీటర్లు, సెంటిమీటర్లలో కొలవడం అంత మంచిబుద్ధి కాదు.కాని కావ్యాన్ని ప్రతి ట్యుబ్లీతోనూ బేరీజు వెయ్యాలనుకోవడం అసందర్భం

చరిత్ర ప్రకారం మనం రాచరిక వ్యవస్థ నుండి పెట్టుబడిదారీ వ్యవస్థలోకి ప్రవేశించాము. రాచరికం కవుల నుండి పొగడ్త అనే కాని డబ్బును ఆశించలేదు అందుచేత ఆనాడు కావ్యంయొక్క గతి కవుల ఇచ్ఛానుసారంగా కూడా మారడానికి అవకాశముండేది పాలకుల అభిరుచి కొంత వరకు తన ప్రభావాన్ని చూపినా, ఆ ప్రభావం గ్రంథ పరిమాణం మీద ఏమీలేదు. నేటి పెట్టుబడిదారీ వ్యవస్థ రచయితల ప్రతి అక్షరాన్నీ సొమ్ము చేసుకుంటూంది. నేటి రచన లెన్నో పత్రికల ఆంక్షలకు లోబడి వెలువడుతున్నాయి. అభ్యుదయ భావాలెన్నో పత్రికల కనుసన్నల్లో మెసులుకుంటున్నాయి. ఎక్కువమంది రచయితల నాకర్షించడం పత్రికల పద్ధతి తనకున్న పేజీలను అందరినీ ఆకర్షించే ధోరణిలో పంచాలి. అందుకే నేటి నవల 250 పేజీలకు మించరాదు అందుకే నేటి కథ 12 పేజీలకు మించరాదు. కవిత కొన్ని చరణాలకు మించరాదు కాని ఎంత తక్కువగానైనా వుండవచ్చును. మినీ కవిత ఈ వ్యాపార మార్గం నుండి ఉద్భవించిన వాస్తవం.

"ఆ రోజుల్లో ఇలాగే వుండేదా" అనే వాడుక సాధారణంగా వింటూ వుంటాం. మన తండ్రి తాతల తరాలకు చెందినవ్యక్తులు మన తరాన్ని కొన్ని విషయాల్లో నీరసమైన తరంగా భావిస్తూ వుండడం చాలామందికి తెలుసు. స్వాతంత్ర్యోద్యమ కాలంలో ఉద్భవించి వివిధ రంగాలలో తమ అసామాన్య వ్యక్తిత్వాన్ని ప్రదర్శించిన మహనీయులను మన మెరుగుదుం కదా! గిడుగు, గురజాడ, కందుకూరి, చిలుకూరి, పానుగంటి, చిలకమర్తి ఇలా ఎన్నిక చేసుకుంటూ పోతే ఎందరో గత తరానికి చెందిన విరాణ్మూర్తులు వారి ప్రతిభా పాటవాలు ఈ తరంలో కనిపించడంలేదని కొందరి అభిప్రాయం ఇది ప్రమాదకరమైన, ఆత్మహత్యా సదృశమైన ఆలోచన అని అనిపించవచ్చును కాని ఈ విధమైన ప్రతిభాలోపానికి కూడా అవకాశం వుందనిపిస్తుంది.

'కుర్చీలు విరిగిపోతే
కూర్చోడం మాననట్లు గొప్ప రచనలన్
కూర్చే శక్తి నశిస్తే
చేర్చెద నొక యింత చెత్త సిరిసిరి మువ్వా!"

మహాప్రస్థానాన్ని రాసిన తన ప్రతిభ మందగించిందని శ్రీశ్రీ అభిప్రాయం. ఇక్కడ 'గొప్ప రచనలు' అనేమాట నిడివిని గూర్చి కాక గుణాన్ని ఉద్దేశించి రాయబడింది. గుణంతోపాటు నిడివి తగ్గడంలో కూడా ఈ ప్రతిభాలోపం పని చేస్తూందని అనవచ్చును. అంటే అది కూడా క కారణమన్నమాట. మానవీయమైన అనేక విలువలలో ఈ ప్రతిభాలోపం కొట్టవచ్చినట్లు కనిపిస్తూందని నేడు ఒక వర్గంయొక్క భావన.

యు. ఎ. నరసింహమూర్తి

# "అయ్య" శబ్ద చర్చ

'భారతి' (మే 1979)లో "అంబ" శబ్దమునుండి "అమ్మ" పదము వచ్చినదని అందఱూ అనునదే. గవేషణకోసమైన ప్రత్యామ్నాయములు అన్వేషింతము అని నేను వ్రాసినదా లంబనముగ డా. హెచ్. ఎస్. బ్రహ్మానందగారు మార్చి 1980 భారతిలో "శిశుభాష—మాతృ పితృ వాచకాల" అను విస్తృత వ్యాసము వ్రాయుట సంతోషకరము. వారి కృషి ప్రశంసనీయమైనది. వారికి నా అభినందనలు

శ్రీ బ్రహ్మానందగారీ వ్యాసములో తమ ఇతః పూర్వాభిప్రాయములను త్రోసిరాజనినారు కానీ "మా"నుండి యు, "రమ" నుండియు "అమ్మ" పదం ఏల సిద్ధించదో వివరింపకపోయినారు.

1 "అంబ" శబ్దమునుండి "అమ్మ" వచ్చినదను తమ పూర్వాభిప్రాయమును మార్చుకొనినట్లున్నది.

2 కాశ్మీరశైవము మాతృవాచక శబ్దస్వరూప నిరూపణమునకు దోహదకారి అను తమ **పూర్వసిద్ధాంతము**ను త్యజించినట్లున్నారు.

3 అప్ప/అమ్మ శబ్దములు నిత్యవ్యవహారములోని పదముల వంటివి కావు, అవి శిశుభాష (బేబీ టాక్) రూపములు అను సారాంశమును ఎన్నియో ప్రమాణములద్వారా నిరూపింప ప్రయత్నించిరి

మొదటి రెండు అంశములను వారే విడనాడిరి. కావున నేను మూడవ అంశమును చర్చింతును

★ వారు ప్రతిపాదించినట్లు, అమ్మ. అప్ప శబ్దములు ప్రత్యేక శిశు భాషాపదములే అయిన ఎడల, శిశువుల ప్రత్యేక శబ్దములు పెద్దల వాడుకలోనికి ఏల రావలెను?

★ భాషోత్పత్తి క్రమమెట్టిది? అనగా, శబ్దములు శిశువుల నుండి బొద్దు బొద్దుగ తయారయి, పెద్దలచేత తేజాపు చేయబడి వాడుకలోనికి వచ్చునా? లేక పెద్దలు మాట్లాడు పదములను పిల్లలు తమ అపరిణతమైన ఉచ్చారణముతో పల్కుదురా?

★ పిల్లలనుండియే శబ్దములు పుట్టి పెద్దల "ఒకేబ్యులరీ"కి వ్యాపించుననను నిగమనము సరియైన ఎడల, అమ్మ, అప్ప మాత్రమే ఎందుకు. పసిపిల్లల పరిభాషలో నీటికి వాడు "బ్రువ్‌అ" అనే శబ్దము పెద్దల వాడుకలోని కెందుకు రాలేదు? అట్టి శబ్దములు నింకనూ ఉన్నవి (ఉదా: "లాల")

★ శిశుభాష అనున దొకటి ఉండిన, తెలుగులో "శిశుభాషా కోశము" నిర్మించుట అవశ్యము కదా?

★ "శిశువులు చన్ను గుడుచునపుడుచేయు శబ్దములు ఆ క్రియ అయిన తర్వాత కూడ చేయుటవల్ల "మమ్మ"వంటి పదముత్పత్తి యగును" అను పాశ్చాత్య భాషా శాస్త్రజ్ఞుని సిద్ధాంతమును శ్రీ బ్రహ్మానందగారు ఉట్టంకించిరి అట్లయిన "పప్ప" వంటి పదముయొక్క పుట్టుక ఎట్లు? "Pap" ('పప్') శబ్దమున్నది దీనికి చూచుకము అని అర్థము. ధ్వన్యనుకరణమునకు Concise Oxford Dictionary ఇట్లర్థమిచ్చినది Pap: Imita ion of sound made by infant in feeding. దీని ప్రకారము చనుమొన అను అర్థమిచ్చు Pap శబ్దమునుండి "తండ్రి" అనే అర్థమిచ్చు papa (పప), "అప్ప" పదములు వచ్చినవనుట పొసగునా?


నా తల్లి/తండ్రి అను వ్యవహారమును హయ్యర్ (ఉన్నత), గ్రాంధికము, శిష్టము అనియును, మా అమ్మ/అప్ప లోయర్ (తగ్గు) వ్యావహారికము, అశిష్టమనియును శ్రీ బ్రహ్మానందగారు ఒక టేబుల్‌లో వర్గీకరించిరి. "దుర్గ, మా యమ్మ" (పోతన), "సీతమ్మ, మాయమ్మ" (త్యాగయ్య)లను ఎట్లు పరిగణింతురు? "అమ్మా మన్ను తినంగ", "ఓయమ్మ నీ కుమారుడు" (పోతన)లలో వలె సంబోధనలలో మాత్రమే ఎమోటివ్ ఎలిమెంటు ఉన్నచోట "అమ్మా" ప్రయోగింతురందురా "తల్లీ నిన్నుదలంచి" (పోతన), "తల్లీ కన్నడ రాజ్యలక్ష్మి దయలేదా" (శ్రీనాధుడు)వంటి ఎమోటివ్ ఎలిమెంటుగల సంబోధనలను ఎట్లు పరిగణింతురు? శ్రీ బ్రహ్మానందగారు 1 నా తల్లి/తండ్రి, 2. మా అమ్మ/నాన్న, 3 నా అమ్మ/నాన్న, 4. నా తల్లి/తండ్రి అను నాలుగు ప్రణాళికల ద్వారా వాని వ్యవహారముల మీద గావించిన నిగమనములు ప్రమాద భూయిష్ఠములు ఆర్బిట్రరీ లింగ్విస్టులు సంప్రదాయ వ్యాకరణముల ననుసరించుటయా?


"అయ్య"

ఇప్పుడు "అయ్య" శబ్ద చర్చ.

(I) "అయ్య" పదము తెలుగు కన్నడ బాసలలో పుల్లింగము.

(II) పోర్చుగీసు భాషలో Aia ("అయా") అనిన "దాది" అని అర్థము.

(III) Ayah ("ఆయ") అను పదము 'దాది" అను అర్థములో ఆధునిక కాలములో మన దేశమునందు వాడబడు చున్నది.

(IV) కన్నడ భాషలో "అజ్జి" అంటే అవ్వ. "అజ్జి" శబ్దము అయ్యి, అయ్య కాగలదు.

(V) నాగభాషలో తండ్రికి "అపో" అనియును, తల్లికి "అయో" అనియును పేర్లున్నవి.

(VI) అరవ భాషలో తల్లిని "ఆయి" అనియును, తండ్రిని "అప్ప" అనియు పిలుచుట అందరికిని తెలిసిన విషయమే.

నాగిభాషలోని మాతృ పితృ వాచకములకును, అరవ భాషలోని సమానార్థక పదముల పోలికనుబట్టి, ఆ రెండు భాషలకు దగ్గఱి సంబంధము కలదని ఇటీవల యొకరు వ్రాసిరి (Chandra prabha, "Spread of Ancient Tamil" The Hindu, February 28, 1980)

(vii) "అబ్బ" పదము సెమెటిక్ భాషలలో తండ్రికిని, దేవునకు పేర్లుగా "బైబిలు" నందుండుటను ఇటీవల "భారతి" (జనవరి 1979)లో చూపించినాను.

(viii) "అప్ప" పదము అరవవారుపేర్ల చివర పెట్టుకొనుట అరిది. కాని కేరళలోని ముగ్గురు దేవుళ్లు "అప్ప"లే ఉదా : అయ్యప్ప, గురువాయూరప్ప, ఉప్పిల్లియప్ప.

(ix) "అయ్య" అనే పదమునుకూడ అరవవారు పేర్ల చివర పెట్టుకొనుట అంతంతకే అందుకే అయ్య(ర్) అనుపేర్లు గలిగిన స్మార్త బ్రాహ్మణులు, అయ్యం(గారు) అను పేర్లు కలిగిన శ్రీ వైష్ణవ బ్రాహ్మణులు, ఒకానొకప్పుడు ఆంధ్ర, కన్నడ ప్రాంతములనుండి వలసపోయినవారై యుందురని అనుమానం (ఇది న్యాయ దర్శన పరిభాషగా వాడుచున్నాను) కలుగక మానదు.

(x) "అయ్య"కు అర్థములు ఇవి : గౌరవ వాచకము, తండ్రి, గురువు. Aio ('అయొ") అంటే పోర్చుగీసు భాషలో ఉపాధ్యాయుడు (Tutor) బైబిలులోని పూర్వ ప్రకరణములో వచ్చు మన మహర్షులవంటి ప్రవక్తలపేర్లు Iahతో ముగియును· (ఉదా : Jeremiah).

(xi) పై అర్థముల పురస్కరించుకొని "అయ్య" శబ్దము ఎట్లు వచ్చినది నిర్ణయి పవలెను. "అయ్య" శబ్దము "ఆర్య" నుండి వచ్చినదని సాధారణముగ అనుకొనుట ఉన్నది. కాని "అయ్య" శబ్దము "అజ" (బ్రహ్మ) శబ్దమునుండి వచ్చుట కవకాశమున్నది.

1 అజ → అయ → అయ్య

("జ" శబ్దము "య" ఉచ్చారణపొందగలదు Jacobsonను శ్రీ బ్రహ్మానందగారు యాకబ్సన్ అని వ్రాసి ఉండుట గమనింప వలసినవిషయము.

మిథిల బ్రాహ్మణులపేర్ల చివర "ఓఝు", "ఝు" అనే శబ్దములుండును. ఇవి "అజ" నుండి వచ్చినవే. వీటి అర్థము ఉపాధ్యాయుడు "ఒజ్జ" (తెలుగు).

2 అజ → ఓఝు → ఝు → (అ)య → య్య
(సం) (మైథిలి)(మైథిలి) (తెలుగు) (తెలుగు)
మైథిలి, వంగభాషలలో మన "అ"ను "ఓ" మాదిరి ఉచ్చరించెదరు. "అమ్మ", "అప్ప", "అయ్య" పదములు స్త్రీ పుంలింగములలోనూ వాడబడుట ఆసక్తికర విషయము.

శ్రీ సర్దేశాయి తిరుమలరావు

# లేఖలు

## నవ్యకండి - ఏడవకండి ప్రయత్నం చెయ్యండి

జనవరి సంచికలో ఆచార్య తల్లోజుగారు "నవ్వాలో — ఏడవాలో" అంటూ 'భారతి'లోని కవిత్వాలు అర్థం కావడంలేదని మొత్తుకోవడం నవ్వుతోపాటు విస్మయాన్ని కలిగించింది !

ప్రపంచంలో ఏదీ మనిషికి అర్థంకానిదిలేదు. ఉన్న అర్థం చేసుకోడానికి ప్రయత్నిస్తున్నాడు, కృతార్థుడౌతున్నాడు కవిత్వం అర్థం కాలేదనడంతప్ప అర్థం కాకపోవడానికి కారణాలు తెలుపలేదు.

చిన్ననాటినుండి టీకా—తాత్పర్యాల వలయంలో తిరగడంవల్ల టీకా తాత్పర్యాలు చెప్పకుండా ఏది అర్థంకాదు కొందరికి. అదే కోవకు చెందుతారు తల్లోజు

బాధల్లో పుట్టేది, అనుభూతికి, జీవితాలకు అద్దం పట్టేది కవిత్వం. ఈ నిజాన్ని తెలుసుకోకుండా కవిత్వాన్ని అర్థం చేసుకోలేము. అంతేకాదు కవిత్వాన్ని అర్థం చేసుకోవడానికి సహృదయాత కావాలి, బాధలు—అనుభూతి అంటే ఏమిటో తెలియాలి.

ఈ రోజుల్లో వస్తున్న వచన కవిత్వాన్ని గూర్చి మనం గర్వించాలి ఒక్కో అక్షరానికి ప్రాణం వుంది, ఒక్కో భావం కార్యోన్ముఖుల్ని చేస్తుంది.

కవిత్వంలోని స్పష్టత మీకు అర్థం కావాలనుకుంటే కవిత్వంలో వస్తున్న మౌలికమైన మార్పులు — అనుసరిస్తున్న నవ్య రీతుల్ని, టెక్నిక్కులను అర్థంచేసుకోగల పరిజ్ఞానంతోపాటు రాజకీయ — సామాజిక అవగాహన అవసరం. సాంప్రదాయ కవిత్వం లోంచి, కలల్ని, వూహల్ని, కల్పితాల్ని వదిలి వాస్తవ దృక్పథానికి రావాలి, జీవితాల్ని చదవాలి.

'భారతి'లో వచ్చిన కవితలన్ని అగమ్యగోచరంగా ఏమీలేవు. మీలాంటి అగమ్యగోచర కవుల కవితల్ని చదివి మీరు గిర్రున తిరుగుతున్నట్టున్నారు. 'భారతి' పాఠకులగూర్చి తల్లోజుగార్కి తెలియదు కాబోలు ! 'భారతి' పాఠకులు సర్వసామాన్యంగా సాహిత్యపరిచితులే. చదువుకున్న ప్రతివారికి అర్థమౌతాయి 'భారతి' కవితలు. 'భారతి' కవితలు ఎందరికో ప్రేరణ కలిగించాయి, మంచి కవిత్వాన్ని సృష్టించడానికి కారణమయ్యాయి.

ఎంగిలిపడ్డ సంస్కృత పదాల్ని — సమాసాల్ని కవిత్వంలో ఇరికించే కవుల్ని, కవితల్ని, మీరు అర్థం కాలేదని తిట్టదల్చుకుంటే నేను మీవెంటే వుంటాను.

'భారతి'లో ఈమధ్య వచ్చిన కవితల్ని పరిశీలించండి, కొన్ని ఉదాహరణలు చదవండి ...

''నా కళ్ళలో కన్నీళ్ళలో స్నానంచేసి పదాల్ని కప్పుకొని
రెప్పల్ని తెరుచుకొని . గుండెల్తో మాట్లాడటానికి !''
(కవిత—మార్చి '79)

కవిత్వం రగిలించగలదు, కదిలించగలదు మనిషిని. చూడండి

''నీ శరీరంలో ఎక్కడున్నా తడుంటే నిన్ను పీల్చగలను—పీల్చి, నా తట్టకెత్తుకుని పైకెక్కగలను—'' అంతేకాదు ''నిన్ను మధిస్తేనే తప్ప — నిన్ను పారతో తిరగేసి దమ్ముచేస్తేనే తప్ప నాకు నిద్ర రాదే'' (తొలకరి మే '79).

''ఓ డైనమైట్ కన్నూ, ఓ మార్యుడి కన్ను, నన్ను సమాధికాని ముందు-పుష్పించటం తరువాత'' (సమాధి బాధ—మే '79). పై వాటిల్లో అర్థం కానిదేది ?

''కళ్ళు కన్నీళ్ళు కార్చని జీవసాగరాల లోతులు కనుక్కోడానికి గుండె మూగపోతేపోని బాధల సహాధులు తడమడానికి''—చొక్కా పట్టుకొని నిలదీసి చెప్తోంది ''నీ కొఅకు'' (అనుయాత్ర — జూన్ '79)

ఇలా ఎంత మంచి కవిత్వాన్ని అందిస్తోంది భారతి'.

కవిత్వం రాయాలనుకున్న ప్రతివాడు, రాసేవాడు శ్రీశ్రీ కావాలని లేదు ఒక్క శ్రీశ్రీదే కవిత్వమని కొలమాన మెక్కడైనా ఉందేమో చెప్పండి. ఒకానొకప్పుడు శ్రీశ్రీది కవిత్వమేకాదని కొట్టి పారేసిన రోజులున్నాయ్ సార్

తల్లోజు లాంటి మిత్రులు నవ్వడం ఏడవడం మానేసి కవిత్వాన్ని అర్థం చేసుకోడానికి ప్రయత్నించడం నేర్చుకొండి.

**శ్రీ బెడిద రాజేశ్వర్**

## వ్యాసుడు : గ్రన్థ చౌర్యమా !

పై శీర్షిక క్రింద ('భారతి') అక్టోబరు '79 సంచికలో నేను వ్రాసిన వ్యాసమునకు శ్రీ దేశపతి గోపాలకృష్ణగారు తమకు తోచిన కొన్ని విషయములు 79 డిశంబరు సంచిక కలగూరగంపలో వ్రాసిరి. వారికిది సమాధానము.

(1) నా వ్యాసములో ''వ్యాస'' అనునది బిరుదు, వేర్వేరు వ్యక్తులు వ్యాసులై యిట్లే రచనలు సాగింతురు'' అని వ్రాయగా దానికివారు ఇదియొక యూహ మాత్రమే యని చెప్ప సాధ్యమగుచున్నది.

''కాని దీని కాధారమగు సాక్ష్యమెద్దియు గలదేని శాస్త్రిగారు తెలిపిన సంతసింతును'' అని వ్రాసిరి వారి క్రింది పురాణ భాగములు చూచిన సందేహము తీరును. వీనిలో గడచిన వ్యాసుల నామధేయములే గాక, రాబోవు వ్యాసు డశ్వత్థామ యని కూడా పేర్కొనిరి. పై వారిలో నొకపరి వాల్మీకియు వ్యాసుడగుట గమనార్హము.

1.విష్ణు పురాణము 3 అంశ 3 అధ్యాయము, 2 కూర్మ పురాణము—పూర్వార్ధం 52 అధ్యాయం, 3. బ్రహ్మాండ పురాణం—అనుషంగపాదం 35 అధ్యాయం, 4. దేవీభాగవతం—1 స్కంధం 3 అధ్యాయం, 5. వాల్మీకి ప్రణీతయోగ వాసిష్ఠము నిర్వాణ ప్రకరణం—భుశుండి కథనం.

(2) ''గ్రన్థచోర'' బిరుదము వ్యాసుడు పొందుట శ్రీ శాస్త్రిగారి నిందాత్మక వచో వైఖరి కొంత విస్మయము కలుగ జేయును. ''వాల్మీకిని వ్యాసు డనుకరించినను అది తప్పు అను వాదము చేసిన వారింత వరకు శాస్త్రిగారేనని వెల్లడియైనది.'' శాస్త్రిగారు వ్యాసునిపై నపోహపడిరి. ''వ్యాసుడు వాల్మీకి నుండి గ్రన్థ చౌర్యము జేసినట్లు రచయిత సందేహించిరి.'' ''ఒక వ్యాసుడు మివల్ల నింద పైగొనెను'' అని వారు వ్రాసిరి. కాని వారేల నాపై యిట్లపోహపడిరో తెలియదు. వీరు మరల 41 పేజీ 1, 2, 3 పేరాలు శాంతముగ జదివినచో నట్లాందోళన జెందరు.

(3) ''ఒకే శైలిలో గన్పట్టుచున్నవని నాలుగు శ్లోకము లుదాహరించిరి.''అని వ్రాసిరి కాని సుదేవుడు దమయంతిని చూచి వర్ణించిన ఇరువది శ్లోకములు పూర్తిగ రామాయణములోని పోలిక కలవి నలోపాఖ్యానము చూచి గ్రహింతురుగాక!

(4) నా వ్యాసము సగమైన పూర్తికాకుండగనే పత్రికాధిపతులు ముగించుట శోచనీయము 'వ్యాసప్రతిభ' 'వాల్మీకి అడుగు జాడల్లో వ్యాసుడు' 'వ్యాసునిపై వాల్మీకి ఛాయ' 'వ్యాస — వాల్మీకులు' 'నల చరిత్రలో రామ చరిత్ర' అను శీర్షికలతో వ్యాస మారంభించి రామాయణానుకరణముల జూపియున్నచో సామాన్యులు భ్రాంతి పడుదురనియు నట్టి దుర్భావనకు తావీయకుండ ' వ్యాసుడు: గ్రన్థ చౌర్యమా?'' ''అని శీర్షికకు పేర్పెట్టి 41పుట 1, 2, 3 పేరాలలో తన్నిరాకరణ మొనరించితిని. మరియు ''గ్రన్థ చౌర్యమా?'' అన్నంత మాత్రాన చౌర్యము కానేరదు వ్యాసనిందయు కానేరదు. జగత్ప్రసిద్ధులగు వారిపై సందేహగ్రస్త పదములు వాడినను దోసము వాటిల్లదు. అట్టిచో ''నిమజ్జతీందోః కిరణే ష్వివాంకః'' అన్న రీతిగ సమసిపోవును. మరియు నాగ్నేయపురాణమున నొక పతివ్రత ప్రతిజ్ఞలు చేయుచు ''నారాయణ పరంబ్రహ్మతత్వం నారాయణః పరః। ఇత్యేషాచేత్ శ్రుతిః సత్యా। స్ఫురతాం శబ్ద కారణమ్'' అని పలికెను. అనగా ''నారాయణుడే పరబ్రహ్మము. పరతత్వము కూడ నారాయణుడే'' అనెడి వేద వాక్యమే ప్రమాణ మగుచో శబ్ద మెందుండి వచ్చెనో వారు వ్యక్తమగుదురుగాక ? ఇచట ప్రమాణ భూతమైన వేద వాక్యమును సందేహించినంత మాత్రాన వేద నింద యొనర్చినట్లగునా? అటులనే శీర్షికకు నామ

కరణ మొనర్చినను దోసము లేదనుకొందును. ''మహర్షుల విమర్శింప మన బోంట్లకు తగదని పల్కియు నేనెట్లు వారిపై నింద మోపుదు''నని వారూహించిరో విస్మయము కలిగించుచున్నది.

## సవరణలు

79 అక్టోబరు 'భారతి'లో ప్రచురింపబడిన ''వ్యాసుడు : గ్రన్థ చౌర్యమా!'' అను నా వ్యాసమున నీ క్రింది దోషములున్నవి. అవి సవరించుకొని చదువుకొనవలసినదిగ పాఠకులకు వినతి.

(1) 44 పుటలో 6 లైను రాముడు :— శ్లో॥ అశోక। శోకా పనుద। శోకోపహత (2) చేతసం। అని చేర్చవలెను.

అదే పుటలో 2 కాలం 6 లైను తరువాత దమయంతి :— శ్లో॥ భర్తృ రాజ్యాపహరణం స్వజనాచ్చ పరాజయః। భర్త్రా సహ వియోగశ్చ తనయాభ్యాం చ విచ్యుతిః। నిర్బాధతా వనేవాసో బహు వ్యాళ నిషేవితే। నూనం జన్మాంతర కృతం। దుఃఖమా పతితం మహత్।

నా భర్తయొక్క రాజ్య మపహరింపబడుట, సాటివారిలో నపజయము, పతి వియోగము, సంతానమునకు దూరమగుట, దిక్కుమాలి—క్రూర మృగ నిషేవితారణ్యమున నివాసము—ఇవన్నియు జూడ జన్మాంతర కృతకర్మ ఫలమే తప్పక యీ దుఃఖ పరంపరకు కారణము.

(3) 45 పుట రెండవ కాలంలో ''శుభ సూచన'' అను దానిపైన ఋతుపర్ణుడు :—

శ్లో॥ గృహీత్వా చాశ్వ హృదయం రాజన్ భాంగాసురి ర్నృపః॥
నిషధాధిపతేశ్చాపి। దత్వాక్ష హృదయం నృపః। సూతమన్య
ముపాదాయ యయౌ స్వపురమేవ చ।

నలుడని గుర్తింపబడిన తర్వాత అతనివద్ద నుండి ఋతుపర్ణుడు ఉపకృతిగ నశ్వ హృదయము గైకొని ప్రత్యుపకృతిగ నక్ష హృదయము నాతనికిచ్చి వేరొక సారథి నేర్పరచుకొని తన పట్టణమున కేగెను. రామ సుగ్రీవులవలె, నల - ఋతుపర్ణు లిర్వురు, నన్యోన్యము — నుపకృతు లగుట నలోపాఖ్యాన రామాయణములలోని సామ్యత.

**శ్రీ పెద్దాడ నారాయణశాస్త్రి**

మార్చినెల 'భారతి' కలగూర గంపలో హరిశ్చంద్ర పాత్రలో ప్రసిద్ధి గాంచిన వారి పేర్ల జాబితాలో ''పొన్నాల రామరెడ్డి'' అని యున్నది.

వారి పూర్తిపేరు పొన్నాల రామసుబ్బారెడ్డి. రెవెన్యూశాఖలో నెల్లూరులోనే వుద్యోగించుచున్నారు. వాల్ పోస్టర్ లలో అచ్చుటచ్చుట ఆర్. ఎస్. ఆర్. పొన్నాల అనికూడా వ్రాయబడియుండుట కలదు.

హరిశ్చంద్ర పాత్రకు నెల్లూరులో ప్రసిద్ధులలో కీ. శే. జొన్నవిత్తుల శేషగిరిరావు, కీ. శే. చెన్నూరి శేషగిరిరావు, కీ. శే. సోమిశెట్టి నరసింహంగుప్త గారలు కొందరు.

నక్షత్రక పాత్రధారులలో కడుంగడు ప్రసిద్ధుడు హరిశ్చంద్ర నాటకకర్త కీ. శే. బలిజేపల్లి లక్ష్మీకాంతంగారిని పేర్కొనకపోవుట చింత్యము.

**మో న్నా**

## శీర్పి

డా॥ శివలంక శ్రీరామచంద్రమూర్తిగారు 1979డిశంబరు 'భారతి' లో వ్రాసిన 'సంఖ్యాంకిత ప్రాంతీయ విభాగాలు' అన్న వ్యాసంలో పరిచయం చేసిన 4వ ప్రాంతీయ విభాగం 'చిఅపి'. 'దీని ముఖ్య గ్రామం నేటి మడకశిర తాలూకాలోని శీర్పి' అని వారు అందులో చెప్పారు. ఇది కొంత వివాదాస్పదమైన విషయంగా అగుపిస్తుంది.

నేను మడకశిర తాలూకావాణ్ణి. మడకశిర తాలూకాకు ప్రక్కనే కర్ణాటక రాష్ట్రంలో 'శిరా' తాలూకా ఉంది. శిరా తాలూకాలోని గ్రామీణులు శిరాను 'శీర్పి' అని వ్యవహరిస్తారు మా తాలూకాలో కూడా చాలామంది గ్రామీణులు నేటికీ మడకశిర అనడానికి బదులుగా 'మడక శీర్పి' అంటారు. నాకు తెలిసినంతవరకూ మడకశిర తాలూకాలో 'శీర్పి' అనే గ్రామం ఏదీ ఉన్నట్లు లేదు. కర్ణాటకలోని 'శీర్పి'గా వ్యవహరింపబడుతున్న శిరాయే 'చిఅపి' ప్రాంతీయ విభాగపు ముఖ్య గ్రామమై ఉండవచ్చునేమో అని నా సందేహం. ఎందుకంటే, పూర్వం నేటి మడకశిర గ్రామానికి 'మడకపల్లె' అనే పేరుండేదట. 'శిరా' పాళెగాని అధికార వలయంలోకి చేరిన తరువాత 'మడకశిర'గా మారిందట. శైవుడుగా ఉన్న రామలింగడు వైష్ణవుడైన తరువాత రామకృష్ణుడుగా మారిపోయినట్లు !

మరొక విషయం. మడకశిరా తాలూకా నానుకునే (మా అనంతపురం జిల్లాలోనే) కల్యాణదుర్గం తాలూకా ఉన్నది ఆ తాలూకాలో 'శిరిపి' అను గ్రామం ఉన్నది. 'శిరిపి' మునుపు 'శీర్పి'గా ఉండి ప్రస్తుతం 'శిరిపి'గా వ్యవహరింపబడుచుండవచ్చును కదా. ఆగ్రామమే 'చిఅపి' ప్రాంతీయ విభాగపు ముఖ్య గ్రామమైన 'శీర్పి'యా ?

ఇది పరిశోధించి, నిర్ణయించవలసిన విషయం.

**శ్రీ శంకరగంటి రంగాచార్యులు**

## వికాలపేట - వింతలు విశేషాలు

ప్రకాశం జిల్లా కందుకూరు తాలూకా విక్రాలపేట - కాకతీయుల కాలంలో ''విగ్రహాల పేట.'' ఈ గ్రామము కందుకూరుకు నాల్గున్నర మైళ్ళ దూరమున కలదు దీనికీ పేరు నాడుండినట్లు నేడు తల నరసిన పెద్దలు పలుకుచున్నారు.

దీనికీ పేరు రావడానికి గల కారణ మిట్లని పలుకుచున్నారు. 'పంచలోహ శిలాదారు మృత్తికలో — వివిధములైన—ఆకారములతో,

శిల్పములు తయారుచేయు శిల్పులీ గ్రామమున నుండెడివారనియు—కాలముమారి పూట గడువకపోగ—పొట్ట బట్టుకొని—గ్రామాంతరములకు వలస వెళ్ళిరని ప్రతీతి ఇది సత్యమన్నట్లుగ పరిసర గ్రామములందు ఈ గ్రామస్థులు నేడు స్థిరజీవనులుగ నున్నారు. పోయిన వారు పోగా ఉన్నవారు మాత్రం మన్నును నమ్ముకొని మన్ననతో జీవయాత్ర గడుపుచున్నారు.

నాటి స్థితిగతులు నేటికి దిగజారినప్పటికిని ఉన్నదానితో తృప్తిపడి 'కోటి విద్యలైనను కొంగ్రడకు లోకువేయన్నట్లు — మడి దున్నుచు బ్రతుకుచున్నారు — బ్రతికించుచున్నారు. నాటికి నేటికి పోలికలు లేవు. ఈ గ్రామ ప్రాచీన చరిత్ర తెలిసిన వాళ్ళను ఆ గ్రామంలోనే వేళ్ళపై లెక్కపెట్టవచ్చును.

ఈమధ్య నేను సమగ్ర కందుకూరు సీమ చరిత్ర వ్రాయు సంకల్పమున—అనేక గ్రామముల చరిత్ర సేకరించితిని. వాటిలో కందుకూరు, గుడ్లూరు, గుండ్లపాళెము, కొండపి, పెదకండ్లగుంట, లింగ సముద్రము, సింగరాయకొండ, శింగరబొట్లపాళెం మున్నగునవి కలవు.

ఈ గ్రామమును గూర్చి విచారించుచుండగ--మాన్యమిత్రుడు, సారస్వతాభిలాషి, చీరాలపేట వాస్తవ్యుడు, కర్షకుడు శ్రీనాగయ్య కనుపడినాడు. ప్రసంగవశమున — వింతలు విశేషాలు చర్చించుచు — వారి గ్రామ చరిత్ర కూడా వివరించినాడు. ఆతని వాక్యములే ఈ వ్యాసమున కాధారములు కొంతవరకు.

మా పూళ్లో పెద్ద పాటి దిబ్బ కలదు. అదియే ప్రాచీన గ్రామముండు ప్రదేశము. పోయినవారు పోగా మిగిలినవారు అక్కడే ఉంటున్నారు. ఈమధ్య ఓ బలిజవారు ఇండ్లకై పునాదులు తీయుచుండగా 3/4 అడుగు పొడవు, 4 అంగుళాల వెడల్పు కలిగి 5 రేకులున్నవి. ఈ ఐదును కలిపి ఓ కడియానికి బంధించియున్నవి. ఈ రాగి శాసనంలోని భాష ప్రాచీన తెలుగు భాష అయివుండును. ఇది ప్రకృతం చీరాల తాలూకా 'స్వర్ణ గ్రామంలో నివసించే సాధు లక్ష్మీనారాయణగారి వద్దనున్నది. అద్దానిని వారి వద్ద నుండి తీసికొని అందరి విషయములను తెలియఁజేయవలయును.

మరొకచోట మట్టి త్రవ్వుచుండగ ఈ శక్తి విగ్రహం మరొక బలిజి వారికే లభించినది. దీని వివరాలిట్లు నేను నిర్ణయించుకొన్నాను. ఇది పంచలోహ విగ్రహం. ఆరు అంగుళాల యెత్తు మూడు అంగుళాల వెడల్పు కలిగియున్నది. స్త్రీమూర్తి. రెండు చేతులే కలవు పద్మములున్నవి. కాని కుడిచేతిలో నున్నది భిన్నమైనది. సవ్యాప సవ్యములుగా యజ్ఞోపవీతములున్నవి. పద్మాసనము కాని, పీఠము కాని లేక, నేలపై దొడ్డి కాళ్ళతో కూర్చొనియున్నది. శక్తి స్వరూపిణి. కిరీటమున నాగపడిగ ఆకారము కలదు. వెనుక జడ మాదిరిగ నున్నది. దీని వయస్సు 400 వత్సరములైయుండును. చిత్రమును పరిశీలింప ప్రార్థన.

ఇంకనీ ప్రాంతమును త్రవ్వకము చేసిన మరికొన్ని విగ్రహాలు ఇతరములైన వస్తువులు చిక్కవచ్చును. ఈ యత్నము పురావస్తు శాఖ యత్నం చేయుదురుగాక.

మరొక మట్టి చేయబడిన పెద్ద ఉగ్గుగిన్నె. చూడ ముచ్చటగ నున్నది లభించినది. భద్రముగా నున్నది. ఆనాటి ప్రజలకు చేతి వృత్తులపై, వస్తు నిర్మాణమున నెంతయభిమానమో తెలియుచున్నది.

ఒక చేలో -- నాల్గు అడుగుల శివలింగమున్నది. దానివద్ద తెల్లని రాతిమీద ఆనాటి లిపిలో ఏదో విషయం వ్రాయబడియున్నది. ఇది $1\frac{1}{2}$ అడుగు వెడల్పు, 2 అడుగుల పొడవు కలిగియున్నది. అన్ని తెలుగు శాసనముల వలెనే జయాభ్యుదయని యున్నట్లున్నది. ఇందలి విషయ మేమిటో — ఈ శివమూర్తి ఎవరు ప్రతిష్ఠించి లబ్ద ప్రతిష్ఠులైరో తెలియదు. పరిశీలించిన విషయము తెలియగలదు.

ఇవన్నియు పరిశీలించినమీదట—ఇట ప్రాచీన కాలమున నేదో ఒక మహానగరము ఉండి నేలమట్టమైయుండును. ఆ నగరమందలి దేవాలయ మందలి విగ్రహమేమో ?

ఈ యపూర్వ వస్తువులను ప్రభుత్వమువారు కాని, పురావస్తు శాఖవారు కాని ప్రతిఫలమిచ్చి సేకరించి భద్రపరచగలరని మనవి చేయుచున్నాను.

ఇదంతయు ప్రాచీన సంపద కదా ! దీనిని పరిరక్షించుకొనుట మన కర్తవ్యమే కాదు, విధి యని మనవి చేయుచున్నాను. ఈ విషయమందించిన యస్. నాగయ్యకు కృతజ్ఞత తెలియఁజేయుచున్నాను.

విద్వాన్ కొమాండూరి రామానుజాచార్యులు

# గ్రంథ విమర్శలు

## రెండు గీతానువాదాలు

### శ్రీమద్భగవద్గీత

[ఆంధ్రానువాదము. అనువాదకుడు శ్రీ పైడిపాటి అప్పిరెడ్డి, క్రౌన్ సైజు 20+149+4. వెల: తెలియదు. ప్రతులు దొరకు స్థలము- శ్రీ పైడిపాటి అప్పిరెడ్డి, నాగేంద్రపురం, మరకాలకుప్పం పోస్టు, చిత్తూరు తాలూకా (జిల్లా)]

భగవద్గీతకు వివిధ భాషల్లో గద్యరూపంగాను, పద్యరూపంగాను ఎన్నో అనువాదాలు వస్తున్నవి తెలుగు భాషలోను అసంఖ్యంగా వస్తున్న వాటిలో ఈ పద్యానువాదాలు చేరిఉన్నవి.

''శ్రీమద్భగవద్గీత''ను రచించిన అప్పిరెడ్డిగారి కుమార్తె శ్రీమతి కృష్ణమ్మ తిరుపతి శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయ కళాశాలలో భౌతిక శాస్త్రాధ్యాపకురాలు ఆమె తనతండ్రి గారికి భక్తిశ్రద్ధలతో భగవద్గీతను పంపగా, దాన్ని చదివి, గీతానుసారాన్ని అవగాహన చేసుకుని, ప్రభావితులై, ఆయన ఈ పద్యానువాదానికి పూనుకున్నారు.

అప్పిరెడ్డిగారికి సహజంగానే ఆంధ్ర వాఙ్మయంపై ఎక్కువ ఆదరాభిమానాలున్నవి. అందులో కృషిచేసి పాండిత్యంతోపాటు కవిత్వాన్నీ అలవరచుకొన్నారు. ఆ కవిత్వ పాండిత్యాలను భగవద్గీతానువాదానికి ఉపయోగించుకోవడం వీరి ఆధ్యాత్మిక దృష్టికి ప్రబల నిదర్శనం. మూలంలోని అనుష్టుప్ శ్లోకాలకు అనుగుణమైన తేటగీతి ఛ్ఛందస్సును అనువాదానికి గ్రహించడం సముచితంగా ఉన్నది.

ఒక్క ఉదాహరణ—

''శ్రేయాన్ స్వధర్మో విగుణః
పరధర్మాత్ స్వనుష్ఠితాత్,
స్వధర్మే నిధనం శ్రేయః
పరధర్మో భయావహః''

అనే కర్మయోగంలోని 35 శ్లోకానికి అనువాదం మూలాభిప్రాయాన్ని సులభంగా వెల్లడిస్తూ ఇలా ఉన్నది:

''అగును మేలు స్వధర్మంబు విగుణమైన,
మక్కువ నొనర్చు పరుల ధర్మమునకంటె
స్వీయ ధర్మంబుచేత జచ్చినను మేలె
పరుల ధర్మంబు కడు భయావహము పార్థ''

సుప్రసిద్ధ విద్వద్వర్యులు డాక్టర్ జి ఎన్. రెడ్డిగారు, డాక్టర్ జీరెడ్డి చెన్నారెడ్డిగారు, మద్దూరి సుబ్బారెడ్డిగారు దీని విశిష్టతను వివరిస్తూ సదభిప్రాయాలిచ్చారు. మత గ్రంథాల రచనకు, ప్రకటనకు ప్రోత్సాహమిస్తున్న శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానంవారు దీని ముద్రణకు ఆర్థిక సహాయం చేశారు. భగవద్గీతా సందేశాన్ని సులభంగా గ్రహించడానికి ఈ పుస్తకం బాగా ఉపయోగిస్తుంది.

### శ్రీ మదాంధ్ర భగవద్గీత

[సమగ్రాంధ్రానువాదము. రచన- శ్రీ వాసాలమర్రి పద్మనాభశాస్త్రి, డెమ్మీ సైజు 10+153 పుటలు. వెల 6 రూ. ప్రతులు లభించు స్థానము శ్రీ వాసాలమర్రి పద్మనాభశాస్త్రి, టీచర్, జిల్లా పరిషత్ సెకండరీ పాఠశాల, అప్పన్నపేట ]

''శ్రీ మదాంధ్ర భగవద్గీత'' కూడా భగవద్గీతకు పద్యానువాదమే. తర్జుమా చేసిన పద్మనాభశాస్త్రిగారు దీనిని ''సమగ్రాంధ్రానువాద''మని అంటున్నారు. ''సమగ'' పదానికి అభిప్రాయమేమిటో తెలియదు. మూలానికి అనువాదం చేసేవారు తమ అనువాదంతోపాటు మూలాన్ని కూడా చేర్చి ప్రకటిస్తారు. లేదా తమ అనువాదాన్ని మాత్రం ముద్రిస్తారు. తాత్పర్యం ప్రకటించేవారు మూలశ్లోకం యిచ్చి, దానికింద తాత్పర్యాన్ని యిస్తారు. ఈ పుస్తకంలో ఒక కొత్త పద్ధతి కానవస్తున్నది. అనువాదకర్త మూలాన్ని ఇవ్వకుండా ఆంధ్రీకృత పద్యాన్నే యిస్తూ, తన పద్యానికి తాత్పర్యాన్ని కూడా ఇచ్చారు. పద్యం సులభంగా అర్థం కానప్పుడే తాత్పర్యం అవసరం. తన పద్యం సులభంగా అర్థం కాదేమో అనే సందేహం రచయితకు ఉన్నదన్నమాట! ఇందులో పద్యములు, వాని తాత్పర్యములు ఒక్కమాదిరిగానే కానవస్తున్నవి. కొన్ని అసంగతంగా కనబడుతున్నవి. దీనికి గ్రంథారంభాన్నే తీసుకోవచ్చు.

మూలం—

ధృతరాష్ట్ర ఉవాచ—

''ధర్మక్షేత్రే కురుక్షేత్రే
సమవేతా యుయుత్సవః,
మామకాః పాండవాశ్చైవ
కిమకుర్వత సంజయ!''

అనువాద తాత్పర్యాలు—

''ధృతరాష్ట్రుని ప్రశ్న—

శ్రీదమును ధర్మరూపమౌ క్షేత్రమైన
యా కురుక్షేత్ర సంగ్రామాంగణమునందు
యేమొనర్చిరి కురుపాండవేయులెల్ల
సంగర కుతూహలేచ్ఛ సంజయ! యటంచు
పృచ్ఛ చేసెనా ధృతరాష్ట్ర పృథివిపతియు...

తా. ధర్మమునకు నిలయమైన కురుక్షేత్ర యుద్ధభూమి యందు రణ సన్నద్ధులై యున్న కౌరవ పాండవ సైన్యము లేమి జేసెనని ధృతరాష్ట్ర మహారాజు సంజయుని ప్రశ్నించెను.''

ఇక్కడ చిన్న (అనుష్టుప్) శ్లోకానికి అనువాదంలో అయిదు పాదాల పద్యం ఉన్నది. అయిదోపాదం అనవసరం అందులో ''ధృతరాష్ట్రుడు సంజయుని ప్రశ్నించెను'' అని మాత్రం ఉన్నది. ఆ విషయం పద్యానికి ముందే ''ధృతరాష్ట్రుని ప్రశ్న'' అని ఉండనే ఉన్నది కదా!

కురుక్షేత్రం ధర్మక్షేత్రం గాని సంపదచ్చేది కాదు. అందువల్ల మూలంలోలేని ''శ్రీద'' పదం అనవసరం, సందర్భానుచితమున్నూ ఇందులో యుద్ధవాచకమైన ''సంగ్రమ'' శబ్దానికి బదులు ''సంగ్రమ''శబ్దం వాడుట సముచితంకాదు

ధృతరాష్ట్రుడు ''నా కొడుకులూ, నా తమ్ముడైన పాండురాజు కొడుకులు ఏమి చేశా రని—'' ''మామకాః పాండవాశ్చైవ'' అని అడుగుతున్నాడు. ''కురు పాండవేయులెల్ల'' అని చెప్పడం ధృతరాష్ట్రునికి తన పుత్రులయెడగల ఆప్యాయతను లోపింపజేస్తున్నది. పద్యం రెండవ పాదం'' యా కురుక్షేత్ర సంగ్రమాంగణము నందు'' అనే దానిలో యతి తప్పినది. 'య-గ'లకు యతి మైత్రి లేదు. అట్లే మూడవ పాదంలోనూ ''యే మొనర్చిరి''లోని ''యే''కిని, ''పాండ—వేయులెల్ల'' అనే దానిలోని ''వే''కిని యతి చెల్లదు.

దీని తాత్పర్యంలో ''కౌరవ పాండవ సైన్యము లేమిచేసినవి? అని అడిగినట్లున్నది శ్లోకంలో లేని సైన్యాల సమాచారం ఇందులో ఎలా ప్రవేశించినదో తెలియదు. పరిశీలన దృష్టితో దీన్ని చదువ గోరేవారికి, దీనిని చూచాక, గ్రంథాన్ని చదవాలనే బుద్ధి పుట్టడం కష్టం. అనువాదం చేసినప్పుడు, అందులోనూ భగవద్గీతవంటి గ్రంథాలను తెలిగించినప్పుడు ఎంతో శ్రద్ధ ఉండాలి. లేకపోతే వాటి వల్ల అనుకున్నంత ప్రయోజనం ఉండదు.

''అంగీరస''

## తెలుగులో చలనచిత్ర పత్రికారచన అవతరణ - వికాసములు

[రచన—హరిశ్చంద్ర ప్రసాద్. వెల: అయిదు రూపాయలు, ప్రాప్తిస్థానం—నెం 1–8–248 చిక్కడపల్లి, హైదరాబాద్—500020].

36 పుటల యీ చిన్న పుస్తకంలో అయిదు అధ్యాయాలున్నాయ్. పత్రికా రచన ఒక పరిశోధన అని యీ రచయిత తొలుత నిర్వచించి పరిశోధన అంటే యథార్థముల వ్యాఖ్యానం అని వివరించారు. పరిశోధకుడు చేయవలసిన పనులలో చాలా భాగం పత్రికా రచయిత కూడా చేయవలసిన మాటనిజమే అయినా పరిశోధనకంటే ఉన్నతమయినది బాధ్యతగల పత్రికా రచయిత చేయవలసిన పని. అంతేకాదు. పరిశోధకుడు అంతకుముందు తన రంగంలో తన పరిశోధనకు సంబంధించిన అంశాన్ని గురించి జరిగిన కృషిని సమీక్షించి, వాస్తవాలనుంచి కొత్త అంశాలను-తన పరిశోధనాంశం గురించి వెలువరించవలసి వుంటుంది. ఈ రెండు వ్యాసంగాలూ అసిధారా వ్రతం వంటివి అయినందున వాటిని గురించి అంత తేలికగా చెప్పడం సబబు కాదనుకుంటాను.

వార్తను వ్రాయటంలో ''పాత్రికేయుడు'' ఆలోచించవలసిన విషయాలంటూ యీ రచయిత పేర్కొన్న నాలుగు మార్గదర్శక సూత్రాలూ ముఖ్యమయినవే. కానీ ఇంకా చాలా 'ధర్మాలను' పత్రికా రచయిత దృష్టిలో పెట్టుకొనవలసి వుంటుంది. పాత్రికేయుడు అనే పదాన్ని పత్రికా రచయిత అనే పదానికి ప్రత్యామ్నాయంగా యే మహానుభావుడు వాడుకలోకి కొనివచ్చాడో కానీ, అది యే భాషయో కొంత మందికి తెలియకపోవడంలో ఆశ్చర్యం వుండదు. అందునా పరిశోధనా వ్యాసంలో ఆ మాట వాడకపోతే వచ్చే ప్రమాదమేమిటీ! వాడుకలో వున్నదిగదా—అర్థం అవుతున్నదిగదా అని సమర్థించడం పరిశోధన చేసే రచయిత లక్షణంగా వుండరాదనుకుంటాను పాఠకుడిలో ఫలానా ఫలానా అంశాలు ఆసక్తిని కలిగిస్తాయని అంచనా వేయగలమే ని పాఠకుని అభిరుచి ఎప్పుడు ఎలా మారుతుందో చెప్పగలమా? ఏ గొప్ప రచయిత అయినా ఇంతవరకూ యీ అంశాన్ని స్పష్టంగా చెప్పగలిగాడా?

పోతే యీ పుస్తకంలో పేర్కొన దగిన ప్రత్యేకాంశాలు తొలి భారతదేశ పత్రిక, తెలుగులో పత్రికా రచన ప్రారంభంవంటివి. ఈ అంశాలను చర్చించిన తర్వాత ఫిలిం జర్నలిజం గురించి యీ రచయిత మదింపుజేశారు. 'ప్రజామిత్ర' వారపత్రిక గురించి యీ రచయిత చేసిన మదింపు బాగున్నది. ఇక ఆ తర్వాత ఇంటూరి వెంకటేశ్వరరావు, పి. వి. రాఘవరావు, పి సీతారామయ్య, పి. వి. రమణమూర్తి, ఒకొండ వెంకటేశ్వరరావు, జొన్నలగడ్డ రాధాకృష్ణయ్య గారలు ఫిలిం జర్నలిజం అభివృద్ధికి ఎలా దోహద పడినదీ మరింత వివరంగా వ్రాస్తే బాగుండేదనిపించింది.

''వెండితెర'', ''చలనచిత్ర'', తెలుగుతల్లి'', ''చిత్రాలయ'' ''సినీ హెరాల్డ్'', ''హెరాల్డ్ వ్యూ'' వంటి పత్రికలను గురించి రేఖామాత్రంగా మాత్రమే యీ రచయిత వ్రాశారు. ''ఆంధ్ర సచిత్ర వారపత్రిక'', ''ఆంధ్రప్రభ'', ''ఆంధ్రజ్యోతి'', ''జ్యోతి చిత్ర'', ''సితార''వంటి పత్రికలు చలనచిత్ర పరిశ్రమకు ఇస్తున్న దోహదాన్ని యింకా వివరంగా చర్చించి వుండవలసినది. పోతే చలనచిత్రాలను గురించిన సమీక్షలు యిలా వుండాలి అని ఆదర్శాలు చెప్పడం సులభమే. పత్రికలు చలన చిత్ర పరిశ్రమ ఇచ్చే అడ్వర్టైజ్‌మెంట్‌ల ఆదాయంమీద ఆధారపడకుండా తమ కాళ్ళమీద (పోనీ మరెలాయినా) తాము బతికే ఉపాయం ఏ పరిశోధకుడయినా సూచించాలి. పత్రికా రచయితలు కూడా సమాజంలోని వారేగదా! పత్రికల యజమానులూ సమాజంలో భాగమే గదా! వాణిజ్య

సూత్రాలూ, జీవిత విధానం ఒకరికి ఒకవిధంగానూ, మరొకరికి మరొక విధంగానూ వర్తించవుగదా? పరిశోధనా వ్యాసం వ్రాసే సందర్భంలో యీ అంశాలన్నింటినీ దృష్టిలో పెట్టుకోనవసరం లేదా ?

అంతమాత్రానే ఇది మంచి పుస్తకం కాదని భావించరాదు. ఈ యత్నం ప్రశంసించదగినదే. ఇంకా బాగా ఎందుకని వ్రాయలేదని బాధపడడం తప్పు కాదుగదా !

శ్రీ వి. ఎస్ అవధాని

## శైవ సాహిత్య పరిషత్తు ప్రచురణలు

[శ్రీశైల చరిత్ర. (రూ. 3–50), సర్వేశ్వర శతకము (రూ. 1–00), భక్త అక్క మహాదేవి (రూ. 2–00), భక్త మల్లమ్మ (రూ. 2–00) - అనే నాలుగు రచనలను గుంటూరు అరండల్‌పేట 7వ లైనులోని శైవ సాహిత్య పరిషత్తువారు ప్రచురించారు. వీటిలో శ్రీశైల చరిత్ర, భక్త అక్క మహాదేవి, భక్త మల్లమ్మ గ్రంథాలకు విద్యార్ణవ సాహిత్య సరస్వతి శ్రీ నూతలపాటి పేరరాజుగారు కర్త. సర్వేశ్వర శతకం యథావాక్కుల అన్నమయ్యది.]

భారతదేశంలోని ప్రసిద్ధ శైవ క్షేత్రాలలో శ్రీశైలం ఒకటి. దక్షిణదేశంలో వైష్ణవానికి శ్రీరంగం, తిరుపతి పట్టుగొమ్మలయితే; శైవానికి ఆంధ్రదేశంలో శ్రీశైలం, ద్రాక్షారామం ప్రసిద్ధ స్థలాలు. శ్రీశైల పర్వత తనివితీర వర్ణించిన కవి పాల్కురికి సోమనాథుడు పండితారాధ్య చరిత్రలోని ఒక ప్రకరణానికి ఏకంగా పర్వత ప్రకరణ మనే పేరు పెట్టాడు. ఆ పర్వతం పై నుండే పిపీలకాది బ్రహ్మపర్యంతర సృష్టిని విడిచిపెట్టక, విసుగు చెందక వర్ణించాడు. ఒక్క పవిత్ర పర్వతాన్ని ఇంతగా వర్ణించిన కవి ఉన్నాడో లేడో చెప్పలేం

శ్రీశైలం మహాభారతంలో పేర్కొబడింది హుయాన్ త్సాంగ్ వచ్చి చూచాడు. శంకరాచార్యులవారు శ్రీశైలాన్ని కీర్తించారు. సిద్ధ నాగార్జునుడు శ్రీశైలాన్ని బంగారుమయం చేద్దామని బ్రహ్మప్రయత్నం చేసినట్లు నవనాథ చరిత్ర చెబుతుంది. పాశ్చాత్యుల్లో మెకంజీ ఈ క్షేత్రాన్ని సందర్శించి బృహద్వ్యాసాన్ని ఇంగ్లీషులో రాశాడు. తెలుగు ఒరిజినల్ మెకంజీ సంచయంలోఉంది.

శ్రీ పేరరాజుగారు చక్కని వచనంలో సామాన్య పాఠకుడికి అందుబాటులో ఉండేటట్లు ఈ గ్రంథాన్ని సంతరించారు అక్కడక్కడ చిత్రపటాలు, మ్యాపులు చేర్చారు. కేవలం యాత్రికులే కాకుండా సాహిత్యాభిలాషు లందరూ చదవతగ్గ గ్రంథం.

యథావాక్కుల అన్నమయ్య సర్వేశ్వర శతకం శతక వాఙ్మయంలో రాజమకుటం లాంటిది. "సర్వేశ్వర శతకము, హృద్యమైన శైలిని, ప్రౌఢమైన భావములను, భక్తి, జ్ఞాన వైరాగ్య బోధకములైన కల్పనలను గలిగి అన్నమారాధ్య కవీశ్వరుని శివభక్త హృదయమును దెలుపుచు శతక వాఙ్మయమున కలంకారముగ" నున్నదని కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు 1925 లో వారు ముద్రించిన సర్వేశ్వర శతకానికి పీఠికరాస్తూ అన్నారు. కాకినాడ ఆంధ్ర సాహిత్య పరిషత్తువారు కూడా సర్వేశ్వర శతకాన్ని ప్రచురించారు. వావిళ్ల వారూ, రెంటాల సుబ్బారావుగారు, ఇంకా మరికొందరు వ్యాఖ్యానాలతో కూడా ప్రచురించారు. అన్నమయ్య శివ పంచస్తవములలోని భావాలను గ్రహించాడు సోమన ద్విపదకృతులలో ఇతని పద్యచ్ఛాయ లున్నాయని కొందరన్నారు. శైవ సాహిత్య పరిషత్తువారు ప్రచురించిన ఈ శతకానికి పీఠికా కర్తలెవరో తెలియదు. పీఠిక ఉప్పన చప్పగ ఉంది.

ఈ చిన్న పీఠికలోనైనా సర్వేశ్వర శతకం ఏ శైవ భేదానికి చెందిందో ఎత్తుకోలేదు. మంచి ముద్రణ భాగ్యం కలిగించిన శ్రీ ముదిగొండ చంద్రమౌళిగా రారాధ్యులై ఉంటారు కవికి అన్నమారాధ్యుడని పేరు పెట్టాడు. బహుశః కవి ఆరాధ్యుడై, శతకం ఆరాధ్య శైవానికి సంబంధించిన కృతిగా వారు భావించేరో లేదో కాని అన్నమయ్య ఆరాధ్యుడనే ప్రశస్తానికి భావిద్దాం.

భక్త మల్లమ్మ చరిత్ర ఆంధ్ర కర్ణాటక ప్రాంతాలలో బాగా ప్రచారంలో ఉన్న కథ హేమారెడ్డి మల్లమ్మ అనే చలన చిత్రం కూడా వచ్చింది. భ్రమరాంబికా పర్వప్రసాదంవల్ల సోమిరెడ్డి దంపతులకు శివభక్తురాలు మల్లమ్మ జన్మించింది. పుట్టినింటి వారికి, మెట్టినింటి వారికి కీర్తి ప్రతిష్ఠలు తెచ్చిన ధన్యజీవి మల్లమ్మ.

అక్కమహాదేవి బసవేశ్వరుని సమకాలీనురాలు. శివశరణురాం(డ)లో పేరెన్నిక గలది. ఈమె వచనములు చిరకాలం కిందటనే కన్నడంనుండి తెలుగునకు వచ్చినవి. లింగైక్యులు శ్రీ అక్కులయ్య దీక్షితులు వచనానువాదమును చేసినవారిలో మొదటివారు ఇటీవల మరికొంతమంది అనువదించిరి. అందులో శ్రీ రేకళిగ మఠం వీరయ్యగారి అనువాదం సరళ సుందరంగా సాగింది.

శైవసాహిత్య పరిషత్తువారు శివభక్తి సాహిత్యాన్ని అందరికీ అందుబాటులో ఉండే ధరలకు ప్రచురించడం అభినందనీయమైన విషయం.

శ్రీ వేంకటరావు

## కన్నడ కథానికలు

[సంపాదకులు శ్రీ ఎల్. ఎస్. శేషగిరిరావు, తెనుగు సేత: శ్రీ గడియారం రామకృష్ణశర్మ. ప్రచురణ: సాహిత్య అకాడెమీ న్యూఢిల్లీ. వెల: రూ. 8-00]

కన్నడములో చిన్న కథలకు ఎనుబదేళ్ళ చరిత్ర వుంది. కాని వాటిని తీర్చిదిద్దిన విశిష్టత శ్రీ మాస్తి వెంకటేశ అయ్యంగార్‌కు (శ్రీనివాస) చెందింది. 'సూర్యుని కాంతి ఒక మంచు బిందువులో కేంద్రీకృతమై రత్నమువలె మెరసినట్లు, ఒక మహా జీవనమునకు

సంబంధించిన విషయము నంతను చిన్న కథలో ప్రకాశింపజేయగల సామర్థ్యము శ్రీనివాసగారి కథలలో మనము తొలిసారి దర్శించెదము' అని సంపాదకులు 'ప్రస్తావన'లో పేర్కొన్న వాక్యం సత్యపూర్ణమైనది.

ఈ సంపుటిలో ఇరవై రెండు కథలున్నాయి. మసుమత్తి (పరకాయ ప్రవేశం) అనే 'శ్రీనివాస'గారి కథ మొదటిది.

'మసుమత్తి' ఒక చిన్న పల్లెటూరు. ఎమిలీ ఫర్క్యువర్ అను విదేశీయులు మనదేశంలో పర్యటిస్తూ 'మసుమత్తి' చేరుకొంటారు. ఆ గ్రామంలోని ఒక ముసలివాని యింటవున్న ఒక అసంపూర్ణమైన చిత్రాన్ని కొనడానికి సిద్ధమవుతారు. ముసలివాడు, ఆ చిత్రాన్ని చనిపోయిన తన పెద తాత ఆజ్ఞ మేరకు అమ్మడానికి వీలులేదంటాడు ఎప్పుడో ఒకసారి తన పెదతాత దానిని పూర్తి చేసి పోతాడని అతని నమ్మకం. చివరకు ఎమిలీ'వీరి నాగరికత నశించి వున్నదని, మా నాగరికతను మేమిచటికి ప్రచారమునకు తెచ్చుట పరకాయ ప్రవేశమువలె దుఃఖహేతువగునేమో అను సందేహం కలుగుతున్నది' అని తన సందేహాన్ని వెలిబుచ్చుతుంది. కథ అంతటితో ముగుస్తుంది.

'ఆనందకంద'గారి 'నీవు బాబు తల్లివి' మనసును కరిగించే కథ. అక్క, బావ ఆశ్రయంలో పెరిగిన ఇందు ఒక యింటి ఇల్లాలయింది. మగబిడ్డను కని అక్క అకాల మరణానికి గురవుతుంది. అక్కకొడుకును కన్నబిడ్డలా పెంచుతుంది. కొంతకాలానికి ఇందు కడుపున కాయకాస్తుంది. తన బిడ్డపైని మమకారంతో అక్క కొడుకు కుమార్‌ను నిర్లక్ష్యం చేస్తుంది తమ్మునిపై మోజుతో తనను విస్మరించిందన్న బాధతో కుమార్ కుమిలిపోయి తమ్ముని ఆటవస్తువులను ధ్వంసం చేస్తాడు. ఇందక్క కుమార్‌ను పిలిచి బుజ్జగిస్తుంది. తన తల్లి ఎక్కడుందంటే పరలోకంలో వున్నదంటుంది. కుమార్ తల్లిని వెతుక్కుంటూ పోతాడు. ఇందక్క కలలో కన్పించిన కుమార్ 'నీవు బాబు తల్లివి' అంటాడు. శిశు మనస్తత్వాన్ని అతి సహజంగా నిరూపించిన కథ యిది.

శ్రీపతిగారి 'గురువుల మహిమ' మనో విశ్లేషణాత్మకమైన కథ. అందరూ ఆడపిల్లలేగల ఒక కుటుంబిని మగబిడ్డ కోసం ఆరాటపడుతుంది. తన కూతురును యిచ్చి అల్లుని ఇల్లరికంలో వుంచుకొంటారు. ఆ వూరికో మహిమాన్వితుడైన స్వామివస్తాడు. తనకో మగబిడ్డ కలుగునట్లు ఆశీర్వదించమని స్వామిని యాచిస్తుంది. ఇంతలో కూతురు మగబిడ్డను ప్రసవించి కన్నుమూస్తుంది. స్వామి ఆ బిడ్డనే తన బిడ్డగా పెంచుకోమని సమాధానం చెబుతాడు. అయినా ఆమె వినకుండా గురువును అర్థిస్తుంది. స్వామి, ఎవరికి వారే సమాధాన పడవలెనంటూ 'సంసారమూ ఒక తోట వంటిదే తల్లీ. ముదిరిన చెట్లు పెరిగిపోవు చుండును. లేత మొక్కలను చూడకున్న ఎట్లు ?' అంటాడు.

కె. గోపాలకృష్ణరాయర 'డా. సుశీలా సంకేత్' బాల్యంలోనే విధవ అయిన ఒక అమాయకురాలైన యువతి విచిత్ర పరిస్థితులలో విద్యాధికుడైన యువకుని కామతృష్ణకు గురి అవుతుంది. అతడు విరక్తుడై నిష్కలానంద స్వామిగా మారిపోతాడు. అనూహ్య పరిస్థితులలో ఉదార హృదయులైన దంపతులు ఆమెను చేరదీసి చదివిస్తారు. ఆమే డాక్టర్ సుశీలా సంకేత్. తన ప్రియుడు నిష్కలానందస్వామిగ వున్నాడని ఆమెకు తెలియదు కథ ఫ్లాష్‌బ్యాక్‌లో చెప్పబడింది.

కన్నడ కథా రచయితలలో అగ్రగణ్యులైన అ. న. కృష్ణరావుగారి 'మంటి కొడుకు' కథ భూమిపై మక్కువ పెంచుకొన్న ఒక గ్రామీణ యువకుని గాథ. రామయ్య సన్నకారు రైతు. అతని కొడుకు సిద్ధయ్య గంగడొక పాలేరు. గంగని కుటుంబంలో తల్లి, భార్య మాత్రమే సభ్యులు. గంగయ్య, సిద్ధయ్య మంచి మిత్రులు. సిద్ధయ్య ఎవరికీ చెప్పకుండా సైన్యంలో చేరిపోతాడు. కొన్నాళ్ళకు తిరిగి వచ్చిన సిద్ధయ్య వేష భాషలను చూసి గంగడు కూడ దండులో చేరతాడు యుద్ధ విరమణతో గంగడిని సైన్యం నుండి విడుదల చేస్తాడు. అప్పటికి వాడు చేస్తున్న భూమి ఇతరుల పాలైంది. తల్లి, భార్య కూలి నాలి చేసి పొట్ట పోసుకుంటున్నారు. గంగయ్య చేస్తున్న భూమిని సాగుచేస్తున్న ఈరప్ప 'బంగారట్లా భూమి గంగప్పా. పంట ఎట్లుంది ?' అంటాడు. అప్పటికే కుంగిపోయిన గంగయ్య తనచేతిలోని పికాసితో ఈరప్పను ఒక్కపెట్టుతో చంపేస్తాడు. పోలీసులు గంగయ్యను పట్టుకొనిపోతారు. గంగని ముసలి తల్లి భూమి తల్లి శాపం అంటూ మట్టిలో కలిసిపోతుంది.

గోరూరి రామస్వామి అయ్యంగార్ రచించిన 'కమ్మరి వీరభద్రాచార్యులు' కథలో గ్రామ జీవితాన్ని చక్కగా చిత్రించారు.

మహాకవిగా ప్రసిద్ధులైన కువెంపు (డా॥ కె వి. పుట్టప్ప) గారి 'మీనాక్షి ఇంటి మేష్టరు'లో మీనాక్షి అనే అమ్మాయిని ప్రేమించిన ప్రైవేటు మాస్టరు కథ మేష్టరు మీనాక్షిని ప్రేమించినట్లు ఆమెకు తెలియదు. మీనాక్షి వివాహం మరొకరితో జరిగిపోతుంది మీనాక్షి భర్తను చంపి ఆమెను సుఖపెట్టాలనుకున్న మేష్టరు ఆ దంపతుల అనురాగాన్ని చూచి తన ప్రయత్నం విరమించుకొని పశ్చాత్తప్తుడవుతాడు

భారతీప్రియగారి 'మోచీ'లో దైన్యం ఆత్మాభిమానం అతి విచిత్రంగా మేళవింపబడిన వ్యక్తిత్వం ఉదాత్తంగా చిత్రింపబడింది.

అశ్వత్థగారి 'వ్యభిచార' కళాత్మకమైన కథ. వ్యభిచారమనునది దైహికంగానే కాక బౌద్ధికంగా కూడా వుంటుందని నిరూపించిన కథ.

త. రా. సుబ్బారావుగారి 'ఇంకో ముఖం' ఎత్తుగడలోనే ఎంతో ఆకర్షణీయంగా వుంది. కథలో హఠాత్తుగా బ్రతుకు నడుమ చావు ఎదురొడ్డి నిలుస్తుంది. వీరి శైలి గంభీరం.

నిరంజనగారి 'కొనెయ గిరాకి'లో స్వార్థం భోగలాలసత్వంతో నిండిన సమాజంలో ముగ్ధురాలైన ఒక మగువ బలి పశువైన తీరు ప్రేవులు పిండునట్లుగా చిత్రింపబడింది.

బసవరాజ కట్టీమని ప్రముఖ ప్రగతిశీల రచయిత. 'బూట్ పాలిష్' కథలో తల్లి నెరుగని బాలుడు స్త్రీలను చూచినపుడల్లా వారిలో తన తల్లి కొరకు అన్వేషిస్తాడు. కథ జీవితంలో ఒక భాగంగా సాగింది.

ఎం. వి. సీతారామయ్యగారి కరుణలో సమాజంలోని అంతస్తుల తారతమ్యలు అతి సహజంగా చిత్రింపబడ్డాయి.

నరేంద్రగారి 'రేవు' కథ వాస్తవ జగత్తు, కల్పనా జగత్తుల మధ్య వూగులాడు ఒక జీవిగాథ.

చదరంగగారి 'భావబంధనె' కథా వస్తువు చిన్నదైనను చెప్పిన తీరు కళాత్మకంగా వుంది. అక్కచెల్లెళ్ళు జీవితంలో అముఖ్యమైన సంఘటనలు కొండంతలైన తీరు నేటి నాగరిక జీవనానికి అద్దం పట్టింది

శ్రీమతి త్రివేణిగారి 'చంపి' బాలల మనస్తత్వాన్ని సహజ సుందరంగా చిత్రించింది.

సదాశివగారి 'కొళాయిలో నీళ్ళు వచ్చినవి' నగర జీవితంలోని ఆందోళనను ప్రశాంతిని సహజంగా చిత్రించింది.

ఈ సంపుటిలోని కథలన్నీ వస్తువైవిధ్యంతో శిల్ప ప్రాధాన్యంతో కళాత్మకంగా రచింపబడ్డాయి. గడచిన ఏబది సంవత్సరాలలో కన్నడ కథా రచయితలు విజ్ఞాన మనస్తత్వ శాస్త్రాలలో క్రొత్త భావాలను, ఆర్థిక వ్యవస్థలోని మార్పులను, విదేశీ సాహిత్య సంస్కృతుల ప్రభావాలను, ఆధునిక నగర జీవితంలోని లోటుపాట్లను క్షుణ్ణంగా అధ్యయనం చేసి కథలలో చొప్పించారు. ఈ కథలన్నీ చదివిన తరువాత అత్యుత్తమ కథలను చదివామన్న తృప్తి కలుగుతుంది.

అనువాదం గురించి ఒక మాట. ఈ కథలను అనువదించిన శ్రీ గడియారం రామకృష్ణశర్మగారు తెలుగు కన్నడములలో గొప్ప పండితుడు. అనువాదంలో ప్రధానంగా శిష్ట వ్యావహారికాన్నే వాడేవారు మరికొంత సులభశైలిలో వ్రాసియుండిన పాఠకులకు మరింత హాయిగా వుండేది. కొన్ని చోట్ల వారు వాడిన పదాలు కన్నడ ప్రభావాన్ని ఎక్కువగా చూపుతాయి. మచ్చుకు భాషణములు (మాటలు); ఉర్లిపోవు (దొరలిపోవు) ఉమ్మసు (ఉత్సాహం) గదిరిస్తుండిరి (గద్దిస్తుండిరి) బుడను (మొదలు) మున్నగునవి.

సంపాదకులు తమ ప్రస్తావనలో కన్నడ కథానికల స్వరూపాన్ని చక్కగా చిత్రించారు. చివర రచయితల పరిచయం ఇవ్వబడింది. కాని వారిలో కొందరు కీర్తిశేషులైన విషయం పేర్కొనలేదు. 1979 లో ప్రచురింపబడిన ఈ సంపుటిలో రచయితలను గురించిన వివరాలు నిర్దుష్టంగా (Up-to-date) ఇచ్చి వుంటే బాగుండేది.

తెలుగు వారికి అతి సన్నిహితమైన కన్నడ భాషలోని వుత్తమ కథలను అందజేసిన కేంద్ర సాహిత్య అకాడమి అభినందనార్హము. ఇటీవల కవితా సంపుటాలు విరివిగా వస్తున్నాయి కాని కథా సంపుటాలు అంతగా రావటం లేదు. సాహిత్య అకాడమి మరికొన్ని కథా సంపుటాలను వెలువరించగలదని ఆశిస్తున్నాను

## ఉత్తర కర్ణాట జానపద కథలు

[సంపాదకులు: శ్రీ సింపి లింగణ్ణ, తెలుగు అనువాదం: శ్రీ ఎన్. సి. రామానుజాచార్యులు. ప్రచురణ: సాహిత్య అకాడమీ, న్యూఢిల్లీ. వెల: రు 12.00 ప్రతులకొరకు: సాహిత్య అకాడమీ, దక్షిణ ప్రాంత కార్యాలయం, 29, ఎల్డామ్స్ రోడ్, తేనాంపేట, మద్రాసు–600018].

ఈ కథా సంపుటిలో రమ్య కథలు, మానవాతీతుల కథలు, వాస్తవిక కథలు, తెలివి తేటల కథలు వివరణాత్మకమైన కథలు, నీతి కథలు, జంతువుల కథలు, వినోద కథలు అను ఎనిమిది రకాలైన నూట డెబ్బై మూడు కథలున్నాయి

జానపద కథాకర్తలు విద్యావంతులు కాకున్నా అద్భుతమైన భావన శక్తి కలవారనుటకు ఈ సంపుటంలోని కథలు సాక్ష్యంగా వున్నాయి విన్న కథను, నేర్చుకున్న పాటను మరొకరికి వినిపిస్తూ జీవన వికాసానికి ఆస్పదం చేయడం సద్ధర్మమని నమ్మినవారు తాత ముత్తాతలు. కథలను చెప్పటానికి ఒక ప్రయోజనమున్నట్లే వినేందుకు ఒక ప్రయోజన ముంటుందంటారు పెద్దలు అంటూ రత్నాకరవర్ణి చెప్పిన జైన ఇతిహాస కథను సంపాదకులు క్రింది విధంగా వుటంకించారు.

> ''ఈ జైన ఇతిహాస కథను విన్నవారి పాపం
> సమూలంగా పరిహారం అవుతుంది.
> తేజోవంతులై పుణ్యవంతులై ముందు ముందు
> అపరాజితేశ్వరుని అనుగ్రహం సంపాదిస్తారు.''

అపరాజితేశ్వరుని అనుగ్రహం కలుగుతుందో లేదో కాని జానపద కథల సేకరణ కార్యక్రమం దేశప్రగతికి అత్యావశ్యక కర్తవ్యమున్న సంపాదకుల అభిప్రాయాన్ని మనం కాదనలేము.

'పతివ్రత సంగమ్మ' 'మలవయ్యశెట్టి' కథలు చరిత్రకు సంబంధించినవి ఎగమల్లి దిగమల్లి, అల్లుని అర్హత మొదలైనవి ఉపనిషత్కథలను స్ఫురింపచేస్తాయి.

''దేవుడు ఇస్తే ఏం తక్కువ'' ఒక నిరుపేద విధవరాలి కొడుకు కథ. బడిలోని తక్కిన పిల్లలు మంచి బట్టలు, విందులు వినోదాలు అనుభవిస్తుంటే తానెందుకు లేనివాడిగా బ్రతుకుతున్నానని తల్లిని అడుగుతాడు. 'దేవుడివ్వలేదు నాయనా!' అంటుంది ఆమె. ఆ బాలుడు దేవుని వెతుక్కుంటూ పోతాడు. ఒక సత్పురుషుడు అనుగ్రహించి మంత్రపూరితమైన పళ్ళె మొకటి ఇస్తాడు. చిత్ర విచిత్ర సంఘటనల తరువాత ఆ పిల్లవాడు అపార ధనాన్ని సంపాదించి తల్లితో సుఖంగా వుంటాడు.

'రుచి-మధురం' వాస్తవిక కథ. ఒక ఊళ్ళో అనాథయైన ముసలమ్మ రాట్నం వడుకుతూ పొట్ట పోసుకుంటూ వుండేది. ఒక రోజు రాత్రి నోట్లో నీళ్ళు పోసుకొని ఎక్కడికి పోయినారో 'నా రుచీ, నా మాధుర్యం' అంటుంది. పక్కయింటివారు ఈ మాటలు ఎవరితోనో మాట్లాడుతున్నదనుకొని 'అవ్వా! నీవెవరితో మాట్లాడుతున్నావ'ని ప్రశ్నిస్తారు. అయ్యా పాతకాలపు రోజులు గుర్తొచ్చి యింకెక్కడి రుచి యింకెక్కడి మాధుర్యం అన్నాను. ఊడిపోయిన పళ్ళను గురించి అన్నాను అంటుంది. పళ్ళు పోవటంతో నా రుచి నా మాధుర్యం రెండూపోయాయి అంటుంది.

'నాకేమి యిచ్చారు', 'మానవాతీతుల కథ'. మానవమాత్రుల భార్యలవలె శివుని భార్య కూడా కొన్ని రోజులు పుట్టినింటికి వెళ్తుంది. పుట్టినింటివారు యిచ్చిన కానుకలను వర్ణిస్తూ ప్రతి మాటకూ నా వాళ్లు బీదవాళ్ళు ఇంకేమిస్తారు అని వినయంగా చెబుతూ అహంకారం ప్రదర్శిస్తుంది. ''నీవాళ్ళు నీకు యిన్ని యిచ్చారు మరి నాకేమి యిచ్చారు'' అని అడుగగా యివన్నీ నాకు యిచ్చి నన్నే నీకు యిచ్చారు అంటుంది. శివుడు ఎంతో సంబరపడతాడు.

ఈ రీతి కథలన్నీ అద్భుతంగా సాగాయి.

శ్రీ ఎన్. సి. రామానుజాచార్యుల అనువాదం సరళంగా సాగింది.

ఉత్తర కర్ణాటక ప్రాంతానికి చెందిన జానపద గాథల యీ సంపుటి అన్ని రకాల పాఠకులను అలరిస్తుంది.

శ్రీ జానమద్ది హనుమచ్ఛాస్త్రి

## మన నవల - పరిశీలన

[వెల: 12-00, ప్రతులకు: (1) ఆంధ్ర సారస్వత పరిషత్, బొగ్గులకుంట, తిలక్‌రోడ్డు, హైదరాబాద్. (2) టి. బాలరాజు (కార్యదర్శి, చైతన్య సాహితి), జిల్లా ట్రెజరీ కార్యాలయం, సుబేదారి, వరంగల్ - 506 010.]

ఇది తెలుగు నవలను గురించి వివిధ రచయితలు అనుశీలించిన గ్రంథం. ఇటీవలి కాలంలో నవలలపై ఎక్కువగా పరిశీలన జరగడం ఆనందించదగిన విషయం. ఆరంభ వికాసాలు అనే వ్యాసంలో డా॥ బి. రుక్మిణిగారు తెలుగు నవల చారిత్రిక పరిణామాన్ని వివరించారు. 'స్వరూపం - పరిణామం' అనే వ్యాసంలో సంపత్కుమారగారు తెలుగు నవలకు ఆదిలోగల పేరు ఆ పేరు నవలగా రూపొందిన విధం, వస్తువులో సంవిధానంలో వచ్చిన పరిణామం ఆలంకారికంగా వివరించారు 'తాత్త్విక చింతన' ముదిగొండ వీరభద్రయ్యగారి వ్యాసం ఆవేశాత్మకంగాను, ఆలోచనాత్మకంగానుఉంది. మహీధర రామమోహనరావుగారి 'సామాజిక చైతన్యం' వ్యాసం మార్క్సు, ఏంగిల్సులభావాలకు వివరణే కాకుండా సామాజిక చైతన్యం నవలలో రూపుకట్టిన విధం స్థూలంగా పరిశీలించడం జరిగింది. పేర్వారం జగన్నాథంగారు తెలుగు నవలలో 'జాతీయోద్యమం' ఏ విధంగా ప్రతిఫలించిందీ విశ్లేషించారు. 'కుటుంబ జీవనం' వ్యాసంలో డా॥ సి. ఆనందారామంగారు విశ్వనాథ, చలం మొదలైనవారి నవలల్లో ప్రతిఫలించిన కుటుంబ స్వరూపాన్ని, దాని పరిణామాన్ని సాక్షాత్కరింపజేశారు. డా॥ అక్కిరాజు రమాపతిరావుగారు తెలుగు నవలలోని శైలిని, కథా సంవిధానాన్ని దాని మార్పుని చక్కగా విశదీకరించారు. తెలుగు నవలకుగల భూత భవిష్యద్వర్తమానాలను 'అతీత - వర్తమాన - భవిష్యత్తులు' అనే వ్యాసంలో సుప్రసన్నగారు చర్చించారు కె. కె. రామానుజాచార్యులుగారు ఈ మొత్తాన్ని 'సమాలోచన' చేశారు.

ఈ విమర్శ గ్రంథం తెలుగు నవల, దాని పుట్టుపూర్వోత్తరాలు తెలుసుకునేందుకు బాగా ఉపకరిస్తుందనడంలో సందేహం లేదు. అయితే ఈ కృషి ఇంకొంచెం విస్తృతంగా సాగి ఉంటే బాగుండేది. తెలుగు నవల అంటే రచయితలే కాదు రచయిత్రులు కూడా ఉన్నారు అనే స్పృహ పాఠకునికి కలిగేలా ఉన్నట్లయితే మరింత బాగుండేది. ప్రతి ఒక్కరూ విశ్వనాథ, అడివి బాపిరాజు, చలం, గోపీచంద్, బుచ్చిబాబు మొదలైన నవలాకారుల్నే పరిగణనలోనికి తీసుకొనడం జరిగింది. అక్కడక్కడా మిగిలిన కొన్ని పేర్లు ఉదాహరణలుగా కనిపిస్తాయి. చండీదాస్ హిమజ్వాల, నాగరాజు ఊబిలో దున్న, నవీన్ అంపశయ్య మొదలైన నవలలు తెలుగు నవలకు పుష్టిని కలగజేసినవే కదా! వాటి ప్రస్తావన, విశ్లేషణ

ఎక్కడా కనపడదు. రచయిత్రులలో లత, రంగనాయకమ్మ, ద్వివేదుల విశాలాక్షి, వాసిరెడ్డి సీతాదేవి, ఆనందారామం మొదలైన రచయిత్రుల నవలలపై సమగ్ర చర్చ లేకపోవడం లోపమే. పేర్లు ఉదహరించినంత మాత్రంలో న్యాయం జరగదు.

ఒక బృహత్తర ప్రయత్నంలో అల్పమైన లోపాలు కొన్ని ఉండవచ్చు. చైతన్య సాహితివారు భవిష్యత్తులో మరిన్ని ఉత్తమ విమర్శ గ్రంథాలు వివిధ ప్రక్రియలపై వెలయిస్తారని ఆశిద్దాం!

**శ్రీ టి. ఎల్. కాంతారావు**

## శ్రీ మల్లికార్జున శతకము

[చోడవరపు సత్యవతీదేవి. క్రౌన్ 48 పుటలు, వెల : రు. 3, ప్రతులకు : చోడవరపు రాఘవాచారి, చెరుకుపల్లివారి వీధి, విజయవాడ – 520 002.]

కవి ఆత్మానుభూతిని వ్యక్తిత్వాన్ని చూపే చేతి అద్దమే శతకం. ఇది భావ శబలతకు వర్ణరూపం. శతకవాఙ్మయం తెనుగు వారి గంటు. వర్ణప్రసాదమైన కవిత్వంతో ఈమె సంస్కార పాండిత్యము ద్యోతకం అయ్యేటట్లు పద్యం వ్రాయగలిగి చదువరిని స్పందింపజేస్తున్నది.

ఈ శతకం ఆత్మపరివేదనతో శ్రీశైలమల్లికార్జున దేవునికి నివేదించుకొంటున్నది. శరణాగతి విధానమే ఇందు ఎక్కువగా చెప్ప బడుతున్నది. ఝంఝూ మారుత బీభత్సానికి ఈమె మనసు వికలమై ఈ పద్యాలతో విలపింపజేస్తున్నది. కన్నబిడ్డలను కాలుడు కబళించినందున ఈమె మనసు శిశువులపై ప్రాకడం సహజము — ఉచితము కూడా. అందువల్లనే దివిసీమ తుఫానులో మరణించిన అసహాయ శిశువులకుగా ఈ కవిత్వం కుమిలి అశ్రుతర్పణం వదలుతున్నది.

పద్యాల నడక కుంటుబడకుండా మంచి భాషలో నడిచిపోతున్నది.

## మంజీర నాదాలు

[గేయ కావ్యం. వేముగంటి నరసింహాచార్యులు, క్రౌన్ 40 పేజీలు, ధర : 3 రు., ప్రతులకు : కాకతీ పబ్లికేషన్, నారాయణ గూడా, హైదరాబాదు – 500 024.]

గోదావరి ఉపనది మంజీరకు — మనుష్య స్వభావారోపణం చేసి, ఒక కావ్య కళానిధి సంగీత స్రోతస్వినిగా పారించిన రసవత్తర కావ్యం ఇది. మహారాష్ట్ర కన్నడ దేశాల ఆడపడుచులైన గోదావరి కృష్ణానదులు ఆంధ్రమాతకు అనుగు కోడండ్రయి ఆమెను అన్నపూర్ణను జేసిన జీవనది స్తోత్రం — కవితా శిల్ప సుమమమైన ఈ గేయ కావ్యం. ఆ రెండు భాషలు, ఉరుదూ తెనుగులతో కలసి "నాలుగు భాషల మేలిమిని" చిందిస్తూ "మహిత మనస్విని మధుర పయస్విని" అయిన "మంజీరాధునిని — మహిళా పదగత మంజీర ధ్వనిగా" పరికల్పన చేసినాడు. "తెలుగు సంస్కృతి బలిమిని, తెలుగుచరితపు కలిమిని కెరటాల పుటలందు విరచించుకొన్న" దట! హృద్యాలంకారం!

ఆరు ఋతువులలో ఈ ఏరు ఎండి, పొంగి పారిన విధానానికి కవిత్వశోభ అబ్బేటట్లు ఋతువర్ణనను జోడించి చెప్పడం పాండిత్య ప్రకర్షకం. మంజీర తియ్యటి నీరు చక్కెరను పండిస్తున్నది కాబట్టే వేముగంటివారి వేముకు తీపెక్కి కవితకు గూడ మాధుర్యమెక్కినది. అసలు వేము లక్ష్మీ ప్రతీకం గదా!

కవి ఊహలు ఉత్ప్రేక్షలు చిత్రీకరణ వైభవము తెనుగు నుడికారంచేత ప్రాణం పోసుకొని ఉన్నవి. గేయమంతా ఒక మహాశిల్పి మలచిన సౌభాగ్యమూర్తిగా ఉన్నది. ఇందు భావ వ్యక్తీకరణ శక్తి పండి రుచులూరిస్తున్నది.

రచన "మూగ తెలంగణా వీణను మీటి" పదబంధ కల నినాదాన్నిపుట్టించి జాను తెనుగునుకోరే చెవులకు విందుచేస్తున్నది. తెలంగాణా, రాయలసీమ, నెల్లూరు మాండలికాలలో ఐక్యత ఉన్నది. ఈ కొన్ని మీరు విని, అన్నీ చదవండి వలపు తలపువలె పులకలు దేరుచు, తెరలు తెరలుగ తేలిపోవగ రెల్లు పువ్వుల మల్లుసెల్లా; ప్రజలకొరకే జీవనమ్మును ధారవోసే (జీవనం అంటే నీరు — ప్రాణం, ముగ్ధ మనోజ్ఞమైన శ్లేష) ముళ్ళ కంచెలను విరిదళ్ళుగా సవరించి, ఏడు పాయలు ఏడు స్వరాలై మ్రోయగ— (ఈ మంజీర అందియ ధ్వని పాఠకుని హృదయ వీణనుగూడ మీటుతున్నది.)

ఈ ఉపనది త్రాగు నీరిచ్చి, ఎండిన బీళ్లను త్రాగించి సస్య లక్ష్మితో పులకరింపజేసిన వైనం ఇంపుగా చెప్పబడి ఉన్నది. ఈ మంజీరానది "ఆంధ్ర ప్రజాకోటికి ఆనంద రసధార" అయినదని ఈ తెలంగాణా పౌరుడు మురిసిపోతున్నాడు.

## మేలుకొలుపు

[శిష్ట్లా బాల కోటేశ్వరరావు. క్రౌన్ 24 పుటలు, వెల : 2 రు., ప్రతులకు : నీలా బాలకోటేశ్వర్, శ్రీ నీలా నిలయం, కాటావుల పల్లె, పెద్దాపురం తా.]

"కలియుగ కల్యాణ చక్రవర్తి" ఏడుకొండల వేల్పుకు ప్రార్థనగీత రూపమైన మేల్కొలుపు పాట ఇది. భక్తిని జాలువారించే సంస్కృతాంధ్ర పదబంధాలు తన్మయతను గొల్పుతున్నవి. ఇవి స్తోత్ర పాఠాలుగా ఉభయ సంధ్యలలో గానంచేయగలిగి ఉన్నవి.

నుడికారంలో ఒక కొత్తదనపు తీపును చూపుతున్నాడు—ఈ కవయిత. కాస్త ఉపద్రవ భక్తి న్యాయనిది. "నన్నరయనినాడు, నాదు మరియాదను నిల్పనినాడు, నీవెటు ల్వరదుడ వౌదువు" అని గడుసుదనంతో అడుగుతున్నాడు. భక్తునికి ఈ మాత్రపు చనవుండటం అవసరమే. కాబట్టే "మానిసివలె ఎదుగనిమ్ము" అని

ఉత్కృష్ట వాంఛను వెలువరిస్తున్నాడు. మూలవరులను 'చిన్నరి చిఱునవ్వు లొాదవి సన్నజాజి పువ్వులవలె నీపెదవుల పొదలునపుడు'' అని మనోజ్ఞంగా వర్ణిస్తున్నాడు. సర్వ సౌభాగ్యాల ఒలికించే ఈ రుద్ధ మందస్మితం క్షీరాభిషేక సమయంలోచూచిన భక్తులునిజంగా ధన్యులు నగల వేషంతో ఈ నాణ్యం మునిగిపోయినది.

వాగను శాసనుడు మొదలు సినారె సినిమా పాటల వరకు ఆమోదించి ఆనందించిన సమన్వయ హృదయం ఈయనది. కాని, ఈనాడు గూడ ''గోబ్రాహ్మణ పరిరక్షణ నిపుణా'' అని ప్రత్యేకించి ఇతర జాతులను రెచ్చగొట్టడం, సిపీలికాది బ్రహ్మ పర్యంతం కొలిచి సాక్షాత్కరించుకొనే హిందూ మతానికి పాడికాదేమో. ''సర్వేజనా స్సుఖినో భవంతు'' అు అంటే ఏమిపోతుంది.

ఒక వక్రోక్తి — ''సర్వేజనం'' అంటే కలెక్టర్ ఆఫీసు గుమాస్తాలకు కోపం వచ్చినదట !

## తిక్కన

[కావ్యం. శిష్ట్లా బాలకోటేశ్వరరావు క్రౌన్ 64పొరటలు, వెల : 3 రు , ప్రతులకు : లీలా బాలకోటేశ్వర్, కాటావులపల్లి, పెద్దాపురం తా.]

'కవి చెప్పకొన్నట్లు — భాష రచన కథన దృష్టితోచూస్తే ఇది రసవత్తర కావ్యమే! కవిత గంభీరధారా మనోజ్ఞమై, సంస్కృతము రమ్యపద గుంఫనమై, తెనుగు చవులూరించే కొంగ్రొత్త నుడికామై చదువరిని సొంపున కరిగిస్తున్నది సీసపద్యాలు శ్రీనాథుని శైలిలో, వృషభేంద్రునివలె మెడవంచి రంకెలువేస్తూనడుస్తున్నవి. భాషలో సరళ పేశల రామణీయకము కొండవాగువలె—మంజీర నాదాలతో సాగుతున్నది. కథ చెప్పడంలో మంచి ఒడుపుఉన్నది. తిక్కన సోమయాజి మనుమసిద్ధి సభాప్రవేశం, చానమ్మ, భర్త - ఖడ్గ తిక్కనకు వీరకుంకుమ నొసట దిద్ది యుద్ధానికి పంపే ఘట్టం బాగున్నవి. ఈ భాషా సౌరభం మూర్కొనండి — ఎవ్వాని దరహాస మిందు రేఖారుచి తలదన్ని బుధులకు వెలుగుగూర్చె, రమణీయకావ్య సౌరభ వీచికలగాని పులకింప దెవ్వని సద్బుద్ధి హంస, పినాకిని తత్తరంగ హస్తముల స్పృశించినంత వివశంబయి మట్టియు బంగారాగదా; పాండుర యశమ్ము చివాలున వచ్చి వ్రాలు; వికసించెను కాల వృక్ష మందొండు నవ ప్రసూనము; కల్లలు గంపకెత్తు; కడలి విడనాడి రవి తూర్పు గడపదాటె; కీర్తి మరీచి పూరితాశావకరుండు.

కాని, పుక్కిటి పురాణాన్ని చేబట్టి చరిత్రను పాడుచేసినాడు ఈ కవయిత. పుస్తక నామకరణంలో వాస్తవికతగాని ఔచిత్యంగాని లేదు. తిక్కన అంటే కవి తిక్కన సోమయాజిమీదకే మనసు పోతున్నది; ఖడ్గ తిక్కన అని పేరుబెట్టి ఉండవలసినది. ఖడ్గ తిక్కనను గూర్చి లోకవ్యాప్తి నొందిన చాటువులు (చాటు పద్య మణిమంజరి) ఈయన చెవినబడినట్లు లేదు. మొదట తిక్కన ఓడునది పెనుబల్లి చెరువుదగ్గర ఓడి ఇంటికిపోతే, భార్య చానమ్మ స్నానానికి పసుపు ముద్దపెట్టి, ఇదేమంటే ''ముగురాడు వార మైతిమి'' అన్నది. (అత్త—తనతో గలసి.) తల్లి భోజన సమయంలో విరిగిన పాలిచ్చి, ''పోరులో విరిగిన వానికి పాలు ఇరుగవా'' అని అంకుశాలతో పొడిచి, పౌరుషమెక్కించి యుద్ధానికి పంపుతారు. ఈ రసవత్తర ఉదంతాలు ఇందులేవు.

ఈ యుద్ధం మనుమసిద్ధి—కాటం రాజుల పశువుల పులవరి (పుల్లరి) వివాదం అని ఈ కవి వ్రాత. మొదటికిపస్తే ఈ కాటం రాజు కరావుల రాజుకథ కల్పితమని విమర్శకులు. ఇది ఒక బయకారం వీరగాథ (బల్లాడ్). ఈ మంజరీ ద్విపద జంగం కథను వ్రాసినది. లోక కవి, గంగుల యెల్లయ్య కొడుకు—సిన యెల్లయ్య. ఇది బ్రిటీషు కంపెనీ రాజ్యంలో 1630లో వ్రాయబడినది (నేటి మదరాసు మైలాపూరు వర్ణన ఇందున్నది.)

మొదటి కథ — మనుమసిద్ధి అంతఃపుర కలహం. మనుమసిద్ధి పెదనాయన కొడుకు తిక్కరాజు — పరిహారి (ద్వారపాలక) బయ్యన చేసిన కుట్రతో రేగిన తిరుగుబాటిది. ఇది కాకతి గణపతి దేవుని సహాయంతో అణచబడినట్లు(1249) శాసనాధారంఉన్నది. వీర్యవంతమైన భాష—శైలివల్లకాటంరాజు కథ లోకఖ్యాతిని పొందినది. వేణు గోపాల శతకం వ్యంగ్యంగా ''రామాండ కతలెల్ల మే మెరుంగనివియే ? కాటమరాజుకు కర్ణుడోడె'' అని ఎగతాళి పట్టిస్తున్నది.

''పశువులుతిని త్రేన్చె'' అంటాడు కవి. పశువులు నెమరు వేస్తవి. కవి వీటిని మత ద్వేషాలంటాడు. కాని, వీటికి ఏ మత సంబంధంగాని లేదు.

ఈ చిన్నవాటివల్ల ఈ కవి కమనీయ కవిత్వానికి కందువు కలుగలేదని మనవి చేస్తున్నా.

## ఆవేదన పుష్పం

[పద్యకృతి. కాసోజు లక్ష్మీనారాయణాచార్యులు. క్రౌన్ — 32 పొరటలు; వెల 1—25 రు/—, ప్రతులకు : గ్రంథకర్త, 67, వల్లభదాసు బిల్డింగ్, చార్‌కమాన్, హైదరాబాదు — 500002.]

ఒక ''పసివాడు''—బడియే గుడియంచు నమ్మి'' ఆధ్యాత్మిక సంపద కోసరం ''జీవన్ముక్తుని చేయమని — అమ్మలగన్న అమ్మను'' ధర్మావేదనతో అర్చించిన నివేదన పుష్పం — ఈ శతకం. లోక క్షతిమానికి అక్రమాలకు ఈ బాల భక్తుని ఎద పొక్కిపోతున్నది.

ఈ కంద పద్యాల శతక కవిత్వ భాష మంచిపాకంలో బడినది. 'నను గన్న తెలుగుతల్లిని'' ఉప్పొంగి ప్రార్థిస్తున్నాడు. ''కలవందురు సర్వంబున, కలవందురు సర్వప్రాణి కదలికలోనన్'' అని పోతనామాత్యుని బాణిలో బడినాడు, ఎదిగే తరుణ హృదయం బాగుండే లక్షణమే ఇది కొన్నిచోట్ల జీవన్ముక్తిని కోరినా ''వచ్చెద నీ చెంత జేర వరమియివంబా'' అని శాశ్వత వైకుంఠవాసాన్నే కోరు

తున్నాడు విశిష్టాద్వైత వాసనాబలం ఈ వైష్ణవుని వదలక పోవడం సహజమే! కొన్ని భావాలు మానసికోన్మీలనాన్ని సూచిస్తున్నవి, చూడండి :— నా తల్లి, నిన్ను నమ్ముచు రాతిరి నిదురించుచుంటి రావేయంబా (ఎంతటి విశ్వాసం!) కనవా, వలవల యేడ్చితి వినవా, దీనుని మొర వినిపించుటలేదా—అని త్యాగరాజస్వామి ఆవేశాన్ని చూపుతున్నాడు ఆకలి డొక్కల అరపులు, పేదల ప్రేగుల అరపులను గూడ వినిపిస్తున్నాడు. కుండల కుతకుతలు — ఎట్టికియే పెరుగువారు—ఇట్లాంటి మంచి పదబంధాలున్నవి "నరకము స్వర్గమటంచును నరులను పాలించు రీతి న్యాయంబేనా" అని పురాణాలు కల్పించిన మిథ్యావాదాన్ని విమర్శిస్తున్నాడు.

## మాట్లాడిన మానవత

[వచన కవిత. సున్నా అచ్యుతరావు. డెమ్మి-96 పేజీలు, ధర 5 రు—; ప్రతులకు : గ్రంధకర్త, పొడుగు నారాయణమ్మ కాలని, శ్రీకాకుళం 532001.]

మానవతనే మాట్లాడిస్తున్నాడు—ఈ క్రొత్త త్రోవ అరసే కవి; ఈ పదం బాగున్నది. ఈయన భావుకత నవనవోన్మేషంతో జీవంగల భాషలో వ్యక్తమవుతున్నది. ఈ కవి సంస్కారిత మానసం "ఆనందాన్ని విషాదాన్ని ఒకేమాదిరిగా ప్రేమిస్తున్నాను" అని అనగలిగి; నేటి కొందరి కవుల అక్కసాన్ని ఆక్రోశాన్ని దూరంగాబెట్టి, సమన్వయానికి చూస్తున్నాడు. "ఉమ్మలికము నుబ్బు నాదు మదముందునక్కైన లేదు వాసనా" అన్న భారత వాక్యాన్ని మనసుకు దెస్తున్నాడు కాబట్టే "కష్టసుఖాల మిట్టపల్లాలు" దాటుతున్నాడు. (చక్కటి ప్రయోగం) కన్నీటి కడలి ఖండిక అభాగ్యులు సుఖశాంతుల ఆకాంక్షిస్తూ, శ్రీమంతులైన దోపిడిగాండ్రను శపించకుండా ఉన్నది. ఏది మానవత్వం అన్న శీర్షిక ప్రజల సంరక్షణపేర నెత్తురుకూడు తింటున్న విప్లవవీరుల (నక్సలైట్లు) హింసాకాండను మండే మాటలతో గర్హిస్తున్నాడు. కాబట్టే ప్రేమ పరిమళించిన కవిత్వాన్ని నెచ్చెలితో చెప్పగలిగి ఉన్నాడు:— "కర్తవ్యాన్ని మరచి ఊహలలో ఊగిపోకు, వాస్తవాన్ని విడిచి స్వప్నాలలో కరిగిపోకు" అని పదేపదే చెపుతున్నాడు. ఇంతకూ ఈ కవి ఇంటిపేరు సున్నాగాని, ఎదమాత్రం నిండుకుండ.

ఈ రచన సూటిగా మదికెక్కేటట్లున్నది. సరళమైన భాషలో, నుడికారంపు భావసుమాలను వికసింపజేసి, వాసనల వెదజల్లుతున్నది. "ఆశాదీపాల వెలిగించాల" అని ఆశావాదిగా ముందుకు సాగుతున్నాడు.

వ్రాతలో ఒక వికాసగుణమున్నది:- ఆశయాల కాంతి కిరణాలు; నాగార్జునసాగరాలు తడిసిన మా ముంగిటి క్షేత్రాలు; అలజడుల తోరణాలు-ఇట్లా మంచి మాటలున్నవి.

చాలామంది కవులవలెనే ఈయన గూడ "మయూరి వయ్యారి నాట్యం" అంటున్నాడు. పురి అందము ఆట మగ నెమలికే ఉండేది జీవకోటిలో పురుష జాతికే సహజ సౌందర్యముండేది.

కళాప్రపూర్ణ మసుపూరు కోదండరామరెడ్డి

## గ్రంథస్వీకారాలు

* వైరభక్తి (పద్యసంపుటి) రచయిత : శ్రీ చెఱుకుపల్లి జమదగ్నిశర్మ. వెల : రూ. 5 - పేజీలు : 72. ప్రతులకు : రచయిత, కాళహస్తి, చిత్తూరు జిల్లా.

* ఆదికవి (వాల్మీకి చరిత్రము) రచయిత : శ్రీ పృథివి సుబ్బనాగయ్య, పేజీలు : 62 వెల : రు 3–50. ప్రతులకు: రచయిత, 29/353, శివాలయం వీధి, దేవాంగులపేట, మచిలీపట్నం-521001.

* ఆర్యాశతకము (ద్విపద) రచయిత : శ్రీ కసిలవాయి లింగమూర్తి, పేజీలు : 40. వెల : రూ. 1–50 పై. ప్రాప్తిస్థానం కె. గోపాలకృష్ణ, న్యూస్ ఏజెంట్, బస్ స్టాండ్, నాగర్ కర్నూలు.

* శ్రీనివాస, శ్రీ గాయత్రీ వృత్తములు (అపూర్వచ్ఛందః ప్రకరణము) పేజీలు : 36, వెల : రూ. 10/-; దశగీత గీత సందేశము. పేజీలు 24, వెల తెలియదు పై రెండు పుస్తకములకు రచయిత : బహుభాషా చలన చిత్ర కవి గాయక పి. బి. శ్రీనివాస్. ప్రతులకు: పి బి. యస్. పబ్లికేషన్స్, పి. బి. 3355, మద్రాసు-600035.

* భర్తల సభ రచన : చారాకృద. పేజీలు : 54. వెల : రూ. 2 — ప్రతులకు : సుందరవల్లి పబ్లికేషన్స్, వేకనూరు (పోస్టు) 21121. వయా : అవనిగడ్డ, కృష్ణాజిల్లా.

* 'శ్రీరామాయణ సారామృతము' అను 'శ్రీ దాశరథీ మకుట కందశతకము!' రచయిత : శ్రీ టంకాల సత్యనారాయణ. పేజీలు . 40, వెల : రూ. 2–40 పై. ప్రతులకు : రచయిత, నివగాం—532457 శ్రీకాకుళం జిల్లా.

* షడ్దర్శనములు రచన : శ్రీ యస్. టి. జి. వరదాచార్యులు. అనుబంధ వ్యాసము : శ్రీ దేవత సుబ్బారావు. పేజీలు : 22. వెల : 2 — ప్రతులకు : దేవత సుబ్బారావు, కన్వీనరు, అధ్యాత్మ సాధక సమితి, 661 ఏ, ఎన్. హెచ్ 4, బి హెచ్ యి ఎల్, రామచంద్రపురం, హైదరాబాదు—500032.

Printed and Published for Nageswara Rao Estate (Private) Ltd., by S. Radhakrishna at the Andhra Patrika Press, Gandhinagar, Vijayawada-3. Editor S. Radhakrishna, Vijayawada. Phones: 75667 & 75226.